పిల్లల మాస పత్రిక

జనవరి 1985

# బాలరంజని

రంగు రంగుల ముఖచిత్రం!

★ కథలు! ★ సీరియల్‌లు!

★ బొమ్మల కథ!

★ విజ్ఞానాన్ని పెంచే వ్యాసాలు!

ఇంకా చిన్న పిల్లలనీ (పెద్దవారిని-కూడా!) అలరించే బొమ్మలు, శీర్షికలు, వింతలు, విశేషాలు!

ప్రతి పేజీ లోనూ రంగు రంగుల బొమ్మలు!

నేడే మీ కాపీ రిజర్వు చేసుకోండి!

వెల 150 పైసలు

ఆంధ్రపత్రిక ప్రచురణ

# మనలో మాట

మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజంట్లు, ప్రకటనకర్తలందరికీ కొత్త సంవత్సర శుభాకాంక్షలు.

గత కొన్నివారాలుగా ఆంధ్రసచిత్రవారపత్రిక చాలా ఆలస్యంగా విడుదల అవుతున్నదని ఎంతో మంది పాఠకులు ఉత్తరాలు రాస్తున్నారు తగినంత ముందుగానే ప్రతి సంచికనీ పాఠకులకి అందచెయ్యాలనే సంకల్పంతోనే శాయశక్తులా కృషి చేస్తున్నాము సంచిక సకాలంలోనే తయారవుతున్నా దానిని అచ్చువేయడానికి వాడె న్యూస్‌ప్రింట్ సమయానికి అందకపోవడం వల్ల ముద్రణ ఆలస్యం అయి విడుదల సక్రమంగా జరగటం లేదు

దిగుమతి చేసుకునే న్యూస్‌ప్రింట్ శాతాన్ని ప్రభుత్వం 35కి తగ్గించింది మిగతా 65 శాతం దేశంలో ఉత్పత్తి అయ్యే న్యూస్‌ప్రింట్‌నే వాడాల్సి ఉంటుంది దీని వెల కూడా ఎక్కువే వెల ఎక్కువైనా తగినన్ని నిల్వలు లేనందువల్ల అప్పుడప్పుడు తీవ్రమైన కొరత ఏర్పడుతూ ఉంటుంది ఈ కాగితం కొరత కారణంగానే ఆంధ్రసచిత్రవారపత్రిక విడుదల ఆలస్యం అవుతున్నది త్వరలోనే పరిస్థితులు మెరుగై సకాలంలో ప్రతి సంచికనీ పాఠకులకి అందించగలమని ఆశిస్తున్నాము అంత వరకూ పాఠకులు వోర్పు వహించి ఎప్పటివలెనే తమ ఆదరాభిమానాలని అందించి సహకరించవలసిందిగా మనవి చేస్తున్నాము




## ముఖచిత్రం

నా అబిమాన నటి జయప్రద ముఖ చిత్రం వేసినందుకు చాలా సంతోషం

కెంగు వరంగ ప్రసాద్, వీరఘట్టాం

● ● ● ●

విజయశాంతి ముఖ చిత్రంతో వెలువడిన మన పత్రికలో జీవితపు విలువలు మారుస్తున్న నాశికా శిశువులు మాకు తెలియని విషయాలను తెలియ చేసింది

–రెడ్డి నాగేశ్వరరావు, మాచర్ల

● ● ● ●

7-12-84 నాటి ఆంధ్ర సచిత్రవారపత్రిక ముఖ చిత్రం అందాల నటుడు కమలహాసన్ చాలా బాగుంది

బత్తుల వెంకటేశ్వరరావు, కాకినాడ

## దురభిప్రాయం

ఆంధ్ర సచిత్ర వారపత్రిక (30-11-84) న్యూఢిల్లీ లేఖలో కప్లింగ్ పాశ్చాత్యములు కలియవని వ్రాసాడని విమర్శకు గురి అయినాడు అయితే ఆ పద్యములోనే ఇద్దరు గొప్ప వ్యక్తులు కలిస్తే తూర్పు పడమర వ్యత్యాసము లేదనికూడా వ్రాసాడు

(66వ పేజీ చూడండి)



ఆంధ్రసచిత్రవారపత్రిక
వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)
శుక్రవారం 28-12- 84
శ్రీ రక్తాక్షినామ సం పుష్య శు షష్ఠి
సంపుటము 77 : సంచిక 17
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడిప్రతి వెల | రు | 2-00 |
| ఆరు మాసాల చందా | రు | 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు | 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

# వ్యాపారంగా మారిన రాజకీయాలు!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

ఆలోచించి చూస్తే ఇవి ఆసక్తికరమైన ఎన్నికలు. వాస్తవానికి పెద్ద సమస్యలు అంటూ ఏమి దీంట్లో లేవు. ఈ వ్యాసం రాసే సమయానికి రాజీవ్‌గాంధీ కాంగ్రెసు పార్టీ కంప్యూటర్‌లు తదితర హడావుడిలో మునిగి ఉంది. ఇంత వరకు (ఈ వ్యాసం రాసే వేళకు) ఎన్నికల ప్రణాళిక విడుదల చేయలేదు. రాజీవ్ గాంధీ కాంగ్రెసు అని ఎందుకు అంటున్నానంటే అనేక కాంగ్రెసు పార్టీలు ఉన్నాయి కనుక. శ్రీమతి గాంధీ ప్రభావం తన మీద పడిందనుకుంటున్న గొప్ప కాంగ్రెసు వాది అబ్దుల్ రహమాన్ అంతూలే కూడా తన స్వంత కాంగ్రెసు పార్టీ పెట్టుకున్నాడు. వాస్తవానికి కమ్యూనిస్టులు సహితం 'ఎన్నికల ప్రణాళిక' అని చెప్పడానికి వెరచి 'ఓటరుకు విజ్ఞప్తి' అంటున్నారు. బహుశః అంతకన్నా వారు చేయగలిగిందేమీ లేదన్నట్లు. నిజమైన 'ఎన్నికల ప్రణాళిక'ను రూపొందించిందెవరంటే భారతీయ జనతాపార్టీ వారనవచ్చు. వార్తా పత్రికల సంపాదకీయాల వల్ల ఆ విషయం స్పష్టంగా తెలుస్తోంది.

ఇంతకీ చెప్ప వచ్చేదేమిటంటే 75 కోట్ల జనాభా కలిగిన సువిశాలమయిన భారత దేశంలో భవిష్యత్ దృక్పథం కలిగి, తన కలలతో ప్రజల ముందుకి వెళ్ల కలిగిన పార్టీ ఒక్కటే ఉంది. కాంగ్రెసు అంటే రాజీవ్‌గాంధీ, అరుణ్ నెహ్రూ, వాళ్ల కంప్యూటర్లు తప్ప మరేమీ కాదు. ఇంద్రజాలికుడు దొర టోపీలోనించి, లేదా గాంధీ టోపీలోనించి కుందేళ్లను తీసినట్లు వీరు తమ అభ్యర్థుల ఎంపికలో కంప్యూటర్లపై ఏ విధంగా ఆధారపడ్డారో అదే విధంగా తమ ఎన్నికల ప్రణాళికను విడుదల చెయ్యడానికి కూడా వారు కంప్యూటర్‌పైన ఆశలు పెట్టుకుని ఎదురు చూస్తున్నారని నాకు అనుమానంగా ఉంది. లంకాషైర్‌లో ఆవిరి యంత్రం పని చెయ్యడం ప్రారంభించిన 200 సంవత్సరాలకి ఈ అధికార పార్టీ యాంత్రిక యుగంలోనికి ప్రవేశించింది.

శ్రీమతి గాంధీ ఎప్పుడూ ఆధునీకరణ గురించి మాట్లాడుతూ ఉండేవారు. ఈ దేశానికి అది ఆమె ఇచ్చిన ఒక గొప్ప కానుకగా ఆమె అభిమానులు పొగుడుతారు. అయితే ఆధునీకరణం అంటే ఏమిటి? మారుతీ మోటారు కారులు, వెలిసిపోయిన జీన్స్ దుస్తులు వేసుకోవటం, చెత్త తిండి దొరికే పిజ్జా పార్లర్లు వగైరాలా! దేశాన్ని నడపాలనుకొన్నవారి హృదయపు లోతుల్లో నుండి వాస్తవమైన ఆధునీకరణ ప్రారంభం కావాలి. కాంగ్రెసు (ఐ)కి ఎన్నికలనేవి ఒక వ్యాపారం లాంటివి. అభ్యర్థుల సంఖ్యని బట్టి చివరికి ఫలితం నిర్ణయించబడుతుంది. ఈ అభ్యర్థుల నాణ్యతకంటే సంఖ్యే ప్రధానం. మీరు పెయింట్లు లేదా బూట్ పాలిష్ అమ్మేటప్పుడు, ఒక పెయింట్‌కీ మరొక పెయింట్‌కీ ఒక బ్రాండు బూట్ పాలిష్‌కీ మరోదానికీ మధ్య సాంకేతికంగా కొంత తేడా ఉన్నా ఒక పెయింట్‌కీ మరోదానికీ వాస్తవంగా తేడా ఉండనట్లే ఇది కూడా. కుటుంబ రాజకీయాల్లో చేరడానికి ముందు అరుణ్ నెహ్రూ పెయింట్‌లు అమ్మేవాడు. అరుణ్‌సింగ్ బూట్‌పాలిష్, ఆవాల నూనె, అమ్మేవాడు. ఇప్పుడు వారు ఒక రకం బూట్ పాలిష్‌లా అభ్యర్థులని అమ్ముతున్నారు. వారు కూడా ఒక విధమైన బూట్ పాలిష్‌లాంటివారే. ఈ పని చేయడానికి సమస్యలు, ఎన్నికల ప్రణాళికలు అవసరం లేదు. కావలసినదల్లా సరకుని బాగా అందంగా పేక్ చెయ్యడం, చక్కని ప్రచారం ఆకర్షణీయంగా చేయడమే. భారత రాజకీయాల స్థాయిని బజారులో వస్తువులలా దిగజార్చినందుకు వీరిని నేను నిందించను. ఆ పని చేసింది శ్రీమతి గాంధీ. 'గరీబీ హటావో' అన్నది తమ తలకు మించిన పని అని తెలిసి కూడా ఆ నినాదంతో ఆమె తన పబ్బం గడుపుకొన్నారు. రాజకీయాలలో ఆమె వ్యాపార నైపుణ్యంగల మొట్టమొదటి వ్యక్తి. రాజకీయాలలో చిత్రమైన గమ్మత్తులు చూపిన మొదటి రాజకీయవేత్త ఆమె. ఆ విధంగా ఆమె గోబెల్స్‌లాంటి ఆధునిక వాది అనవచ్చు.

అమ్మకం చేయడానికి వస్తువు ముఖ్యం కాదు. ఇక్కడ ముఖ్యమైనదేమిటంటే నైపుణ్యం. అందువల్లే అమ్మకాలలో ఉండే వ్యక్తులు ఒక కంపెనీ నుంచి ఇంకొక కంపెనీకి మారుతూ ఉంటారు. వారికసలు తాము అమ్మే జున్నుకీ సుద్ద ముక్కకీ, పెయింట్‌కీ మద్యానికీ, ఏదైనా సరే, వాటి తేడా కూడా తెలీదు. అరుణ్ నెహ్రూ, అరుణ్ సింగ్‌లు మహాత్మాగాంధీకి జవహర్‌లాల్ నెహ్రూకు తేడా తెలీని వారని నేను ఖచ్చితంగా చెప్పగలను. అలాగే వారికి సోషలిజం, పెట్టుబడిదారీ విధానాలకు మధ్య తేడా తెలీదు. ఏ సిద్ధాంతాన్ని అమ్మడంలో లేని వీరు రాజీవ్‌గాంధీని అమ్మడం అనే వ్యాపారంలో మాత్రం ఉన్నారు. 1980లో శ్రీమతి గాంధీ పేర ప్రచారం జరిగినట్లుగానే 1984 ఎన్నికల్లో శ్రీ రాజీవ్‌గాంధీకి ప్రచారం జరుగుతున్నది.

కమలాపతి త్రిపాఠీలాంటి కురు వృద్ధులకు ఈ పక్కా వ్యాపార వాతావరణం వెగటుగా అనిపిస్తూ ఉండి ఉండవచ్చు. అంటే వారి కాలంలో వారు అమ్ముడుపోలేదని కాదు. కానీ, వీరికీ వారికీ పెద్ద షాపు పెట్టుకొన్న డిప్లొమా టైలర్‌కీ వీధి అరుగు మీది దర్జీకి ఉన్న తేడా ఉంది. నిజానికి వై. బి. చవాన్‌లాంటి వారికి ఈ చాతుర్యం తెలీకే రాజకీయాలలో పక్కదార్లు పట్టారు. నేను చవాన్‌ను ఎప్పుడూ కలవలేదు. కానీ ఆయన 1942 ప్రాంతంలో అజ్ఞాత స్వాతంత్ర సమరయోధుడిగా దేశం కోసం ఎంత పాటు పడ్డారో, ఆయనకు కవిత్వం అన్నా సాహిత్యం అన్నా ఎంత ఆసక్తి ఉన్నదో నాకు తెలుసు. ఆయన తమ జీవితంలో రెండు తప్పటడుగులు వేశారు. 1969లో వి. వి. గారికి కాకుండా సంజీవ రెడ్డిగారికి ఓటు వేసి శ్రీమతి గాంధికి ఎదురు తిరిగారు. 1977 ఎలక్షన్ల తరువాత ఎమర్జన్సీని నీతి బాహ్యమైన చర్యగా చిత్రించారు. ఈ రెండు తప్పటడుగులు రాజకీయాలలో ఆయన పతనానికి కారణమయ్యాయి. చివరికి ఆయన ఒంటరితనంతో, అసంతృప్తితో తనువు చాలించారు.

పరిస్థితిని నేను సరిగా అర్థం చేసుకొన్నానని చెప్పలేను కానీ చవాన్ ఇతర కాంగ్రెసు వాదులలాగే తమ పార్టీ అభ్యర్థికి తాము ఓటు వేయడం న్యాయం అని భావించి ఉండవచ్చు. ఎమర్జన్సీని నీతి బాహ్యమైన చర్యగా వర్ణించడం పెద్ద దోషమేమీ కాదు. యశ్వంతరావు బలవంతరావు చవాన్‌కు రాజకీయాలని తమ కనుకూలంగా మలచుకునే నేర్పు లేదు. అలాంటి సున్నితమైన వ్యక్తులు శ్రీమతి ఇందిరా గాంధీకి పనికి రారు. అందుకే అరుణ్‌లు తమకి బాగా ఉపయోగపడతారని ఆమె వారిని అంతరంగికులుగా నియమించుకున్నారు. □

## వ్యక్తిగతం



శ్రీమతి ఇళాబట్ (51) గుజరాత్‌కి చెందిన ట్రేడ్ యూనియన్ నాయకు-రాలు ఇటీవల ఈమె స్టాక్‌హోంలో నోబెల్ బహుమతికి సరి తూగేదిగా చెప్పబడు తున్న, రైట్ లైవ్‌లీ హుడ్ బహుమతిని 1984వ సంవత్సరానికి అందుకున్నారు కెన్యా, ఫిలిప్పయిన్స్ దేశాలకి చెందిన మరో ఇద్దరు మహిళలతో ఆమె ఈ బహుమతిని పంచుకున్నారు ఈమెకి 1977లో మెగ్‌సేసే అవార్డు, 1983లో సుసాన్ అంటోనీ అవార్డు లభించాయి అహమ్మదాబాద్‌లో స్వయం ఉపాది కల్పించుకున్న మహిళల సంఘానికి ఈమె ప్రదాన కార్యదర్శిగా ఉన్నారు పేద మహిళలకి తమ సంఘం నెలకొల్పిన బాంక్ ద్వారా ఋణాలు అందజేసే సౌకర్యాన్ని కల్పించారు దీనికి మంచి ప్రచారం లబించి ఎన్నో రాష్ట్రాలలో ఇటువంటి సంస్థలని నెలకొల్ప డానికి దోహదం కలిగించింది



కృత్రిమ గుండె జార్విస్-7 అమర్చబడ ప్రపంచంలో జీవించి ఉన్న ఏకైక వ్యక్తి విలియం శ్రోడర్ ఈ గుండె మార్పిడి శస్త్ర చికిత్స చేసిన డాక్టర్ విలియం డేవ్రిస్ (40) ఈయనని ఇంకా తమ పర్యవేక్షణ కిందే ఉంచు-కుని చికిత్స చేస్తున్నారు ఈ శస్త్ర చికిత్సకి లక్ష డాలర్లకి పైగా ఖర్చు అయిందట వైద్య ప్రపంచం దృష్టి అంతా ఇప్పుడు శ్రోడర్‌పైనే ఉన్నది.



మావెన్ అలెక్స్-నలోవ్ జింబాబ్వే ప్రధాన మంత్రి రాబర్ట్ ముగాబేకి అత్యంత సన్నిహితుడైన సెనెటర్ ఇటీవల ఈయన్ని కొందరు గుర్తు తెలియని దుండగులు ఆయన ఇంటిలోనించి అపహరించుకునిపోయి దారుణంగా చంపేశారు. ఈ సంఘటన జింబాబ్వే ప్రజలని ఎంతగానో కలవరపరిచింది




## 28-12-1984 శుక్రవారం మొదలు 3-1-1985 గురువారం వరకు

★ **మేషం**. వారఫలం ఉత్తమమే చేసే వృత్తి యందు మేలున్నది ప్రతిభ రాణిస్తుంది కళారంగ ప్రీతి అధికమవుతుంది వారాంతంలో ధనలబ్ధి స్త్రీలకు సుఖ శాంతులు ఉద్యోగమందేదో సదవ-కాశం లభ్యం కాగలదు

★ **వృషభం** రాజకీయంగా మేలు, మిత్ర వర్గీయుల వలన లాభం, పత్రికా రంగాన అను-కూలత, చలన చిత్ర నిర్మాణం అనుకూలం కావటం సంభవం స్త్రీలకు నూతనాంశాలు గ్రహింపునకు రావటం, పెద్దల అనుభూతి చూరగొనటం సంభవం

★ **మిధునం** అధికారుల మన్నన లభిస్తుంది ఆదాయమందు అభివృద్ధి కనిపిస్తుంది అవసరా-లకు తగిన ద్రవ్యం అందటం, వారాంతానికి గృహ సంబంధమైన మేలు చేకూరటం గమనింపదగిన అంశం స్త్రీలకు సర్వతోముఖాభివృద్ధి సంభవం

★ **కర్కాటకం** ఆదాయమందు వృద్ధి, సర్వ కార్యానుకూలత, రాజకీయంగా మేలు ఇతరులకు మేలు చేయుటవలన గౌరవాభివృద్ధి, ప్రయాణ సంబంధంగా అనుకూలత, సభా గౌరవం కొందరకు పత్రికా గౌరవం కొదరకు లభ్యం కాగలదు స్త్రీలకు నూతనోద్యోగ ప్రాప్తి, కొందరకు ఆరోగ్య లోపం

★ **సింహం** నూతన వ్యవహారాలందు అను-కూలత సంభవం మిత్ర వర్గీయుల వలన ఉపకారం, రాజకీయంగా పదిమందిలో ప్రతిష్ఠ, అభీష్టసిద్ధి, రచనా వ్యాసంగాన సత్ఫలితం అందుకోనున్నారు స్త్రీలకు ఉద్యోగ సంబంధంగా చేసిన యత్నాలు ఫలిస్తాయి గౌరవాభివృద్ధి

★ **కన్య** ధన ధాన్య వస్తు వాహన సంబంధంగా మేలు సంభవం అయివోజానందు చెప్పదగిన అభివృద్ధి చేకూరుతుంది చాలమందికి సభా సత్కారం చెప్పదగిన అంశం ఉద్యోగ రీత్యా అను-కూలత, ఒకవేళ 'ప్రమోషన్' కొందరకు లభ్యం కావటం చెప్పదగిన అంశం స్త్రీలకు గౌరవ-మందభివృద్ధి, వృత్తియందు పెంపుగల వారం

★ **తుల** శని భగవానుని దయా విశేషంతో సత్ఫలం అందుకోనున్నారు వ్యాపారమందు అభి-వృద్ధి సంభవం చాలమందికి వాహన సౌకర్యం ఏర్పడనున్నది ప్రయాణానుకూల్యత గల దినం స్త్రీలకు సభా గౌరవం, ఉద్యోగమందు అభివృద్ధి-గల వారం

★ **వృశ్చికం** మీకు గల వ్యవహార జ్ఞానం లాభ-దాయకమవుతుంది ప్రజారంగంలో మీకు పేరు ప్రతిష్ఠలు లభ్యం కాగలవు వ్యాపార రీత్యా మేలు చేకూరుతుంది రాజకీయంగా మీ ప్రయత్నాలు సఫలం కాగలవు స్త్రీలకు సర్వ రంగాలలో అభి-వృద్ధి సూచక వారం గృహానందం చేకూరుతుంది

★ **ధనుస్సు**: అధికార రీత్యా మీకు మేలు చేకూరుతుంది నూతన వస్తు సేకరణకు అను-కూలం కొందరు వాహనం కొనుగోలు చేయగలరు చుట్టుప్రక్కలవారితో తగాదా తంటాలు రాకుండా చూచుకోవాలి స్త్రీలకు శుభ కార్య ప్రస్తావనలు రాజకీయంగా మేలు కొందరకు చేకూరుతుంది

★ **మకరం** అధికారరీత్యా మేలు సంబవం నూతనాంశాలు చేకూరుతుంది స్థితి గతుల-యందభివృద్ధి చేకూరుతుంది రాజకీయవాదులకు సదవకాశాలు లభిస్తాయి స్త్రీలకు సుఖ శాంతులు, ఉద్యోగమందు అభివృద్ధి, సభా రంగాన మర్యాద చేకూరుతుంది

★ **కుంభం** నల్లని వస్తు విక్రయమందు మేలున్నది గృహ సంబంధమైన వ్యవహారాలందు హాయి చిక్కుతుంది వ్యవహారం ఏదయినా ఉంటే పరిష్కారం కాగలదు గాయక, నట వర్గానికి మేలైన దినం, ధన లబ్ధికి అవకాశం స్త్రీలకు కుటుంబ కలతలకు ఆస్కారం గల వారం

★ **మీనం** · అధికారుల వలనగాని, ప్రభుత్వము మూలంగాగాని, ధనాఢ్యులమూలానగాని చాల మందికి మేలు సంభవం వ్యాపార రీత్యా మేలైన వారం వ్యాపార సంబంధంగా మేలుంటుంది సభా రంగాన కొందరకు మేలున్నది విలువగల వస్తువులో, వస్త్రములో కొనుగోలు చేయగలరు, స్త్రీలకు ధన సంపాదాభివృద్ధి, గృహానందం, శుభ కార్యానుకూలతకు అవకాశం గల వారం

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

హార్లిక్స్ మా కుటుంబంలో ప్రతి ఒక్కరికి మిత్రుడు వంటిది - రోజంతా ఆఫీసు పనితో అలసి వచ్చే మా శ్రీవారికి, కాలేజికి, డాన్సు క్లాసుకి వెళ్ళివచ్చే మా అమ్మాయికి, ఫుట్‌బాల్ హీరో మా అబ్బాయికి. అంతెందుకు, రోజూ మార్కెట్ పని ముగించుకుని ఇంటికి వచ్చాక , నేను కూడా ఒక కప్పు హార్లిక్స్ త్రాగవలసిందే! హార్లిక్స్ మాలో ప్రతి ఒక్కరికి మేలు చేస్తుందని నా నమ్మకం.

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికర మైన పానీయం.

పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్మేకాట. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?







మంచి పుష్టికరమైనది




## (గత సంచిక తరువాయి)

పెండ్లి ప్రయత్నాలు జోరుగా సాగాయి ఆఖరి పెండ్లని యిరు పక్షాలవారూ మనసైన యేర్పాట్లు చేశారు పెండ్లి ముహూర్తం సమీపించింది ఇల్లంతా బంధువులతో కళకళలాడుతూంది ఆ సంబరాలకు రాజ్యలక్ష్మి వుత్సాహంతో కేరింతలు కొట్టింది ప్రభావతి యెవ్వరూ లేని తావుకు పాపను తీసుకువెళ్లి తన మనసులోని తీయని భావాలను రాజ్యానికి విప్పి చెప్పేది ఆ చిన్న పాపకు యేమీ అర్థం కాకపోయినా యెంతో జాగ్రత్తగా వినేది ఒక అందమైన బాబాయి వస్తారని పిన్నిని ప్రేమిస్తారనీ పిన్ని అతనితోటే వుంటుందని అర్థం చేసికోగలిగింది

మరి నీతో నేనుండనా?

హఠాత్తుగా రాజ్యం వేసిన ప్రశ్నతో ప్రభావతి మూగదైంది ఆమె గుండెను యెవరో మెలి త్రిప్పినట్లనిపించింది ఇంత వరకూ తాను పాప విషయమే ఆలోచించలేదు రాబోయే భర్తను గూర్చి, అతని తోటి మధుర జీవితాన్ని గూర్చి మాత్రమే తలపోసింది ఆ వూహల్లో యీ చిన్ని పాపకు యెందుకు తావివ్వలేకపోయింది తనను తాను ప్రశ్నించుకుంది ప్రభావతి జవాబు అందీ అందకుండా వుంది

పాపను దగ్గరకు లాక్కుని గుండెలకు హత్తుకుంది

నీ మనసంత నిర్మలమైనది కాదు తల్లీ నా మనసు అంది '

పాపకు మాత్రం జవాబు దొరకలేదు కాలం చెప్పిందా ప్రశ్నకు సమాధానం

పెళ్లి నిరాటంకంగా వైభవో పేతంగా జరిగిపోయింది

ఆనందాతిశయంతో పిన్నీ, బాబాయిలు పోటీలు పడి తలంబ్రాలు పోసుకోవడం బిందెలో వుంగరాలు తీయడం రాజ్యం చూడలేదు చూస్తే మరి సంతోషించేదో లేక బాబాయి మీద యీర్ష్య చెందేదో గానీ తాను మాత్రం హాయిగా తల్లి ఒడిలో పడుకుని నిశ్చింతగా నిద్రపోయింది

ప్రభావతి భర్తతో తరలి వెళ్తుంటే రాజ్యం పెట్టిన పేచ యెవ్వరూ వూహించలేనిది ఆమెను పట్టి ఆపటం యెవ్వరితరమూ కాలేదు పాప యేడ్పు చూడలేక ప్రభావతి కార్లో నుంచి దిగబోయింది సాధ్యం కాలేదు కొంగు భర్త చెంగుతో ముడి పడి వుంది

పోనీ దాన్ని కూడా పంపు అంది దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ తల్లితో

ఆమె కాదు అనలేక ప్రక్క చూపులు చూడసాగింది

రామస్వామి విచిత్రంగా తిలకిస్తున్నాడు

పోనీయండి' అన్నారెవరో

కారు సాగిపోయింది పూల మాలలతో అలంకరించబడి, మెత్తని కుషన్లతో కూడిన కారులో యింత కాలంగా యే వ్యక్తి సన్నిధినైతే తాను ప్రతి క్షణం కాంక్షించిందో అతని ప్రక్కన అతని చేయి, భుజాలు ఆమెను సతారంగా తాకుతున్నా ఆ స్పర్శను యే మాత్రం అనుభవించకుండా నిశ్చలంగా కూర్చున్న హృదయంలోని తుపానును యెవ్వరూ గుర్తించలేదు

పిన్న వయస్కురాలైనా అనుభవశూన్యురాలైనా కూడా ఆమె గ్రహించింది, కొన్ని అనుబంధాలు గుర్తింపు లేకుండా మిగిలిపోతాయనీ వాటిని పెంచుకోవడం వివేక రహితమనీను

అత్తగారింట్లో మూడు నిద్రలూ ముచ్చటగా గడిచిపోయాయి ఆ మూడు రోజుల్లో ఆమెను ముప్పై మంది అడిగారు ఎవరా పిల్ల? మీ అక్క కూతురా? నీకు బాగా అలవాటనుకుంటా! ఏం, మీ అక్క పిల్లల్ని పెంచదా? ఈ చివరి ప్రశ్నకు ప్రభావతి మేనత్త జవాబిచ్చిందిగానీ ప్రభావతికి సంతృప్తికరంగా లేదు ఆ రోజే సత్యనారాయణ వ్రతం ప్రభావతి తరఫు బంధువులంతా ఆ వుదయమే వచ్చారు చిన్న కొడుకును ఒళ్లో వేసుకుని జోకొడ్తున్న కామేశ్వరికి యీ సంభాషణంతా స్పష్టంగా వినిపిస్తూనే వుంది ఆమె వదనం మ్లానమైంది

అప్పటికే పిన్ని చూచి కొన్ని యుగాలైనట్లుగా బాధపడ్తున్న రాజ్యం అన్నం పిన్నే పెట్టాలి తానం పిన్నే చేయించాలి అని మారం చేస్తోంది పిన్ని మెడ చుట్టూ చేతులు వేసి గారాంపోతూంది పాప చేస్తున్న యీ అల్లరితో రెండు నిమిషాలకు ముందు జరిగిన సంభాషణలు ప్రభావతి మర్చిపోయింది కానీ కామేశ్వరికి పుండు మీద కారం చల్లినట్లయ్యింది

అన్ని వందల బంధువుల మధ్య యేమి చేయగలదు?

మౌనం వహించింది

పదహారు రోజులు పండుగ పూర్తి చేసికుని పుట్టినింట్లో అడుగు పెట్టేసరికి ఆమె వూహించినట్లుగా రాజ్యం యెదురొచ్చి కాళ్లకు చుట్టుకోలేదు ఇల్లంతా చిన్నబోయినట్లయింది ఎదురొచ్చి పలుకరిస్తున్న వాళ్ళను లెక్క చేయకుండా గబగబా లోపలకు వెళ్ళింది

అమ్మా! రాజ్యం యెక్కడ? అంది గట్టిగా

ఈ ప్రశ్న రామస్వామికి స్పష్టంగా వినిపించింది జవాబు కోసం చెవులు రిక్కించి విన్నాడు

రాజ్యం వుంటే అతని పని యెంత ఆగం ఔతుందో అతనికి అనుభవమేను తొలి రేయి పాపను నిద్ర బుచ్చి వచ్చేసరికి పదకొండు అయ్యింది ప్రభావతికి పోనీ ఆ తరువాతైనా అతన్ని ఫ్రీగా వుండనిచ్చిందా అంటే అదీ లేదు పిన్నీ అంటూ కొంగు పట్టుకు తిరిగేది ఎల్ల వేళలా ప్రియసఖితో యేకాంతాన్ని కోరే పెండ్లి కుమారునికి చాలా కష్టంగా వుండేది పసి పిల్ల మీద ఆగ్రహాన్ని ప్రదర్శించలేకపోయాడు భార్యతోనూ చెప్పలేకపోయాడు అయినా చెప్పి యేమి ప్రయోజనం?

ఎన్నాళ్ళకి వాళ్ళ సొత్తును మన దగ్గర వుంచుతారు? అక్కయ్య తీసికువెళ్లింది

వెంకాయమ్మ యిచ్చిన జవాబు విని రామస్వామి హాయిగా వూపిరి పీల్చుకున్నాడు

ప్రభావతి కంట్లో నీరు యెవ్వరి కంటా పడకుండా ప్రక్కకు తప్పుకుంది

**జరిగిన కథ - 1 : రామస్వామి, ప్రభావతమ్మ దంపతుల పెద్ద కొడుకు కృష్ణ చైతన్య. ప్రభావతమ్మ అక్క కూతురు రాజ్యలక్ష్మికి సీరియస్‌గా ఉందని మోదుకూరు నుంచి టెలిగ్రాం వస్తే తల్లిని ఆ ఊరి బస్ ఎక్కించాడు కృష్ణ. బస్సులో కూర్చున్న ప్రభావతమ్మకు గతం కళ్ల ముందు కదిలింది. ప్రభావతి అక్క కామేశ్వరికి నాలుగో బిడ్డ రాజ్యలక్ష్మి. రాజ్యలక్ష్మి అమ్మమ్మగారి ఊరిలోనే పెరుగుతున్నందువల్ల ప్రభావతి దగ్గర చనువెక్కువ. ప్రభావతికి రామస్వామితో పెండ్లి నిశ్చయమయింది.**



ప్రబావతి అక్కయ్య దగ్గరకు వెళ్ళి పాపను తెచ్చుకుని తనతో తీసుకు వెళ్తానంది తల్లితో

ఎందుకు తల్లీ అనవసరంగా హైరానా పడ్తావు? సంవత్సరం తిరిగేసరికి వొళ్ళో నీ స్వంత బిడ్డ వుంటుంది

రాజ్యం నేను లేకపోతే యేడుస్తుంది గొడవ చేస్తుంది వెళ్ళొస్తానమ్మా

చాలా అవివేకంగా ఆలోచిస్తున్నావు ప్రభా ఇప్పుడు నువ్వెళితే దాని అల్లరి మరీ యెక్కువౌతుంది లేకుంటే త్వరలోనే అది వాళ్ళమ్మకు అలవాటు అవుతుంది నువ్వెళ్ళి అక్కయ్య మనసుకు కష్టం కలిగించకు నిర్మొహమాటంగా చెప్తున్న తల్లి మాటల్లో దాగి వున్న వివేకాన్ని ఆమె గ్రహించి మిన్నకుండింది

ఇన్ని ఆలోచించగలిగిన వారు ఆనాడు, ఆ పసి కూనను తనకెందుకు అప్పజెప్పారు? తామిద్దరి మధ్యా మమతలు పెరుగుతాయని వారు వూహించలేదా? తమతో బొమ్మలాట ఆడుకున్నారా?

ఆ ప్రశ్నలేమీ ఆమె యెవ్వరినీ అడుగలేదు

# మౌన విపంచి

తాను అంతగా ప్రేమించి, లాలించిన చిట్టి తల్లి మీద తనకేమీ అధికారం లేదన్న నిజం ఆమె గుండెల్లో శూలంలా గ్రుచ్చుకుంది

పరాయి బిడ్డ మీద యెంత మూర్ఖంగా మమకారాన్ని పెంచుకున్నాను అనుకుంది

*　　*　　*　　*　　*

అనుకున్న ప్రకారం కోరుకున్న విధంగా గుంటూర్లో ప్రభావతి క్రొత్త కాపురం ప్రారంభించింది తల్లి నాలుగురోజులుండి అన్నీ సర్ది జాగ్రత్తలు చెప్పి వచ్చింది

ఆ చిన్ని యిల్లు ఆనంద నిలయంగా మారిపోయింది

భర్త సాహచర్యంలో సర్వ బాధలనూ మర్చిపోయి స్వర్గ సఖాలనూ పొందింది క్రొత్తలో రాజ్యం పదే పదే జ్ఞప్తికి వచ్చినా క్రమంగా ఆవేదనను పోగొట్టుకుంది చివరకు రాజ్యం విషయంలో నిర్లిప్తంగా ఆలోచించ-సాగింది

ఒకసారి తండ్రి చూడటానికి వచ్చాడు

రాజ్యం ఎలా వుందీ నాన్నా?

బాగానే వుందమ్మా అక్కడకు అలవాటు పడిపోయింది తనకేదైనా కష్టం వేస్తే మాత్రం పిన్నీ అని యేడుస్తోందిట

ప్రభావతి కన్నుల్లోకి నరు వుబికి వచ్చింది

తనను తాను నిగ్రహించుకుంది

రామన్నగారికి కూతుర వేదన అర్థం అయ్యింది

పరాయి సొత్తు మీద ఆశ తగదమ్మా అన్నారు

కానీ నేను పరాయి సొత్తుగా బావించుకోలేదు నాన్నా

తానెంత దురదృష్టవంతురాలు? లేకుంటే రాజ్యం తన బిడ్డే అయ్యేది ఆమె హృదయంలోని వ్యధ బయటకు రాలేదు

గుండెల్లో అడుగు పొరల్లో రాజ్యం తాలూకు అనురాగాన్నీ, ఆవేదననూ నిక్షిప్తం చేసికుని నిర్వేదనగా మనసాగింది

పసి పిల్లల మీద ఆమెకున్న ప్రేమ వలననేమో, ఆమె త్వరగా గర్భం ధరించింది ఈ విషయం విన్న రామస్వామి ఆమెను మరింత అపురూపంగా చూడసాగాడు కాలు క్రింద పెడితే కందిపోతుందేమోనని ఆదుర్దా చెందాడు గదినిండా చిన్నపిల్లల పటాలు తగిలించాడు

ప్రభా! నువ్వెప్పుడూ అందమైన ఆ బోసి నవ్వుల పాపాయికేసి చూస్తుండు మనక్కూడా అంత అందమైన ఆరోగ్యమైన బాబు పుడతాడు' అనే వాడు

ప్రభావతి 'పకాల్న నవ్వి అంత మాత్రానికే పిల్లలు అందంగా పుడతారా? అనేది

ఆమె నవ్వుకు అతడు వుడుక్కున్నా ఓపిగ్గా జవాబు చెప్పేడు తల్లి మనోబావాలు పుట్టబోయే బిడ్డ మీద యెంత ప్రభావం కలిగి వుంటాయో వివరించాడు

అయితే నాకు అందమైన బాబు పుడతాడనీ, వాడెంతో గుణవంతు-డౌతాడనీ గట్టి నమ్మకం అంది

ఆమె నమ్మకం నిజమయ్యింది పదిపౌండ్లతో పచ్చగా మెరిసిపోతూ పుట్టిన బిడ్డడు ప్రసవ సమయంలో తల్లికి కష్టం కలిగించినా, తరువాత తల్లిని యెన్నడూ బాధించలేదు అపురూపంగా పెరిగినా అహం పెంచుకో లేదు తనను అందరూ గౌరవిస్తున్నా క్రింది వారిని కించపరచలేదు ఎదుటి-వారి కష్ట నిష్ఠూరాలను వోర్పుతో, విశాల హృదయంతో అర్థం చేసు-కుంటాడు

పెద్ద కొడుకు ఆలోచన ఆమెను గతంలో నుండీ వర్తమానంలోనికి రప్పించింది ఆమెకున్నది ఒకే వక బాధ ముప్పై యేండ్లు పైబడ్డా, చాల-









కాలంగా మంచి వుద్యోగంలో వున్నా కృష్ణ చైతన్య యింకా వివాహానికి సుముఖుడు కాకపోవటం, ఎన్ని సంబంధాలు చూచినా తిరస్కరిస్తున్నాడు ఎప్పుడూ పుస్తకాలు చదువుతూ, వ్రాస్తూ వుంటాడు కుటుంబంలో అందరికీ యిష్టుడు బంధువర్గంలో ప్రియమైనవాడు మనసిచ్చి మాట్లాడతాడు స్నేహితులకేమీ కొదువలేదు ఎల్లవేళలా వుల్లాసంగా వుంటాడు అతని బాల్య స్మృతులలో రాజ్యం యెక్కువ భాగం స్థానం చేసికుంటుంది

ఆమె మనసు తిరిగి రాజ్యం కోసం పరితపించసాగింది గత జ్ఞాపకాలు ఆమెను వెంటాడాయి

కృష్ణ చైతన్య పుట్టాక కలిసొచ్చిందన్నారంతా

రామస్వామి అన్న రంగస్వామి చేస్తున్న వ్యాపారం బాగా అభివృద్ధి చెంది మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వర్ధిల్లుతోంది

వెంకటప్పయ్యగారు పొలంలో బంగారాన్ని పండించారు

రామస్వామికి చాలా త్వరగా ప్రమోషన్ వచ్చింది

కృష్ణ చైతన్య ఆ విధంగా కేవలం తల్లిదండ్రులకేగాక యింటిల్లిపాదికీ గారాల తనయుడైనాడు రంగస్వామి తన వాటా లాభంలో నుండీ బంగారు గొలుసు, పతకం చేయించాడు తాతల ముద్దు ముచ్చట్లు సరేసరి రంగస్వామి భార్య సుభద్ర కూడా కృష చైతన్యను ప్రేమగా దగ్గరకు తీసేది ఆమె పిల్లలు పెద్ద వారయ్యారు అందాల చిన్ని కృష్ణుడు అల్లరి చేస్తుంటే ఆ యింట మెచ్చని వాళ్ళెవరు? కృష్ణ చైతన్య పెరుగుతున్నకొద్దీ అతని మీద అభిమానం, అనురాగం అందరిలోనూ పెరుగుతూ వచ్చాయి అతని మాట, మనసు, ప్రవర్తన అందరికీ అతని పట్ల వాత్సల్యాన్ని యినుమడింపజేశాయి

మాతృత్వం యిచ్చిన తృప్తితో ప్రభావతి మనసు పరిపూర్ణతనుచేరుకుంది తన సర్వ శక్తులనూ కేంద్రీకరించి వారిని పెంచింది ఆమె స్వసుఖాన్ని త్యజించి కన్న బిడ్డల సంతోషానికి పాటు బడింది పరాయి పిల్లకూడా మాతృత్వాన్ని పంచి యివ్వగలిగిన నిండు హృదయమామెది ఆ తల్లి ఛాయలో పెరిగిన పిల్లలు మణిపూసలు కాక పిచ్చి పూసలెలా ఔతారు?

తనకంటూ పిల్లలు కలిగాక ప్రభావతిని రాజ్యం యెడబాటు యెక్కువగా బాధించలేదు మాతృత్వంలోని తీపిని అర్థం చేసికున్నదై అక్క మీద కలిగిన కోపాన్ని మర్చిపోయింది అయితే రాజ్యం పట్ల కోపం యిసుమంతైనా తగ్గలేదు ఆ పిల్ల కోసం చిన్న చిన్న కానుకలు కొంటూనే వుంది

ఒకసారి కామేశ్వరి నిర్మొహమాటంగా చెప్పింది 'చూడ ప్రభావతీ! దానిపై నీకున్న ప్రేమను అర్థం చేసికుంటాను నీలాంటి చెల్లెల్ని కలిగినందుకు నాకు గర్వం కూడాను కానీ నువ్వలా వూరకే దానికోసం అవీ యివీ కొనకు అదీగాక నాకింకా నలుగురు పిల్లలున్నారు వాళ్ళందరికీ కూడా కొనమని నా వుద్దేశం కాదు రాజ్యాన్ని నువ్వు పెంచావు దాని పట్ల నీకు ప్రత్యేకమైన అభిమానముంది అయితే అందువలన మిగిలిన పిల్లల మనసులు కుచించుకుపోగోడదు '

ప్రభావతి ముందు నివ్వెరపోయింది

అక్క యెంత చక్కగా చెప్పింది! చదువు లేకపోతేనేమి ఆమెకున్న విచక్షణ యెందరికుంటుంది " అనుకుంది

అలాగేనక్కా, నువ్వు చెప్పేవరకూ నాకర్థం కాలేదు అంది

రాజ్యాన్ని ప్రతి శెలవులకూ తన వద్దకు తెచ్చుకోవడం మానలేదు నాలుగు రోజులు శెలవులు వస్తే చాలు పిన్ని దగ్గరకు పోవాలని రాజ్యం వువ్విళ్ళూరేది కృష్ణచైతన్య తోటి చెలిమి ఆమెకొక వరం కృష్ణచైతన్య తరువాత జయశ్రీ, నందకిశోర్, రాధ పుట్టారు

చిన్న పిల్లలతో ప్రభావతి అవస్థ పడుతుంటే రాజ్యం ఆమెకు తనకు తోచిన సాయం చేసేది అక్కను చూచిన కృష్ణ చైతన్య కూడా పోటీ పడేవాడు

వారిద్దర్నీ చూస్తూ స్వంత అక్కా తమ్ముళ్ళలా వున్నారు కదండీ అనేది భర్తతో

ఆయన నవ్వేవారు అతనికూడా రాజ్యం పట్ల వాత్సల్యం వుంది పిన్ని పట్ల ఆమె పిల్లల పట్ల రాజ్యానికున్న అనురాగం గుర్తించినప్పుడు ఆయన మనసు ఆర్ద్రమయ్యేది

రాజ్యలక్ష్మి పదవతరగతి చదువుతూండగా విధి వంకించింది కామేశ్వరి కాన్సర్‌తో తీసికుని చనిపోయింది ఆమె సంసారం తలక్రిందులయ్యింది పెద్ద పిల్లలు ముగ్గురూ పెళ్ళిళ్ళు చేసికుని వుద్యోగాల్లో స్థిరపడినా, ఆఖరి వాళ్ళిద్దరూ చిన్నవాళ్ళు వారు అస్థిరంగానే వున్నారు భార్యపోయిన దుఃఖాన్ని ఆమె భర్త భరించలేకపోయినాడు పిల్లలతోపాటు అతనూ అనాథ అయ్యాడు అతని పనల్లా తన వ్యవసాయం చూచుకోవడమే మిగిలిన వ్యవహారాలన్నీ కామేశ్వరే చూచుకునేది ఆమె గతించటంతో అన్ని వ్యవహారాలూ అస్తవ్యస్తమయ్యాయి అతడు నిస్సహాయుడైనాడు

ప్రభావతి రాజ్యాన్ని తాను తీసికు వెళ్తానంది అందుకు అతడేమీ బదులివ్వలేదు ఒక వెఱ్ఱి నవ్వు నవ్వాడు అంతే

ప్రభావతి రాజ్యాన్ని తనతో తీసికు వెళ్ళడానికి సన్నాహమయ్యింది పిన్నితో వెళుతున్నానన్న భావన తల్లిని కోల్పోయిన రాజ్యాన్ని వూరడించింది

తీసికు వెళ్లాలని ప్రభావతికుంది

వెళ్లాలని రాజ్యానికుంది

కానీ విధి మరో విధమైన మలుపు త్రిప్పింది ఆ మలుపే కాకుంటే రాజ్యం బ్రతుకు మరోలా వుండేదేమో!

రాజ్యాన్ని ప్రభావతితో పంపటం ప్రెస్టేజ్ యిష్యూగా భావించారు మేనమామలు

# సూక్తి ముక్తావళి

ఓట్లు  వేసి ప్రజలు సీట్లు చేకూర్చగా
ప్రజల జీవితాలు పణముపెట్టి
జూదమాడి ఓడి జోలి చేపట్టారు!
సుధను నేను నాదు సూక్తి వినుడు

సీట్లకొరకు జరుగు పోట్లాట కొట్లాట చెరిపె నీతి వెలుగు –
చీకటాయెఎరుగనేరరైరి యెవరి జత యెవరో!
సుధను నేను నాదు సూక్తి వినుడు

రాజకీయ భాష రాజిల్లు భువిలోన
ద్వ్యర్థికావ్యమందు అర్ధమువలె
సభకు సభకు మారు స్వార్ధపు టర్ధము!
సుధను నేను సూక్తి వినుడు

చేయలేని వెన్నొ చెప్పగల్గెడు నేర్పె
రాజకీయ మనుచు భ్రమసి, ఓడి
ప్రజల లోపమంద్రు నిజలోప మెరుగక!
సుధను నేను నాదు సూక్తి వినుడు

తనదు అర్హతే మొతా చెప్పుకోలేడు
జనుల ముందు నిలిచి సభలయందు
బల్లగుద్ది చెప్పు ప్రత్యర్థ్య నర్హత!
సుధను నేను సూక్తి వినుడు

స్టేజిమీద లేచి శివమాడు చీదును
అరచు, వాగు, ప్రేలు మొరుగు, కూయు
ఎవరయ్య అనిన ఏనె ప్రజ నను!
సుధను నేను నాదు సూక్తి వినుడు

పూట పూట మారు, పేట పేటకు మారు
ఆకతాయి ఆటలాడు చుంద్రు
ప్రజల భావితోడ రాజకీయము పేర!

రాళ్ళు, ఇసుక, ఊక, రంపపు పొట్టును
పిసికి బొమ్మచేసి పేరుపెట్ట
ఊడి బైటకొచ్చు ఒక్కొక్క దినుసును!
సుధను నేను నాదు సూక్తి వినుడు.

—మేకా సుధాకరరావు

# మౌన విపంచి

అప్పటికి రామన్నగారు కాలం చేసినా వెంకాయమ్మగారు బ్రతికే వున్నారు ప్రభావతి నోటంట ఆమె నిర్ణయం వినగానే ఆ ముదుసలి లబలబలాడింది భోరున యేడ్చింది

నేనింకా బ్రతికే వున్నాను తల్లీ ఆ దేవుడు నన్నెందుకు తీసికుపోలేదో, దాన్ని నేనున్నంత కాలం నా కళ్ళెదుట వుండనీయమ్మా' అన్నారు

అటు అన్నలకు నచ్చ చెప్పలేక, యిటు తల్లిని ఓదార్చలేక ప్రభావతి ఒంటరిగా తిరుగు ప్రయాణమయ్యింది రాజ్యం మూగగా కన్నీరు కార్చింది ప్రభావతి ఆమెను గుండెలకు హత్తుకుంది పిన్ని చేతుల్లో రాజ్యం చిన్ననాటి పసిపాపలా మారిపోయింది ఆ రోజులే వేరు ఏది కావాలన్నా సాధించవచ్చు యేడ్చి ఇప్పుడా అవకాశం లేదు తల్లి పోయింది తండ్రికి మతి స్థిమితంగా లేదు పెద్దలైన అన్నలు ఒదినల మాటలకు కట్టుబడి బ్రతుకుతున్నారు తమ్ముడు చిన్నవాడు తానిప్పుడు అనాధ అందరి యిష్టాల ప్రకారం, శాసనాలకు అనుగుణంగా బ్రతకాల్సిన ఖర్మ తన నుదుట వ్రాసి వుందని రాజ్యం గ్రహించింది అందుకే మౌనంగా రోదించింది

చివరిసారిగా రాజ్యాన్ని చూస్తూ నువ్వెక్కడున్నా, నేనెలా వున్నా నిన్ను వెయ్యి చేతులతో రక్షించుకుంటాను కోటి గొంతుకలతో, దీవిస్తాను తల్లీ' అనుకుంది

"నేను నీలాగానే నిస్సహాయురాలని నన్ను మన్నించు అని వేడుకున్నాయి ఆమె కళ్ళు

అదే ఆఖరుసారి రాజ్యాన్ని ప్రభావతి చూడటం తిరిగి యిప్పుడు అదీ యెలాంటి విషమపరిస్థితుల్లో? ఎందుకొచ్చాయి ఆమెకీ పరిస్థితులు? ఎవరు సృష్టించారు?

ఆమె హృదయం అశాంతితో, ఆవేదనతో తీవ్రంగా చలించింది

ఒంటరిగా తిరిగొచ్చిన భార్యను చూచి చకితుడయ్యారు రామస్వామిగారు జరిగింది విని అతడూ విచారించాడు భార్య పట్ల, రాజ్యం పట్ల జాలి కలిగిందతనికి

"మీరు కూడా నాతో వస్తే యిలా జరిగేది కాదేమో! అంది భర్తతో

ఆమె మాటల్లో నిజం వుంది రామస్వామి కూడా వెళ్ళి అడిగితే ఆమె మాటలకు బలం చేకూరేది

రామస్వామి మాట్లాడలేదు

అతని మనస్తత్వం తెలిసిన ప్రభావతి మరేమీ అనలేదు

రామస్వామి మనసు తామరాకు మీద నీటి బొట్టు లాంటిది అతడు లోతుగా ఆలోచించేదీ, బాధ పడేదీ కేవలం తన భార్యా పిల్లల వ్యవహారంలోనే మిగిలిన అందరి విషయాల్లో ఫార్మల్‌గానే వుంటాడు

ప్రభావతికి పూర్వంలా చీటికీ మాటికీ పుట్టింటికి వెళ్ళడానికి వీలు కావడం లేదు భర్తకు ట్రాన్స్‌ఫర్లు తెలంగాణా ప్రాంతాలకు ఔతున్నాయి అతనికి డిస్ట్రిక్ట్ ఎడ్యుకేషనల్ ఆఫీసర్‌గా ప్రమోషన్ కూడా వచ్చింది నలుగురు పిల్లలతో దూరప్రయాణాలు చేయటం యెంతో కష్టం పైగా పసిదైన రాధ యెప్పుడూ అనారోగ్యంలో వేధిస్తూ వుండేది తన సంసార తాపత్రయంలో పడిపోయినా రాజ్యం గోపి గూర్చి లెటర్స్ వ్రాసి తెలుసుకుంటూనే వుండేది ఇంటి వద్ద నుండి మాత్రం వారిద్దరూ కులాసాగా వున్నారనీ, దిగులు పోగొట్టుకున్నారనీ జవాబులొచ్చేవి ఆ వుత్తరాలను నమ్మి నిశ్చింతగా వుండేది ప్రభావతి

ఆమె నిశ్చింత నిరాధారమని ఆమె ఆలోచించలేదు ఇంటి వద్ద నుండీ వచ్చే వుత్తరాలను విశ్వసించేది అయితే యింటి వద్ద పరిస్థితి పూర్తిగా భిన్నంగా వుండేది

రామన్నగారు పోయాక కొడుకులు వేర్లు పడ్డారు ఆయనతోపాటు

# "గ్యాస్ సిలెండర్‌ని ఎరువు తెచ్చుకోకండి– గొడవ నెత్తిన పెట్టుకోకండి."



సిలెండర్ ఎరువు తెచ్చుకోవడం చట్ట విరుద్ధం; ఎందుకంటారా, సిలెండర్ కంపెనీది, అది 'లీజ్' చేసిందీ, యిచ్చిందీ కేవలం మీకు. అలా ఎరువు తీసుకువెళ్ళిన వాళ్ళకి రీఫిల్ యివ్వడంగాని లేదా మెకానిక్ సేవా సౌకర్యాన్ని యివ్వడం గాని నిరాకరించవచ్చు.

అదిగాక అసలైన ముఖ్యమైన విషయం ఏమిటంటే, సిలెండర్‌ని ఎరువు తెచ్చుకోవడం అపాయకరం కావచ్చు. అన్ని రెగ్యులేటర్లూ అన్ని సిలెండర్లకూ పట్టవు. అలా ఎరువు తెచ్చుకున్న సిలెండర్‌లోంచి గ్యాస్ గనక లీక్ అయితే మీకిక గొడవా, యిబ్బందీను.

భద్రతను దృష్టిలో వుంచుకుని, మీరెప్పుడూ సిలెండర్‌ని ఎరువు తెచ్చుకోనూ వద్దు, యివ్వనూ వద్దు.



Bharatgas



**కుకింగ్ గ్యాస్‌ని మీ నేస్తంగా చేసుకోండి.**

ARTIG 4366 TEL

*ప్రజల హితంకోసం భారత్ పెట్రోలియమ్ కార్పొరేషన్ లిమిటెడ్ వారిచే యిది విడుదల చేయబడినది.*

# మౌన విపంచి

వెంకాయమ్మగారి వైభవం అంతరించింది ఆమెకంటూ ప్రత్యేకంగా యేమీ లేదు నలుగురు కొడుకులు మధ్యా కాలక్షేపం చేస్తోంది కోడళ్ళు అత్తగారితో పూర్వంలా భయభక్తులతో మెలగటం లేదు కొడుకులు ఆమెను ఒక వ్యక్తిగా గుర్తించటం విస్మరించారు మనసు వుండబట్టలేక యేదైనా సలహా యిచ్చినా, నువ్వు నీ పని చూసుకో అమ్మా మాకు తెలుసు కదా' అంటున్నారు

ఈ మార్పుకు ఆమె త్వరగానే అలవాటు పడింది- ఇంటి వ్యవహారాలూ, పొలం విషయాలూ పట్టించుకోకుండా మనవళ్ళూ మనుమరాళ్ళతో కాలక్షేపం చేయసాగారు

మనుష్యుల్లోనూ వారి మనసుల్లోనూ వచ్చిన మార్పుకు అనుభవాలతో తల పండిన వెంకాయమ్మగారు సర్దుకుపోగలిగారు గానీ రాజ్యం, గోపిల పసిహృదయాలు మాత్రం నిరాశ నిస్పృహలతో కృంగిపోయాయి తమ తోటి పిల్లల హృదయాలు తల్లి దండ్రుల ఆదరాభిమానాలతో విచ్చుకుంటూంటే, తాము కోల్పోయిన అమూల్యమైన అమ్మ కోసం వారు పడే ఆవేదనా, ఆరాటం అధికం అయ్యాయే తప్ప తరగలేదు

ఆ యింట్లో యే వొక్కరూ గూడా వారిని తల్లి లేని పిల్లలుగా గుర్తించి లాలించి దగ్గరకు తీయలేదు వారికంటూ ఒక మనసుందని గ్రహించిన వ్యక్తి యెవరు?

మేనమామలు తిండి, బట్ట యిస్తే చాలుననుకున్నారు వారి భార్యలు 'యిదెక్కడి తద్దినంగా' భావించారు

నాలుగిండ్ల మధ్య వంతులవారీగా తినటం చిన్నారి మనసుల్లో మానని గాయం రేపింది

బిచ్చగాళ్ళలా యిదేమిటక్కా? అన్నాడు గోపి వుక్రోషంగా రాజ్యం తమ్ముడికి పరిస్థితులను వివరించి నచ్చచెప్పాలని ప్రయత్నించి విఫలురాలయ్యింది

రాజ్యం చదువు మానేసింది గోపీకి చదువు మీద శ్రద్ధ తగ్గిపోయింది స్కూలు యెగ్గొట్టి చేల గట్ల వెంట షికార్లు ప్రారంభించాడు ఆ విషయం తెలిసిన మేనమామలు వాడ్ని రెక్కలు పట్టుకుని యీడ్చుకొచ్చి చితగ్గొట్టారు వాడు కిక్కురుమనలేదు వెంకాయమ్మ గోపీ వంటి మీద తేలిన వాతలు చూచి శోకాలు పెట్టింది ఇదెక్కడి ఖర్మరా బాబూ! మీ అన్నలెంత తెలివైనవారు! ఎంత గొప్ప చదువులు చదివారు! నువ్వెందుకిలా తయారయ్యావు నాయనా,' అంటూ బావురుమంది

తల్లి వుండగా బాగా చదువుకున్న గోపి యెందుకిలా తయారయ్యాడో యెవ్వరూ అర్థం చేసికోలేకపోయారు వాడేమి కోల్పోయాడో, అందుకు తామెలా ప్రవర్తించాలో గ్రహించలేకపోయారు ఆ యింట్లో వాడి లేత హృదయంలో తుఫానులా చెలరేగేతున్న అలజడిని రాజ్యం ఒకతె మాత్రం అర్థం చేసికోగలిగినా ప్రయోజనం శూన్యం

గోపీ బడి యెగ్గొట్టటం, మేనమామలు చితగ్గొట్టటం నాలుగైదుసార్లు జరిగాక ఒకనాటి వుదయం చూస్తే గోపీ పక్క మీద లేడు ఊరంతా వెదికించారు జాడలేదు పది గంటల ప్రాంతంలో గోపీ వాళ్ళ వూరి నుండీ కబురొచ్చింది గోపీ వాళ్ల చిన్నాన్న వద్దకు చేరాడనీ, కంగారు పడవద్దనీను

ఈ వార్త వింటూనే మేనమామలు నిశ్చేష్టులైనారు వారి ముఖాలు నల్లగా మాడిపోయాయి ఎంత అవమానం? గిలగిల్లాడిపోయారు వారి భార్యలు మూతి మూడు వంకర్లు త్రిప్పి వెంకాయమ్మను, రాజ్యాన్ని సూటిపోటీగా మాటలనసాగారు ఆ నరకం భరింపశక్యంగానిదిగా తయారయ్యింది ఆ సంఘటనతో రాజ్యం పరిస్థితి మరీ అధ్వాన్నంగా తయారయ్యింది ఒక్కొక్కసారి తానుగూడా పారిపోవాలని యోచించినా ధైర్యం చేయలేకపోయింది ఒక వేళ సాహసం చేసి వెళ్ళి అక్కడ అంతకన్నా మెరుగ్గావుంటుందన్న నమ్మకం ఆమెకు లేదు అందువలన అమ్మమ్మ కృంగిపోవటం తప్పించి వేరే

తండ్రి అక్కడే వున్నాడు అతనికి తినటం, గదిలో కూర్చుని యింటి కప్పుకేసి చూడటం తప్పించి వేరేదీ పని లేదు అతని పొలం వ్యవహారాలు కూడా తమ్ముడే చూస్తున్నాడు గోపి వెళ్లాక అరేయ్ రేపటి నుండీ బడిలోకి వెళ్ళరా అన్నాడు

గోపి నేల చూపులు సారించాడు

"ఏం మాట్లాడవు? ఇష్టం లేదేమిటి? అన్నాడు

గోపి యిష్టం లేదన్నట్లు తల వూపాడు

'నాతో పొలం వస్తావురా వ్యవసాయంలో దిట్టను చేస్తాను

వస్తాను బాబాయ్ గోపి గొంతు పెగల్చుకుని అన్నాడు

బాబాయ్ తరువాత అన్న గదిలోకి వెళ్లాడు అక్కడ పరిస్థితి మామూలే అన్న మంచం మీద అడ్డంగా పడుకుని యింటి వాసాలు లెక్కపెడుతున్నాడు

అన్నయ్యా!

గోపీ బడి మానేస్తానంటున్నాడు

నాతో పొలం వస్తాడుట

నీ అభిప్రాయం చెప్పన్నయ్యా

అతనికి అన్న పరిస్థితి అంతా తెలుసు అయినా అతనికి సంబందించిన యే పని చేయాలన్నా ముందుగా చెప్తాడు ఎప్పటికైనా అన్నలో చలనం వుండదా అని అతని ఆశ

రెండు మూడుసార్లు రెట్టించి అడగటంతో నీ యిష్టం అని ముభావంగా ప్రక్కకు తిరిగి పడుకున్నాడు అంటే అతన్ని యిక అవతలకు వెళ్ళమని అర్థం

ఆ విధంగా గోపీ వ్యవసాయంలో పడ్డాడు

గోపీ వెళ్ళిపోయాక వాడి కబుర్లేమీ రాజ్యానికీ, వెంకాయమ్మగారికీ తెలియలేదు ఒక రోజు వుదయమే రాజ్యలక్ష్మి చెయ్యి పుచ్చుకుని కూతురు అత్తగారి వూరు ప్రయాణం అయ్యారు వెంకాయమ్మగారు ఇల్లు సమీపిస్తున్నకొద్దీ ఆమె తనను తాను నిగ్రహించుకోలేకపోయారు మౌనంగా చీరె కొంగుతో కళ్ళు వత్తుకుంటున్న అమ్మమ్మను రాజ్యం గుర్తిస్తూనే వుంది ఆమెను గూడా తమ గ్రామం చేరినప్పటి నుండీ తల్లి జ్ఞాపకాలు వెంటాడి వేధిస్తూనే వున్నాయి

ఒకరికామె తల్లి, మరొకరికి తనయ

ఇద్దరూ పోయిన ఆమె కోసం ఒకే విధంగా విలపిస్తున్నారు ఆమె నిష్క్రమణతో నిరాశ్రయురాలూ, నిస్సహాయురాలూ అయ్యింది కూతురు ఆ వయసులో తల్లిని పోగొట్టుకోవడానికి మించిన నికృష్టం, నిర్భాగ్యం మరొకటి లేదు వుండదు తల్లి పోయాక ఆమె భవిష్యత్తు అంధకారబంధురమైంది వెంకాయమ్మ విషయం వేరు ఆమె కాటికి కాళ్ళు చాచుకుని కూర్చుంది ఆ వయసులో భర్త వియోగాన్నే భరించలేకపోతున్న ఆమెకు గోరు మీద రోకటిలా గర్భశోకం సంభవించింది ఇలాంటి దురదృష్టకరమైన, దుఃఖ భాజనమైన బ్రతుకును మోయటానికి ఆమెలో శక్తి యింకిపోయింది ప్రతి తల్లీ తండ్రీ తమ సంతానం అష్టైశ్వర్యాలతో తులతూగుతూ వుంటే చూచి ఆనందిస్తూ, హాయిగా తృప్తిగా కన్ను మూయాలని కాంక్షిస్తారు తమ కడుపునుచీల్చుకుని పుట్టిన బిడ్డ తమ కళ్ళ ముందే కాలి బూడిద కావడాన్ని యెవరు వూహిస్తారు? ఎవరు సహిస్తారు?

కళ్ళు తుడుచుకుంటూ యింట్లోకి అడుగు పెట్టిన యిరువుర్నీ రాజ్యం పిన్ని సాదరంగా ఆహ్వానించింది కామేశ్వరిని తలచుకుని యేడుస్తున్న అమ్మమ్మ, మనుమరాళ్లను ఓదార్చింది వారు నిగ్రహించుకున్నాక కుశల మడిగింది గోపీ అప్పటికే పొలం వెళ్ళిపోయాడు మధ్యాహ్నం అన్నం తీసుకువెళ్లటానికి వచ్చిన జీతగాడితో గోపీని పంపమని కబురు పంపింది


**(ఇంకా ఉంది)**



రామేశ్వరంలో సముద్రస్నాన ఘట్టం

# స్నాన సంస్కారం!

స్నానం సంస్కార జీవన ప్రతీక మానుష ధర్మంగా దానికున్న విశిష్టత ఎంతో విలువైనది భారతీయ సంప్రదాయంలో స్నానం శుభా శుభ ప్రస్తావనల్లో బహుళంగా చోటు చేసుకొని ఉండడం ఎంతో ఆసక్తిని కలిగిస్తుంది రసస్ఫూర్తిని కలిగించి, ఉల్లాసాన్ని చేకూర్చి ఎంతో ఉపశమనాన్ని అందించి మధరమైన అనుభవాన్ని కలిగించేది స్నానం పాశ్చాత్య సంస్కృతిలో కన్నా మన సంస్కృతిలో స్నానం ఎంతో శ్రేష్ఠమైనది ఆరోగ్యం కోసమే కాదు మానసిక సౌభాగ్యం కోసం కూడ స్నానం అతి ముఖ్యమని భావన ఏకాగ్రత కుదరడానికి స్నాన సంబంధమైన అనుభూతి అవసరమని కదా శాస్త్ర ఘోష! అయితే ఐహికాముష్మిక తత్వ విచారణను ఆత్మతో వివేచించే విచక్షణా జ్ఞానమూర్తులైన ముముక్షువుల సంగతి వేరు అనంతమైన ప్రకృతిలో పరమాణు మాత్రమై కలిసిపోయే వారి స్థాయి అతీతమైనది అద్భుతమైనది కూడా! స్నాన సంస్కారం సామాన్యుని ఉద్దీపుణ్ణి చేసేందుకు మాత్రమే! శుచికి, రుచికి, మడికి, నిష్ఠకు స్నానం మార్గం మాత్రమే! ఆత్మే ద్వారం!!

తానమాడు తీరులో కూడ స్థాయీ బేదాలున్నాయి స్నాన పద్ధతుల తారతమ్యాలు కూడ సంస్కారానికి నీరు పోస్తాయి బహిరంగ స్థలాలలో స్త్రీలు తానమాడడం అపాయాన్ని తెస్తుందని గోపికా వస్త్రాపహరణ ఉదంతం స్పష్టపరుస్తుంది ఈ అంశం పురుషులకు సైతం వర్తిస్తుంది స్త్రీ ప్రకృతి, పురుష ప్రకృతి స్వతఃసిద్ధంగానే బిన్నమైనవి కదా! ఇంట నాలుగు గోడల మధ్య చేసే స్నానంకన్నా, సబ్బు బురగలు నిండిన టబ్‌లతో చేసే ఆదునిక స్నానం కన్నా బావి నీటి స్నానం ఉత్తమమైందని అంటారు శాస్త్రరీత్యా కూడ ఇది అబిలషణీయమే సచేల స్నానమే ఆరోగ్యకరమైనదని అనడంలో ఎంతో అర్థమున్నది కంటికానని ఎన్నో రకాల జల సూక్ష్మ జీవుల ప్రవేశాన్ని సచేల స్నానం అరికడుతుంది వేడి నీళ్ల స్నానం వల్ల ఈ సూక్ష్మ జీవరాశి బెడద లేకపోవచ్చు కాని, శరీరక్రమ ఉష్ణోగ్రతా పరిదిని నిర్ణీతం చేసే సున్నితమైన వ్యవస్థ దెబ్బతిని రోగ నిరోధక శక్తి బాగా తగ్గిపోయి, ఆరోగ్య ప్రమాణాలు దిగజారే అవకాశముంది అందువల్లే గోరు వెచ్చటి నీళ్ళు శాస్త్రవంతమైనదని అందరూ అనడం అతి శీతలజలం కూడ నిషిద్ధమే బావి నీరులో మనిషి బుద్ధికి, దేహానికి పదనుపెట్టే చైతన్య కారకాలున్న లవణ నిక్షేపాలుంటాయి ఇవి మానవ జీవిత ప్రమాణాన్ని పెంచుతాయి ఈ దృష్ట్యా బావి నీటి స్నానం కన్నా, నది స్నానం, నది స్నానం కన్నా సముద్ర స్నానం ఎంతో శ్రేష్ఠమైనవని నికరంగా తేలుతాయి సెలయేటి తానం కూడ ఉత్తమమైంది ఎన్నో వన మూలికల సారంతో, మరెన్నో మృత్తికా లవణాల ఓజంతో, వేగంగా మీదపడే సెలయేటి ధారవల్ల ఆరోగ్యం ద్విగుణీకృత మవుతుంది ఆ ధారాపాతానికి కలిగే కదలికలవల్ల దేహస్థితి జీవక్రియాపరంగా విధృతినందుకొంటుంది అందుకే మానసిక రుగ్మతలు తొలగాలంటే సెలయేటి స్నానం చాల ముఖ్యమని ఆధునిక వైద్యులు కూడ చెబుతూ ఉంటారు!

సముద్ర స్నానం వల్ల మనుష్యులు నల్లబడతారని కొందరు నమ్మడం దురదృష్టకరం వెంట్రుకలు తెల్లబడతాయని మరికొందరి విశ్వాసం మనుష్యులు నల్లబడడానికి వెంట్రుకలు తెల్లబడడానికి దేహంలోని వర్ణ కాల ఉత్పత్తి సామర్థ్యంలోని హెచ్చు తగ్గులు కారణంకాని, సముద్రస్నానం కాదు సముద్రంలో లబ్యం కాని విశేషం లేదు సమస్త బౌతిక రసాయనిక, జీవ, వృక్ష రాశులు ఎన్నో ఉంటాయి వాటి ప్రాబల్యం మనిషి ఆరోగ్య పరిస్థితిని ఎంతగా దిటువు పరుస్తుందో ఒక్కసారి సాగర శాస్త్రాన్ని మదిస్తే తెలుస్తుంది అసలు సాగర మదనం చేయాలే కాని, సాదించలేనిది లేదు ప్రశాంత ప్రబాతవేళ, ఆకాశం కుంకుమ ఎరుపులో పండిపోయిన తరుణాన, దేహంపై ప్రసరించే కాస్మిక్ కిరణాలవల్ల ఎనలేని ఉత్సాహం సాటిరాని చైతన్యం మనిషికి కలుగుతాయి మనసును నిద్ర లేపుతాయి ఆత్మను కదలిస్తాయి గోరువెచ్చటి నీలి తరగలలోని అణు సంఘటనంలోని విబిన్న పదార్థ మిశ్రమ ప్రబావంవల్ల చిత్తైకాగ్రత కుదిరి హృదంతరంలోంచి ఆహ్లాదం అపార పారావారంలా పొంగు కొస్తుంది అట్టివేళ సంధ్యావార్చడం పరమాత్మ స్పర్శను అనుభవించడమేనని మన పూర్వీకులు అంటే కాస్మిక్ రేడియేషన్‌లో దేహానుబవాన్ని మరచిపోయి విచిత్రమైన అనిర్వాచ్యమైన అవస్థలోనికి అంతస్తు మారినట్లు బాసిస్తుందని అప్రాచ్యులు తెలుపుతున్నారు భావ వ్యక్తీకరణ బేదమే కాని అనుబవ వ్యత్యాసంలేదు ఇది చెప్పుకోవలసిన విశేషమే మరి!

మన సంప్రదాయంలో సముద్ర స్నానానికున్న సార్వత్రిక ప్రమాణం తిరుగులేనిది నది ఆత్మ భావ నిధి సాగరం పరమాత్మ సదనం గంగా సాగర సంగమం ఆత్మ పరమాత్మ సంగమానికి సామ్యంగా గుర్తిస్తారు నదీ స్నానానికి, సముద్ర స్నానానికి ఉండే వ్యత్యాసం కూడ అంతే! నది స్నానం వ్యక్తిగత పరిమిత మానసిక మహాహ్లాదాన్ని అందించ గలిగితే, సముద్ర స్నానం దివ్యకృత, అపరిమిత మహదానంద చైతన్య దీప్తిని కలిగిస్తుంది అలా వేద సంస్కృతిలో సముద్ర స్నానానికి పవిత్రత కూడ అంటగట్టబడింది!

మొత్తానికి ధైనందిన జీవన కార్యక్రమంలో కేవలం ఒక్క భాగమైన స్నానాన్ని ఇంత నేపథ్యంతో, విస్తృత ప్రయోజనంతో బహుళార్థ సాధకం చేసిన మన వారి ఆత్మగత సంస్కారం ఎంతో గొప్పది ఎవరైనాసరే, ఎంతటి వారైనాసరే ఈ విషయంతో ఏకీభవించక తప్పదు

సర్వ కాల సర్వావస్థలందు ఈ వివరణ ఎదురులేనిదని ప్రగాఢమైన నమ్మకం!

—డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# మారని మనుషులు

డాక్టర్ జయానాగరాజు



"మీ అబ్బాయికి పెండ్లి చేయవా ఏం ఆనందరావు?"

"ఆ అదేవన్నమాట మూర్తి అయినా వాడే-మయినా ఆడపిల్లా ఏం ?

అబ్బే బ్రహ్మచారి ముదిరినా బెండకాయ ముదిరినా అని

ఏది వాడికి మొన్ననేగా ముప్పై నిండాయి అయినా అన్నీ కలసి రావద్దూ!'

ఆవధాన్ల సంబంధం ఏమయిందేమి? పిల్ల చాలా అందంగ వుందట

"అదేమో నిజమేగాని పొట్ట విప్పితే ఒక్క అక్షరం ముక్కలేదు ' చాందసులు పిల్లదానికి చదువు చెప్పించలేదు

అవునా నాకా సంగతి తెలియదు

అయినా చూస్తూ చూస్తూ చదువుకున్న పిల్ల-వాడికి మరీ వెఱ్ఱి ముద్దునెలా అంటకట్టేది? - అందం కొరుక్కు తింటాడా ఏం రేపు నలుగురిలో వెళ్ళినప్పుడు తన భార్య అని చెప్పుకోవద్దూ ?

ఆ మాట నిజమే మరి సుబ్బారావుగారి సంబంధం వచ్చిందని విన్నాను '

అమ్మాయి "ఎం ఏ " చదివింది పెట్టుపోతలు కూడా బాగా పెడతామన్నారు అబ్బాయిని విదే-శాలకు పంపుతామన్నారు కూడా

మరేం అవును వారు స్థితిపరులే మరేమయ్యింది?

వినవయ్యా పిల్ల కారు నలుపు చదువు-కుంటే చాలా అబ్బాయికి విదేశయాత్ర ఎరగా పెట్టి ముడేద్దామనుకున్నారు ' మా వాడు - చీకట్లో పిల్లదానికోసం తడుముకోవలసి వస్తుంది '

తన పరిహాసానికి తానే బిగ్గరగా నవ్వుకున్నాడు ఆనందరావు '

కాకి ముక్కుకు దొండపండన్నమాట అందు-కున్నాడు మూర్తి

అది సరైన ఉపమానం ' ఆనందరావు యింకా నవ్వుతూనే జవాబిచ్చాడు

"అనంతరామయ్య మొన్న మీ ఇంట్లోకి రావడం చూచాను మాటలు ఆపివేయడానికి యిష్టంలేని మూర్తి మరల అడిగాడు

అ అ తన తమ్ముడు కూతురుకోసం అడగ-డానికి వచ్చాడు

'మరి ?

'అన్నీ బాగున్నాయనిపించింది అబ్బాయికి కూడా నచ్చినట్లుంది జాతకాలు కూడా తెప్పించి చూచాను

"మరి చెప్పవేం యింతసేపూను పప్పన్నం ఎప్పుడూ ??

ఛ వుండు చెప్పనియ్యి నీ తొందర జాత-కాలు కుదరలేదు " నిట్టూరుస్తూ చావు కబురు చల్లగా చెప్పాడు ఆనందరావు

"హరి హరి '

"చూస్తూ చూస్తూ ఎలా చెయ్యడం వైధవ్యం వుంది ఆ జాతకంలో విచారంగా తలూపుతూ అన్నాడు ఆనందరావు కొంతసేపు మౌనం దానిని చెదుర్చు మూర్తితో ఆనందరావు చెప్పుకపోతున్నాడు

అనట్లు మొన్న ఆనందం ఓ సంబంధం తెచ్చాడు ముదనష్టపుది ఏదో పిల్ల బాగానే చదువుకుంది అందంగా వుంది ఈడు జోడూను కాని తల్లిదండ్రులు చాలా పేదరికంలో వున్నారు పెండ్లి కెదిగిన ఆడపిల్లలు యింకా ముగ్గురున్నారు ఒక్కడి రెక్కల కష్టం అంటూ వచ్చాడులే

అంటే '

"అంటే గింటే ఏమీలేదు చిల్లిగవ్వ లేకుండా పిల్లలు వదలించుకోడానికో ఎత్తు

"మరి ?

మరేమిటోయి బొంద వియ్యమన్న కయ్య-మన్న సంసమానులతో గాని

అయితే ఈ మధ్య శర్మగారి సంగతి ?"

శాఖ వేరు కదోయి తెలుసుండి వేరేశాఖ అమ్మాయిని ఎలా తెచ్చుకుంటాం?

రామనాధంగారి అమ్మాయి మాట "

"ఏదో సంగీతంలో డిప్లొమా చేసిందట అయినా మనవాడు ఆవిడచేత సంగీతం ఖచేరీలు చేయించు-

# మీ పాప, పుట్టిన 6 గంటల తర్వాత మీ నుంచి 'నివారక ఆహారం' పొందుతుంది. దాన్ని యిచ్చేది మీరే యుగయుగాలుగా తల్లి యొక్క స్వాభావిక సంస్కారం యిది.



**తల్లి పాలు ప్రకృతి యిచ్చే మహత్వపూర్ణమైన వరం!**

ఎందుకంటే పాప పుట్టుకతోనే తల్లి స్తనాలలో పాలు వస్తాయి. మరి వాటిలో ప్రాకృతికమైన రూపంలో "రోగ నిరోధక ద్రవ్యాలు" ఉంటాయి. దాంతో, అప్పుడే పుట్టిన పాపయొక్క అమాశయం, పేగుల్లోవీ, యితర వ్యాధుల నుంచి రక్షణ కలుగుతుంది. అందుకే స్తన్యపానానికి అంత ప్రాముఖ్యత యివ్వబడింది.

**స్వాభావికమైన పోషణ**

శరీర నిర్మాణంకోసం ప్రకృతిలోని ప్రోటీన్లు, శక్తినిచ్చే కార్బోహైడ్రేట్లూ, ఆరోగ్యాన్ని కాపాడే విటమిన్లూ సరియైన మోతాదులో ఉండి, తల్లి పాలను సరిగ్గా సంతులితంగా కూడా తయారుచేస్తాయి— అప్పుడే పుట్టిన పాపకది సరియైన పోషణనిచ్చే ఆదర్శమైన ఆహారం అవడంకోసం (ఉదాహరణకి, స్తన్యపానం చేసే పాపలకు విటమిన్ ఏ లోటువలన వచ్చే స్కర్వీ వ్యాధి రాదు సాధారణంగా) మరి తల్లి పాలు తాగిన పాప ఎలా పెరిగి, పెరుగుతాదో చూడండి! ఇక మీరు మీ పాపను గుండెలకి హత్తుకుని పాలిస్తూంటే ఎంత ఆనందాన్ని పొందుతారని! మరి ఆ పసికందు యింత పెద్ద లోకంలో కేవలం మీ మమతను పొంది ఎంత సురక్షితంగా వున్నట్టి అనుభవాన్ని పొందుతాదని!

**ప్రపంచమంతా ప్రచలితం**

ఇప్పుడు రోజుకి రోజూ, ప్రపంచమంతటా ఎక్కువ మంది తల్లులు, అంటే పశ్చిమ దేశాలలో సహితం, తల్లులు తమ పాలే యివ్వడం మొదలెట్టారు. ఎందుకంటే, తల్లి పాలలోని అమూల్య పోషక తత్వాల మహత్తర లక్షణాన్ని మళ్ళా అవగాహన చేసుకోవడం మొదలెట్టారు.

**తప్పకపోతే**

మరి మీరేగనక యిక ఏ కారణం వల్లనైనా తప్పకపోతే, మీ పాపకు మీ పాలు యివ్వలేకపోతే—అంటే మీ ఆరోగ్యం సరిగా లేకనో, లేదా మీలో, సరిపడినన్ని పాలు పడకో, అలా జరిగినప్పుడేం చెయ్యాలి మీరు, అటువంటి సందర్భంలో మీరు ఎంతో ఆలోచించిన మీదట, ఎటువంటి ఎటువంటి ఆహారం యివ్వాలంటే, ఆ యిచ్చేది తల్లి పాల తర్వాత అన్నింటికన్న ఉత్తమమైనదిగా ఎంచుకునేదాన్ని

**స్ప్రే డ్రయిడ్ అమూల్ స్ప్రే**

అమూల్‌స్ప్రే, పుష్టినిచ్చే దృష్టితో చూస్తే మహత్తరంగా సంతులితమైన ఆహారం ఎందుకంటే దీన్లో చాలా ఎక్కువైన తీరులో ప్రోటీన్లు, దాంతోబాటే, తేలికగా అరగగలిగే కార్బోహైడ్రేట్లు, సరియైన సంతులిత రూపంలో అత్యావశ్యమైన విటమిన్లూ, ఖనిజ పదార్థాలు ఉన్నాయి ఇది అంతకు ముందే మరగబెట్టిన నీటిలో టక్కున కరిగిపోతుంది మొదటిగానే పేస్టులా తయారు చేయవలసిన అవసరం ఉండదు

**పొదుపు**

అమూల్‌స్ప్రే డబ్బాలలో దొరికే శిశుఆహారాన్నిటికన్న పొదుపైనది. ఎందుకంటే యిది ఆధునికమైన పాల సంఘం యొక్క ఉత్పాదన— "శ్వేత విప్లవం" తీసుకురావడంలో అందరికన్న ముందడుగు వేసారు

**జాగ్రత్త పడటం**

పాప ఆహారానికి ఉపయోగించే అన్ని వస్తువుల్ని, సీసాని, ఎప్పుడూ ఆరోగ్యరీత్యా బాగా శుభ్రంగా కడిగి నీటిలో మరగబెట్టాలి పాప ఆహారాన్ని తయారు చేయడానికి కూడా మరిగిన నీటినే వాడండి పాప సరియైన పోషణకోసం, డబ్బాపైన యివ్వబడిన అమూల్‌స్ప్రే మోతాదుల ప్రకారమే ఖచ్చితంగా పాప ఆహారాన్ని తయారు చెయ్యండి

**ఉచితం!** ఉపయోగకరమైన వివరాలు యీ అధ్యాయాల్లో ఉన్నాయి అవి- గర్భధారణ ప్రసవానికి ముందర జాగ్రత్త, ప్రసవము తల్లి పాలు ఇతర ఆహారములు, మిశ్రమ ఆహారమును అలవాటు చేయుట, పిల్లవాని దిన చర్య పిల్లవాని అభివృద్ధి, జబ్బులను అరికట్టుట, ప్రథమ చికిత్స, సాధారణ రోగములు జబ్బుతోనున్న పిల్లవాని సంరక్షణ జ్ఞానము ముందుగా తెలుసుకోవలసిన విషయములు ఈ పుస్తకం తెలుగు ఇంగ్లీషు హిందీ తమిళం, మలయాళం, మరాఠీ గుజరాతీ బెంగాలీ భాషల్లో దొరుకుతుంది దానికోసం పోస్ట్ బాక్స్ 10124, బొంబాయి 400 001 అడ్రసుకు మీ పేరూ, పూర్తి అడ్రసు యిస్తూ రు 1 25 స్టాంపుల్ని జతపర్చండి




## అమూల్‌స్ప్రే

తల్లిపాల తరవాతనే ఇది

అమ్మకం చేయించువారు
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్,
పోస్ట్ బాక్స్ 10, ఆనంద్ 388 001, గుజరాత్



ASP/AS TEL5/83

కుంగాడా    పాడించుకుంటూ  కూర్చుంటాడా మనకేదో సంసార పక్షంగా వుండాలిగాని

అయితే ఏమీ కుగర లేదన్నమాట

అదిగో   చెప్పానుగా   ఎలాగయ్యిందీను అయినా మనకు తొందర రెందుకోయి  మగ పిల్ల-వాని  తరుపు  వారికి  అన్నాడు  ఆనందరావు ఆవలిస్తూ

మన రాధ సంగతి చెప్పావుగాదు  మూర్తి

ఆ దాని పెండ్లి అయ్యేనాకనే అబ్బాయి పెండ్లి యింట్లో ఆడపిల్లను పెట్టుకుని పిల్లవాడి పెండ్లికి తొందరెందుకని  నిదానంగా అన్నాడు

అవునులే  అన్నాడు జుట్టు నెరసిన మూర్తి లేస్తూ

పది దాటినట్లుంది  పద నిన్ను దిగ బెట్టి-వస్తా  అన్నాడు అరవయ్యో పడిలో వున్న ఆనంద-రావు  పొన్నుకఱ్ఱ  ఆడించుకుంటూ  యిద్దరూ బయటకు నడిచారు  మిత్రులు కలసి నప్పుడు సాధారణంగా జరిగే సంబాషణ అది ఎడ తెగని సమస్యలు  జవాబులేని ప్రశ్నలు

*            *            *

గదిలో  పుస్తకం చదువుతున్న రాజు  విసుగ్గా పుస్తకం బల్ల మీదకు విసిరి దీపం ఆర్పి పక్క మీద వాలిపోయాడు  నిట్టూర్పుతో   తనకు  నచ్చిన సంబంధం తల్లి దండ్రులకు నచ్చదు వారికి నచ్చిం-దంటూ ఏదీలేదు  తనకు వివాహ యోగం లేదేమో తండ్రి జాతకం చూచే వుంటాడు మరి కాని తన వివాహం చర్చ కనీసం రోజుకే మారైనా జరుగుతునే వుంటుంది  అందుకే తాను ఆడపిల్లల యిండ్లకు పోయి  చూడడం  కూడా  మానుకున్నాడు  ఏదో బజారు వస్తువును నాణ్యం చూచి బాగుంది బాగాలేదు  నచ్చింది  నచ్చలేదు అనడం చదువు-కున్న తనకు సబబుగా లేదు అనిపించింది  అయినా

# మారని మనుషులు

ఈ చూపుల తతంగంతో ప్రయోజనం ఏముంది గనుక  అంతా సరిపోతే జాతకాలు సరిపడవుగా తండ్రి రాదకు సంబంధాలు చూడడు 'దానంతటవే'-కాలం కలసి వచ్చినప్పుడు వస్తాయి  అంటాడు తనను ఎరగా వుంచుకొని దోబూచు లాడుకుంటు-న్నాడాయన  కోపం  విచారం రెండూ వచ్చాయి రాజుకు   అయినా తన సంగతి ఎవ్వరికి పట్టింది గనుక  చిన్నప్పటి నుండి కూడా అంతే  తను పుట్టినాక అక్క చనిపోయింది  నష్ట జాతకుడు ఏటేటా కాన్పులతో పదిహేడేండ్లకే తల్లి విసిగి వేసారి పోయి తనను సరిగ్గా చూచుకోలేదు తన తరువాత మరి పదకొడు మంది వరసగా పుట్టారు  తను యింకా ఒడిబిడ్డ వయస్సులో నే ఎడబిడ్డ అయ్యాడు ఎనిమిదవ ఏట చదువులకని మేనమామ ఇంటికి పోయాడు  అప్పటి నుంచి యిప్పటి వరకూ ఇల్లు పట్టకుండా దేశ దిమ్మరిలా తిరుగుతూనే వున్నాడు తన జీవితం ఓ తాడు లేని బొంగరం  ఇప్పుడు సంపాయించే యంత్రం  వున్న ఆస్తంతా ఆడ పిల్లల  పెళ్ళిళ్ళకు,  పండగలకి   పబ్బాలకు పురుట్లకు హరించుకు పోయింది  తనకు బాగా గుర్తు  దసరా పండుగల కోమారు తను ఇంటి-కొచ్చాడు  అందరికీ బట్టలు తీయిస్తూ తండ్రి తనకు మామూలు బట్టలు తీయించాడు  తాను సరదాపడి ఏదో మంచి రకం బట్ట అడిగాడు "మగ పిల్లాడికి  షోకు  లెందుకురా "  అని  తండ్రి కొనలేదు  అంతవరకూ ఎందుకు యిప్పుడు తను సంపాయిస్తున్నాడు  కదా  మోజుపడి  తానేదైనా కొనగలిగాడా?  ఎంత వున్నా నాన్న సంసారం క్రింద జమా అయ్యి పోతుంది ఏదో పట్టుదలలు వచ్చి వున్న వుద్యోగాన్ని వదిలిపెట్టాడు తండ్రి సంపాయించే కొడుకుండగా నాకేమిటీ అంటు

ఇప్పటికి పదేండ్లు బట్టి యిదే తతంగం  ఇంకా వెనుక చిన్న పిల్లలున్నప్పుడు పెద్దవాడికి సరదా-లేమిటి?' ఒకప్పుడు యివి కూడా తండ్రి మాటలే కష్టపడి చదివి  డాక్టరు పట్టా పుచ్చుకొని అప్పుడే ఆరేండ్లయ్యింది పల్లెలలో ప్రప్రధమంగా వేశారు సరదాగానే వుండేది పని కాని సదుపాయాలుండేవి కావు పల్లెలలో చాదస్తం చాంధసం ఎక్కువ అందుకని చాలాసార్లు తనే చేతులు కాల్చుకోవలసి వచ్చేది  ఈ సంగతులు ఇంటికి వ్రాస్తే డాక్టర్లు సేవా పరాయణులు  త్యాగ జీవి తన సదుపాయా-లను చూచుకోడు  అని శ్రీ రంగ నీతులు వ్రాస్తూ తండ్రి "చెల్లెళ్ల కాలేజీ ఫీజులు కట్టాలి జీతం అందగానే పంపు దుబారా ఖర్చులు చేయకు  అని వ్రాసేవాడు

ఒకసారి రామవరంలో జబ్బుపడ్డాడు తను  పచ్చి మంచినీళ్ళు  పోసే దిక్కులేక పోయింది  ఏదో ఆసుపత్రిలోని అలగాజనం భయపడుతునే ఆదు-కున్నారు  సెలవు పెట్టి వూరు వెళ్ళాడు తను ఏం అలాగున్నావని ఎవ్వరూ అడగలేదు  ఏం తెచ్చావు ఎంత తెచ్చావు– అన్నవారేగాని నాలుగు రోజులుండి తనకు తోడుగా వుండి వండి పెట్టడానికి పెద్ద చెల్లెలిని పంపమన్నాడు  సెలవలేగా రెండు నెలలు  రెండు నెలలు నా దగ్గర వుండని అన్నాడు తను బుంగమూతి పెట్టింది చెల్లెలు

ఆ పల్లెలో నేను రాను బాబు  అంది  నే నుండడంలేదా? తన ప్రశ్న

నీకు వుద్యోగం అక్కడ తప్పనిసరి  నాకేం అంది చెల్లెలు  తనకు తప్పనిసరి  ఎందుకని? ఎవ్వరికోసం అని?? అడగాలనిపించింది అంతలో నే తల్లి  అందుకొని  కాలేజీలో  చదివే పిల్ల దాని కక్కడేమి తోస్తుందిరా  నీవు మరీను  అంది ఆడ-పిల్లను సముదాయిస్తూ  అమ్మా నీవు రాకూడదా అన్నాడు  నసగినట్లు  అమ్మ వస్తే నాకెలాగరా గంపెడు  సంసారం  చూచుకోవద్దూ  అన్నాడు తండ్రి  అందరికీ అన్ని సదుపాయాలు కావాలి తనకు తప్ప  తాను అప్పటికి  యిప్పటికి మరి ఎప్పటికి ఎడబిడ్డే

ఇద్దరు చెల్లెళ్ళకు వివాహాలు జరిగి పోయాయి తన చేతుల మీదే  ఇంటికి పెద్ద కొడుకు తండ్రితో సమానం  మరి  అప్పులు ఎలాగో తీర్చాడు పెద్దింటి కోడలైన పెద్ద చెల్లెలు దర్పంతో తనను తూలనాడింది

ఆరేండ్ల సర్వీసులో ఈమారు అడిగి పట్టణం వేయించుకున్నాడు తను  ఏదో రెండేళ్ల పాటు యింటి పట్టున వుందామని  ఇంటికి రాగానే అదేమిటిరా  చక్కగా ప్రాక్టీసు వున్న వూరు కాదని యిక్కడికి వేయించుకున్నావు  ఇక్కడేమి దొరు-కుతుంది ? అని అడిగాడు తండ్రి

డిసెంబరు 5న విజయవాడలో జరిగిన సంగీత సామ్రాట్ చిత్రం అబినందన సభలో ప్రసంగిస్తున్న శ్రీ రెంటాల గోపాలకృష్ణ వేదికపైన ఉన్న శ్రీ సి సత్యనారాయణ (కృష్ణా ఎంటర్ ప్రైజెస్) శ్రీ వీరాజీ నిర్మాత డాక్టర్ శ్రీమతి కె శ్యామలమ్మ గార్లని కూడా చిత్రంలో చూడవచ్చు



ఇంటికి వచ్చాననే సరదా చప్పగా చల్లారి పోయింది ఏదో ఇంట్లో వుంది చెల్లెళ్ల తమ్ముళ్ల అగడం అదమాయిస్తే "నీ కెందుకురా ఎప్పుడూ యింటి పట్టున వుండని వాడివి వారి జోలిందుకు? అని చెరో ప్రక్క నుంచి తల్లి దండ్రులు తన్ను మందలించారు తను వేళ కాని వేళ వచ్చినప్పుడు అందరూ విసుక్కొనేవారు కడకు తల్లి కూడా ఇప్పుడె నడుంవాల్చానురా అన్నం కూర మూతేసి వున్నాయి వడ్డించుకో అయినా నీకు అలవాటేగా " అనేది తల్లి వడ్డిస్తే వేడి వేడిగా తినాలని చెల్లెళ్లతో - సరదాగా యిన్నాళ్లకు వుందామని తను వచ్చాడు కాని జరిగిందేమి-టంటే తన యింట్లోనే తాను పరాయివాడు మధ్యలో యిదొక రగడం పెండ్లి అదేదో ఆ తతంగం ముగిస్తే తానో సంసారిగా ఎక్కడో పడి వుండేవాడుగా ఆ అలాగైతే రాధ పెండ్లి ఎలా అప్పుడే పెండ్లి కెదిగింది దాని పెండ్లి పూర్తి అనిపించేసరికి రాణి సుధ రమ వున్నారు ఎలా ఎన్నాళ్ళిలా యిలా ఆలోచిస్తున్న రాజు నిద్రలోనికి జారుకున్నాడు ఎప్పుడో రెండు గంటలకు

ఆసుపత్రి రోగులతో కిటకిట లాడుతుంది అప్పుడే తొమ్మిదినర ఇంకా జనం క్యూలో వున్నారు 'లోపలికి రావచ్చునా' వీణ మీటింది తల త్రిప్పి చూచాడు రాజు ఆమె క్రొత్త డాక్టరు చక్కటి విగ్రహం ఎవ్వరినైనా ఆకట్టుకునే నల్లని పెద్ద పెద్ద కండ్లు కుందనపు బొమ్మలాగుంది 'రండి అన్నాడు తను లేస్తూ నన్ను యిక్కడకు బదిలీ చేశారు ఈ వేళే పనిలో చేరాను మిమ్ములను కలుసుకోమన్నారు బైది బై నాపేరు విజయ తన్ను తాను పరిచయం చేసుకుంది డాక్టర్ విజయ

పేరు తప్ప తతిమా సంగతులు తన మనస్సుకు పట్టలేదు అంతకు ముందు తను ఎంతో మంది లేడీ డాక్టర్లను చూచాడు కాని ఎప్పుడూ తనలో యిలాంటి అనుభూతి తనలో కలుగలేదు విజయకు ఆసుపత్రి అంతా చూపించాడు అందరితో పరిచయం చేశాడు ఆనాడు ఎందుకో చాలా ఆనందంగా వుంది ఇంటికి వెళ్లినప్పుడు చాలా గట్టిగా నవ్వుతూ క్రొత్త డాక్టరు సంగతి చెప్ప బోయాడు ఓ చెల్లెలు పోనిద్దూ నీ హాస్పిటల్ సంగతి అని తన ఆనందం మీద చల్లనీరు పోసింది ఎందుకో పదే పదే విజయ గుర్తు-కొస్తుంది మిలమిల మెరిసే కండ్లు కొంటిగా నవ్వే పెదాలు గాలి కెగిరే వుంగరాల జుత్తు ఎవ్వరినీ లెక్కచేయని బిరుసుతనం చలాకీ తనం తనేమైనా ప్రేమలో పడ్డాడా? చా అదెలా సంభవం మన వూరుకాదు పేరుగాదు శాఖ వేరు జాతకాలు కూడా కుదరవు నవ్వుకున్నాడు ఇది తనకు తెలుసు ఆలోచించి మనస్సు పాడు చేసుకోవడం వెఱ్ఱి వుట్టి కెక్కలేనమ్మ స్వర్గాని కెక్కుతుందా? అయినా తన మనస్సు ఆగడంలేదు తన ఈ నూతన పరివర్తన తనకే అర్థం కావడంలేదు

రోజులు గడచిపోతున్నాయి తనపనేదో చేసుకు-పోవడమేగాని అతిగా మాట్లాడే అలవాటు విజయకు లేదు కల్పించి తను మాట్లాడుతే ఏమను-కుంటుందో' అయినా ఓ రోజు అడిగాడు నెమ్మదిగా మీకు యిల్లు అది దొరికిందా డాక్టర్? అని

లేదు ఏదో మంచిది దగ్గర్లో దొరికితే మా వాళ్ళు కొన్నాళ్లపాటు వచ్చి వుంటామంటు-న్నారు' అని జవాబిచ్చింది మా వాళ్ళు అంటే ఎవ్వరో ఎలాంటి వారో యివే ఆలోచనలు ఎందుకో ఓ రోజు విజయ మరో డాక్టర్‌తో మాట్లాడుతూ వెళ్లడం చూచాడు ఆ రోజెందుకో మనస్సు నిలబెట్టుకోలేక పోయాడు అయినా తనకే మధికారముందావిడ మీద? తనకు నిలకడ-లేకపోతున్నది ఏ పనిలోనూ మనస్సు లగ్నం చెయ్యలేకపోతున్నాడు తను ఏమిటో ఈ విచిత్రమైన బాధ

తన యింటికి విజయని పిలిచాడొకరోజు సంధ్య చీకట్లో సౌరభాన్ని వెదజల్లె సన్నజాజి-లాగా వచ్చింది విజయ అందరికీ పరిచయం చేశాడు ముక్తసరిగా మాట్లాడి తప్పుకున్నారు చెల్లెళ్ళు వీడు కూడా కండ్లు విప్పుతున్నాడు లాగుందే అనుకుంటూ విచిత్రంగా చూచింది తల్లి ఎవ్వరితోనైనా పట్టింపు లేకుండా గోల-గోలగా మాట్లాడే తన తండ్రి అప్పుడే విజయతో వాదులాటకు దిగాడు ఆ రోజు తనకు చాలా ఆనందంగా వుంది ఏవేవో వూహలు

ఒక రోజు మీరు వూరు చూచారా ? అడిగాడు రాజు లేదండి తోడులేనిదే వెళ్లడం అలవాటు లేదు విజయ జవాబు మరి ఆదివారం నాతో రావడం అభ్యంతరమా గొంతుకలో జంకు అబ్బే అలానే సరదాగా తిరిగి

## యజ్ఞం

శంఖంలో పోసిననీరు
తీర్థమౌతుంది!
బూడిదలో పోస్తే పన్నీరైనా
బురదగా మారుతుంది!
ఆచరణ శీలి వచించేది
ప్రవచన మంటారు!
నీచుడు నీతులు వల్లించినా
వాచాలుడనే వాకొంటారు!
వంకర పనులు చేసేవాడు
ఏది వాగినా వగరే!
వగరు చిగురు మేసే కోకిల
ఏది పాడినా మధురమే!
దక్షుని యజ్ఞ వాటిక
రణరంగ మయింది!
రణరంగం గీతాబోధనచే
యజ్ఞ భూమిగా మారింది!
ఆజ్యం పోసి వేల్చేది
యజ్ఞం కాదు
నియతమైన కర్మాచరణమే
నిజమైన యజ్ఞం!

—పి. వి. యస్. పాత్రో

వద్దాం ఎక్కడెక్కడికి ? అంది చిన్న పిల్లలా జంకు గొంకు లేకుండా ఆదివారం రానే వచ్చింది తను నీటుగా తయారయ్యాడు వెదవది తనకు కారులేదు అని విసుగుకొన్నాడు అతన్ని చూడగానే పదండి లేట్ చేశారేం? అంది

భుజాన కెమెరా పసి పిల్లల ముగ్ధత్వం ఆమెలో వెల్లు విరిసింది గంభీరంగా తన పని చూచుకునే డాక్టర్ విజయకు "పిక్‌నిక్"కు తయారయిన ఈమెకు చాలా తేడా వుందనిపించింది ఆమె నవ్వులో తన నవ్వు కూడా కలిపి వూరు చూడడానికి వెళ్లారు యిద్దరు సాయంత్రం వస్తూ వస్తూ ఆ వూరి గుడికి తీసుకుపోయాడు తను ఆమెను గుడినుంచి బయటకు వస్తూ ఫొటోలు తీస్తూ అడిగింది విజయ ఏ వరం దేవుడిని కోరారు?" అని చిలిపిగా ఎందుకో తడుముకోకుండా అన్నాడు తను మీలాంటి అందమైన అమ్మాయి లభించాలని !!" అన్న తరువాత నాలిక కరచుకున్నాడు మరి విజయ విన్నదో లేక ఫొటోలు తీయడంలో వుండిందో గాని జవాబేమిరాలేదు పరిశీలనగా ఆమెను చూచాడు ఏ మార్పు కూడా ఆమెలో కనబడలేదు మాట వినే వుండాలి " ఏంటే ఈవిడెలో నిగ్రహం ఎక్కువే తన్ను ఓ వెధవగా జమా కట్టిందేమో " అని అనుకొని చాలా భయపడ్డాడు రాజు కాని అలాంటి దేమీ జరగలేదు విజయ మామూలుగానే వుంది మరో రెండు మూడుసార్లు కూడా

## చెట్లకు టీకా మందు!

**హనోవర్ విశ్వ విద్యాలయంలోని శాస్త్రవేత్తలు** చెట్లకు టీకా మందును తయారు చేశారు భూమిలో మొక్కల వేళ్లలో నివసించే సింబియాసిస్ అనే బాక్టీరియా రకం నించి తయారు చేసిన ఈ టీకా మందులు ఫంగస్ వ్యాధులను నిరోధించ గలవు తొలి ప్రయోగాలలో ఈ మందువల్ల బార్లీ, గోధుమ మొక్కలలో ఈ ఫంగస్ వ్యాధులను నిరోధించే శక్తి ఎక్కువయినట్లు తేలింది

(గ్లోబల్)

## మారని మనుషులు

విజయను తీసుకొని అన్నీ చూపించాడు ఇల్లు కూడా వెదికాడు అప్పుడే జరిగింది ఇంట్లో గొడవ ఒకరోజు ఇంట్లో అడుగు పెడుతునే తండ్రి ఏరా పెద్దాడివైనావు మరీ కుఱ్ఱచేష్ట లేమిటి? ఆ లేడీ డాక్టర్ని వెంటేసుకు తిరుగుతున్నావట చూచినవాళ్లు అడిగారు సూటిగానే అడిగాడు తండ్రి ఆనందరావు ఎటో చూస్తూ

"ఆమెకు వూరు కొత్త అందుకని చూపించడానికి తీసుకెళ్లాను " మెల్లిగా జవాబిచ్చాడు అపరాధిలా 'కిస్సుక్కున నవ్విందో చెల్లెలు మరో చెల్లి నవ్వాపుకుంటూ గదిలోకి పారిపోయింది అందరూ తన్ను దోషిగా చూస్తున్నట్లనిపించింది "ఏం చాలా మోజుగా వున్నట్లుంది" తల్లి అదలింపు చక్కగా మగాళ్లను గేలం వెయ్యగలదిగా వుంది చూచినప్పుడే అనుకున్నాను అదేదో అలాంటి బాపతేనని నెరజాణ " ఛా ఆవిడ చాలామంచిదమ్మా అన్నాడతను ఓ ఆడపిల్లమీద అభాండం వేస్తున్న తల్లిని చూస్తూ అబ్బో అప్పుడే వెనకేసుకొస్తున్నావు ఏమిటి సంగతి? ఆ కట్టు బొట్టు తీరు ఛి ఛి అయినా మన బంగారం మంచిదైతే కంసాలి నెందుకనాలి ? అని సాగదీస్తూ అన్నదావిడ విసుగ్గా బాధగా తన గదిలోనికి పోయాడు రాజు ఛ ఇది ప్రపంచం తీరు వీరు మారని మనుష్యులు స్వార్థపరులు అనుకున్నాడు,

అలాగున్నారేం ? అడిగిందో రోజు విజయ తను ముభావంగా అంటీ అంట నట్లుండడం కనిపెట్టినట్లుంది ఏమీ లేదన్నాడు తను కాని వదలలేదు విజయ ఇంటికి రావడం మానేశారేం? అని అడుగుతూ పిల్లాడిని పోకిరిగా తిరగవద్దని అమ్మా నాన్నా అన్నారులా వుంది అన్నది అల్లరిగా గతుక్కుమన్నాడు తను ఆవులిస్తే పేగులు లెక్కపెట్టుతుంది విజయ గుండె వుద్వేగం హెచ్చింది అక్కడ ఎవ్వరూ లేరు

ఎందుకనో తన కథంతా చెప్పాడా రోజు అంతా విని అనునయంగా నవ్వి వెళ్లిపోయింది విజయ ఆమెలో ఏ భావమూ కనబడలేదు తనకే మనశ్శాంతి లేదు నిద్రపట్టదు ఎడతెగని వూహాలు ఏదో చేయాలని ఉబలాటం చేయలేని చేతకానితనం తననందరూ బందించా-రనిపించింది దానిని త్రెంపుకొని బయటపడాలి తన బాధ్యతలు తన అవసరాల మధ్య యుద్ధం జరుగుతోంది భయం బాధ ఏమిటో!!

రాజుకు బదిలీ అయ్యింది మరో వూరు వెళ్లే ముందు అన్నాడు ఇంకా యిలా సన్యాసిలాగా వుండలేను విజయను చేసుకోవాలని వుంది వారు కూడా బ్రాహ్మలేను అన్నాడు నానుస్తు ఏం బ్రాహ్మలురా ఉత్తరాది వాళ్లు మనకు వారికి ఎక్కడ సంబంధం మతిపోయిందా ఏం కొంచెం ఆగు సంబంధాలు వస్తున్నాయిగా రాధకు కాగానే నీది అయినామాకు మాత్రం లేదా పెద్ద కొడుక్కి వివాహం చేయాలనీ? అన్నాడు తండ్రి కొడుకు చేయి జారిపోతాడేమోనని అంతలోనే తల్లి అందుకుంది అయినా మగరాయుడులాగా టింగు రంగా' అని నీలాగే బయటకు పోతే యిల్లు వాకిలి ఎవ్వరు చూస్తారు? అదీ కొంచం చదివి సంసార పక్షంగా వుంటే నాకు చేదోడు వాదోడుగా వుంటుందిగాని అన్నది నుదుటిమీది చెమట తుడుచుకుంటూ మగవాడివి నీకేం తొందరరా ఆడపిల్లలు ఎదిగ్గి యింట్లో వుంటే "నాకు పెండ్లి చెయ్యి" ననడానికి సిగ్గులేదూ ?" తండ్రి వువాచ "అ అ ఆవిడ వీడికి మందు పెట్టింది వీడి వాలకం చూడిండి అన్నది తల్లి రెట్టింపుగ తన సంసారం-మంటూ వుంటే తమని చూడడేమోనని వీరి భయం తండ్రి పుట్టించిన సంతానానికి తను బాధ్యుడు ఆయనకు లేని తాపత్రయం తనకు ఇంతలేసి డబ్బుపోసి చదివించాం మాకు అంది వస్తావని కదూ మళ్లా తండ్రిమాట వీరితో చెప్పి లాభంలేదు వీరు మారని మనుష్యులు అని అను-కున్నాడు రాజు మరోమారు ఈసారి రాజుతో ఎప్పుడూ లేనిది తల్లి "వస్తానంటూ" తయా-రయ్యింది తన మీదే కన్నువేసి వుంటానికి కాబోలు మరి

* * *

క్రొత్తవూరు ఎక్కువ పని పనిలో లీనమైనాడు ఈమారు ఆనందరావు రోజు పెండ్లికోసం తొందర-పడుతున్నారు పెండ్లంటూచేసి వాడిని తమ పిడి-కిలిలోనే వుంచుకుందామని సంబంధాల గురించి వ్రాస్తున్నారు రాజు చాలా వుదాసీనంగా వుండిపోయాడు తల్లి వెంట వుండి ఒకటే గోల. ఏ ఉత్తరం వచ్చినా "ఎక్కడినుంచి" అని ఆరాతీసేది ఫోను తాను వినాలని గబగబా వచ్చి నుంచుండేది తనకు చిరాకు ఎక్కువయ్యింది తల్లిదండ్రుల సతా-యింపు ఒత్తిడి ఎక్కువయ్యాయి ఎంత సంపా-యించినా డబ్బు చాలేదికాదు తల్లి ప్రతీ పైసా లెక్క అడిగేది తన జీవితం యింతే దీనికి అంతెక్కడ తనూ ఓ మనిషి అని ఎవ్వరూ పరిగణించరు తానో వలయంలో చిక్కుకున్నాడు వీటితో పాటు వున్నట్టుండి బంధువులు నాన్న తరువు స్నేహితులు అందరికీ తన వునికితో అవసరం వచ్చింది సలహా-లతో సహా హాజరయ్యేవారు సంబంధాలతో కనిపించే వారు చిన్న పిల్లవాడికి చెప్పినట్టు నీతి బోధ చేసేవారు దీనితో తల మునకలయ్యేది తనకు ఏమీ తోచేదికాదు పరధ్యానంగా అన్య మనస్కంగా వుండేవాడు

వున్నట్టుండి విజయ దగ్గిరనుంచి ఉత్తరం వచ్చింది తాను ఆవూరు ఫలానా, పనివుండి వస్తున్నట్టు వీలుంటే తనని కలుసుకోమని దాని సారాంశం రైలు రావడానికింకా గంట వుండనగానే స్టేషను చేరుకొని పచార్లు చెయ్యడం మొదలు పెట్టాడు ఆ రోజు తను సెలవు తీసుకున్నాడు రైలు ఎంతకీరాదేం ? తొందరపడ్డాడు రైలు దాని మానాన అది టైముకు వచ్చింది రాజు తొందర దానికి లేదుగా మరి విజయ రైలు దిగింది ఎప్పటిలాగే ఆ నవ్వు ఆమె నలగని గులాబి హోటలకు పోయాక రాజు సంగతులన్నీ చెప్పాడు "కావాలనుకున్న వస్తువు తెచ్చుకోవడం నేర్చుకోవాలిగాని యింకా అమ్మా నాన్న తాయిలం చేతిలో తెచ్చిపెట్టాలా " అన్నది భావ గర్భితంగా అవును మరి ఎలా యిన్నాళ్లు? తానేమి చిన్న పిల్లవాడు కాదుగా

తిరుపతి కొండమీద తన స్నేహితుల సమక్షాన రాజు విజయ ఏకమయ్యారు మారని మనుష్యు-లకు మారని మనుగడకు దూరంగా వారు రాజును విజయను ఆడిపోసుకున్నారు కొడుకుతో తెగతెంపులు చేసుకున్నారు డబ్బుకు తప్ప. శృంఖాలయితే విచ్చుకున్నాయి గాని దాని తాలుకు మచ్చలు చెరగిపోలేదు

చూడు నాన్న అన్నయ్యా

చూడు డాడీ పాప

అని యిద్దరు పిల్లల ఫిరియాదులతో ఆలోచనలు పటాపంచలయ్యాయి కండ్లు విప్పి చూచాడు ఎలా గొచ్చారో అట్లాగే ఆడుకోడానికి పారిపోయారు పిల్లలు చిన్నది అంతా నీలాగే అల్లరి ఎంకతనం అన్నాడు రాజు కూతురును ముద్దుగా చూస్తూ అప్పుడే అక్కడకు వచ్చిన విజయతో ఆ అబ్బాయి అంతా మీలాగే శుద్ధ మొద్దావతారం అమ్మకొంగు వదలడు అన్నది విజయ సగర్వంగా కొడుకుని చూస్తూ వెక్కి-రింపుగా

వాడు నీలాంటి చలాకీ పిల్లను వెదకి పట్టు-కుంటాడులే అన్నాడు రాజు కొంటెగ

మీ రప్పుడు వద్దు అంటే? మారని మనుషుల్లే కూర్చుంటే?? చాదస్తం రావచ్చుగా " అంది నవ్వుతూ

వాళ్ల తరం వేరు అన్నాడు రాజు సాలో-చనగా ఏ తరం అయినా సంఘం మనుగడ వారి మనస్తత్వం మారాలిగా. " అంది విజయ □

ఇటీవల బొబ్బిలి డిపార్ట్‌మెంటల్ టెలిగ్రాఫ్ ఆఫీసువారి ప్రథమ వార్షికోత్సవ సందర్భంగా ప్రదర్శింపబడిన సినిమా తీస్తున్నాం నూతన తారలు కావాలి నాటకంలోని ఒక దృశ్యంలో శ్రీయుతులు ఎస్ వి కనకరాజు కె బాస్కరరావు, ఎస్ వి రమణ సి హెచ్ సాంబమూర్తి వి నారాయణరావు అచ్చన్నలను చిత్రంలో చూడవచ్చు



సీరియల్

# కాగితప్పు పడవలు

యర్రగుంట్ల వరలక్ష్మిదేవి

(గత సంచిక తరువాయి)

## 14

తొమ్మిది గంటలవరకు పిల్లలందరు తండ్రి దగ్గరే కూర్చున్నారు ఎంతో విచారంతో ఈ దుఃఖ సమయంలో ఎవ్వరూ సుమతిని ఏమీ అనలేదు వాళ్ల దృష్టి అంతా తండ్రి మీదే అతడు మళ్లీ బ్రతికి బయటపడతాడా అన్నదే వాళ్ల ఆందోళన తొమ్మిది తరువాత తను తండ్రివద్ద ఉంటానని వాళ్లను పోయి పడుకోమని సుమతి చెప్పింది ఆ గదిలోనే ఓ మూల జయలక్ష్మి మంచం వేసుకుని పడుక్కుంది రామారావు దీపాలు పెట్టేవరకు ఉండి మళ్లీ కంటకాపల్లి వెళ్లిపోయేడు

సుమతికి నిద్ర రావడంలేదు మనస్సంత ఖేదంతో నిండిపోయింది ఇరవై నాల్గు గంటల్లో సమతి మానసికంగ చాల పూర్ణతను పొందింది ఇప్పుడు సరిగ్గా వివేకంతో ఆలోచించ గల్గుతూంది ఈ పరిస్థితి కంతటికీ తనే కారణమని చాల బాదపడ జొచ్చింది తనవల్ల తనను కాపాడిన జగ్గారావును తండ్రి దుర్భాషలాడినందుకు చింతించింది అన్ని విషయాలు తల్చుకుంటుంటే సుమతికి మళ్లీ సన్నగా యేడ్పు కల్గింది మంచం ప్రక్కన కూర్చుని తలను మంచంమీద ఆనించి కూర్చుంది

అర్ధరాత్రి దాటింది కుటుంబరావుకి తెలివి వచ్చింది గదిలో కొడిగుడ్డు దీపం వెలుగుతూంది ఆ పలుచని వెలుగులో తన మంచం దగ్గర కూర్చుని సుమతి మెల్లగ యేడ్వడం కుటుంబరావు గమనించేడు ఆ స్థితిలో అతడి మనస్సు జాలితో నిండిపోయింది కుడిచేతిని ఎత్తి సుమతి తలమీద ఉంచేడు

సుమతి తల ఎత్తి తండ్రిని చూచింది తండ్రి తన వైపే చూస్తున్నాడు అతని కండ్లలో కోపం లేదు, కారుణ్యం తప్ప సుమతి దుఃఖం కట్టలు తెంచుకుంది

**జరిగిన కథ - 8 : పార్వతి పెళ్లి జరిగిపోయింది. చొక్కారావుతో వెళ్లిపోయిన సుమతిని జగ్గారావు తీసుకొని వచ్చి వాళ్ల ఇంటిలో దిగ విడిచి తాము విశాఖపట్నంలో సినిమాకు వెళ్లినట్లు సుమతి తండ్రి కుటుంబరావుతో అబద్ధం చెప్పాడు. కుటుంబరావు ఉగ్రుడయ్యాడు. శకుంతలమ్మ వచ్చి సుమతిని తన కొడుక్కి ఇచ్చి పెళ్లి చేయమని కుటుంబరావుని అడిగితే, అతను ససేమిరా తన కూతురిని జగ్గారావుకు ఇవ్వనని మొండి పట్టు పడతాడు. కుటుంబరావుకి రక్తపు పోటు వచ్చి పడిపోయాడు. జయలక్ష్మి తనని పెళ్లి చేసుకోమని రామారావుని వేడుకుంది. రామారావు .తన అంగీకారం తెలిపాడు.**

నన్ను క్షమించు నాన్నా! నావల్లే ఇదంతా జరిగింది అందరికి నావల్లే దుఃఖం కల్గింది ఒక్కటి మాత్రం నిజం నాన్నా నేనేం చెడిపోలేదు అసలు జరిగిందేమిటంటే నేను మన వీధి కొసనున్న దర్జీవాడు చొక్కారావుతో స్నేహం చేసేను అప్పుడప్పుడు వాడి దుకాణంలో ఎవ్వరూ లేనప్పుడు మాట్లాడుకుంటుండేవాళ్ళం అంతకుమించి మరేం లేదు కొద్ది రోజుల క్రితం వాడు తనతో లేచి వచ్చేయమన్నాడు ఇద్దరం అన్నవరం వెళ్ళి వివాహం చేసుకుందామన్నాడు మూర్ఖురాలను ఏం చేస్తున్నానో తెలియని స్థితిలో వాడితో వాల్తేరు స్టేషనులో రైలెక్కేను నిన్న సాయంత్రం |ఆ బండిలోనే జగ్గారావు కూడ ఉన్నాడు నన్ను, చొక్కారావుని తుని స్టేషనులో చూచి పట్టుకున్నాడు చొక్కారావుని కొట్టేలోగానే వాడు భయపడి పారిపోయేడు నన్ను చీవాట్లుపెట్టి బండి దించి తిరుగురైల్లో ఎక్కించి వాల్తేరులో దింపి, మీరంతా చాల ఆందోళన చెందుతుంటారని వెంటనే ఆటో రిక్షాలో నన్ను తెచ్చి మీకు సురక్షితంగ అప్పచెప్పేడు మీరు నన్ను తిట్టకుండ నేను ఇంట్లో, బయట అపఖ్యాతిపాలు కాకుండ తప్పునంత తనమీద వేసుకుని మీచేత తిట్లు కూడ తిన్నాడు జగ్గారావు చాల మంచివాడు నాన్నా నేను చెప్పిందంత నిజం! ఆ వెంకటేశ్వరునిమీద ప్రమాణంచేసి చెప్తున్నాను తప్పంతా నాది నన్ను క్షమించు నాన్నా! అని సుమతి యేడ్చింది

లే అమ్మా లే మరి యేడ్వకు నిన్ను నమ్ముతున్నాగా మరి యేడ్వకు పోయి పడుకో రేపు నేనే జగ్గారావుని పిలిపించి నా తప్పును దిద్దుకుంటాలే జయా! చెల్లెల్ని తీసుకుని వెళ్ళి పడుకోపెట్టు పిచ్చి తల్లి! ఎంతసేపయింది యేడుస్తుందో

సుమతి తల తిప్పి చూసింది వెనుక అక్క జయలక్ష్మి నించునుంది జయలక్ష్మి ఆశ్చర్యంతో అంతా వింది

పదమ్మా - పద పోయి పడుక్కుందాం, అని చెల్లెల్ని లేవనెత్తి తీసుకుని వెళ్ళి తన ప్రక్కన పడుక్కోబెట్టుకుంది అజ్ఞానం యెంత ప్రమాదానికి దారి తీసింది! జగ్గారావు అడ్డుకోకపోతే సుమతి జీవితం బూడిదపాలవును మనస్సులోనే జయలక్ష్మి జగ్గారావుకి నమస్కారం పెట్టుకుంది తరువాత తండ్రి మళ్ళీ కదలి మాట్లాడ గల్గుతున్నందుకు జయలక్ష్మికి ఆనందంగా ఉంది

మరునాడు కుటుంబరావు కొడుకు సహాయంతో మెల్లగ లేచి కాలకృత్యాలను తీర్చుకోగల్గేడు కటుంబరావు మునుపటిలా చకచక తిరగలేక పోతున్నాడు చేతి కర్ర ఊతతో మెల్లగ ఇంట్లో తిరగగలడు తన పనులను తాను చేసుకోగలడు అంతగ పోవాలనుకుంటే వీధిలోకి పది అడుగులు చేయ్యగలడు అంతే! డాక్టరు వచ్చి పరీక్ష చేసి ఏవో బలానికి మందులు వ్రాసిచ్చేడు అసలు డాక్టరు అతడికి పక్షవాతం వస్తుందేమోనని భయపడ్డాడు ఇలా కాలు, చేతులు కదప గలుస్తున్నాడంటే కుటుంబరావు చాల అదృష్టవంతుడని చెప్పేడు - గాని ఎక్కువగ శ్రమించకూడదన్నాడు రక్తపుపోటు తగ్గేవరకు మందులు తినాలని చెప్పేడు ఉప్పు, కారం బాగా తగ్గించేయాలని చెప్పేడు

సుమతిని యెవరు ఏమి అనడం లేదు ఆమె మామూలుగ ఇంట్లో తిరుగుతూంది మునుపటిలా బయటకు పోవడం పూర్తిగా మానుకుంది జయలక్ష్మి ఆఫీసుకు, కృష్ణుడు కాలేజీకి ఆ మరునాడు యదా వేళకి పోయేరు

కుటుంబరావు నాల్గు రోజులు పోయేక జయలక్ష్మిని ఆఫీసుకు పోక శలవు పెట్టి ఇంట్లోనే ఉండ మన్నాడు తెలుగు కేలండరు చూసి ఆ రోజు వచ్చింది ఆనాడు పంచమి జయలక్ష్మిని కృష్ణుడ్ని తీసుకుని కుటుంబరావు ప్రొద్దున్న పది గంటలకు శకుంతల ఇంటికి వెళ్ళేడు వాళ్ళను చూసి ఆమె ఆశ్చర్య పోయింది మనస్సులో కోపంగా ఉన్నా మర్యాదగా కూర్చోమని చెప్పింది జగ్గారావు ఎక్కడకో వెళ్ళబోయినవాడు వాళ్ళను చూసి కుతూహలంగా ఆగిపోయేడు

శకుంతలా! నన్ను క్షమించాలమ్మా అని దీనంగా అనేసరికి శకుంతల, ఆమె కొడుకు ఆశ్చర్యంతో ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు కుటుంబరావు బలహీనంగ, చేతి కర్రతో తాపిగ రావడం చూసేరు

"శకుంతలత్తా! మీరు ఆనాడు వెళ్ళిపోయిన తరువాత నాన్నగారు రక్తపు పోటు వచ్చి పడిపోయేరు డాక్టరు వేళకు వచ్చి కాపాడేడు దైవకృపవల్ల నాన్నగారు మెల్లగ కోలుకున్నారు – గాని మునుపటి మనిషి కాలేక పోయేరు ఇంకా మందులు పుచ్చుకుంటున్నారు తన తప్పు తెల్సుకొని మీ దగ్గరకు వచ్చేరు "

"అవునమ్మా అమ్మాయి సుమతి నిజం చెప్పేసింది అబ్బాయి జగ్గారావు! నువ్వు ముఖ్యంగ నన్ను క్షమించవలెనయ్యా నీ మంచితనం తెల్సుకోలేక నిన్ను నానా మాట లన్నాను నన్ను క్షమించు

పెద్దవాళ్ళు మీరలా అనకండి మామయ్యా నేనేమి బాధపడను లెండి

"అన్నయ్యా! ఏమిటా నిజం?

జరిగింది నిజాయితీగా కుటుంబరావు చెప్పదల్చేడు, గాని జగ్గారావు తల్లి వెనుకగ నించుని చెప్పొద్దని సంజ్ఞలు చేసేడు జగ్గారావుకి తెల్సు సుమతి ఆ దర్జీ కుర్రాడు చొక్కారావుతో లేచిపోతుంటే తను తెచ్చేనని తల్లికి తెలుస్తే తల్లి సుమతిని క్షమించి తన కోడలుగ చేసుకోదని జగ్గారావులో ఉన్న విశాలభావం అతడి తల్లిలో లేదని తెల్సుకుని కుటుంబరావు జంకి పోయేడు పరిస్థితిని తెలివిగ గ్రహించి జయలక్ష్మి అందుకుంది –

"సుమతి దేముడిమీద ప్రమాణంచేసి నిజం చెప్పింది తను ఒక్కర్తే విశాఖపట్నం సినిమా చూడడానికని వెళ్ళిందట అక్కడ తలవని తలంపుగ జగ్గారావు కనుపించేడుట అలా ఇద్దరు బీచికి పోయి, తరువాత సినిమా చూసుకుని వచ్చేరుట జగ్గారావుది ఏమీ తప్పు లేదని తను అతడ్ని ప్రేమిస్తు-న్నట్టు, అందుకే అతడు విశాఖలో ఎదురుపడగానే సరదాగా అతడితో తిరిగేనని తనే ఎక్కువ బాధ్యురాలని, మరే తప్పు ఇద్దరు చేయలేదని చెప్పింది ఆ మరునాడే వచ్చి నాన్నగారు మీకు క్షమాపణ చెప్పుకుందామనుకున్నారు కాని ఈ రక్తపు పోటువల్ల రాలేక పోయేరు

శకుంతలమ్మా! నేనేదో ఆనాలోచితంగా ఏమేమో తప్పుడు మాటలు ఆడేను మీ రిద్దరు నన్ను మన్నించాలి "

శకుంతలమ్మ మనస్సు కరిగింది

సరేలే అన్నయ్యా – నువ్వేమీ మరి మనస్సులో ఉంచుకోకు జరిగిం-దేమో జరిగింది ఇప్పుడేమి చేయదల్చేవు చెప్పు

'నువ్వు దయ తలుస్తే నా కూతుర్ని నీ కోడలుగ చేసి నీ చేతిలో ఉంచుదామనుకుంటున్నాను

'ఏమిరా జగ్గా– నీకు సుమతిని పెండ్లి చేసుకుంది కిష్టమేనా చెప్పు అలా అయితే మీ మామయ్యను ముహూర్తం పెట్టించమంటాను

నీ ఇష్టమే నా ఇష్టమమ్మా

'మా బాబే – అన్నయ్యా! వాడికి ఉద్యోగం లేదని చింతించకు వాడో ఇంటివాడై బాధ్యత నెత్తిమీద పడితే వాడే ఉద్యోగం సంపాయించు-కుంటాడు వాడు గాని నేను గాని నీ కూతురికి ఏమీ లోటు రానీయము

మరి ముహూర్తం పెట్టించమన్నావా శకుంతలమ్మ?

అలాగే చెయ్యి అన్నయ్యా

మరి కట్నకానుకల సంగతి మాట్లాడుకుంటే బాగుంటుంది

అత్తయ్యా! మా పరిస్థితి నీకు తెల్సుగా – అందుకే నువ్వు మా స్థితిని గమనించి కట్నం యెక్కువగ కోరకు

చూడమ్మా జయా! అసలు నేను కట్న కానుకలను తీసుకోదల్చలేదు వాడు నాకు ఒక్కడే కొడుకు మా వారు మాకు కావల్సినంత గడించిపోయేరు మరి నాకు దురాశలేదమ్మా వాడికి, మా అమ్మాయికి మంచి సంబంధాలు చేయడమే నా ధ్యేయం అన్నయ్యా! వాటి గురించి చింతించక మీ గౌరవానికి మా గౌరవానికి లోటు లేకుండ వివాహం జరిపిస్తే చాలు – ఏమంటావు?

ఏమంటానమ్మా సంతోషంతో ఉక్కిరి బిక్కిరౌతుంటేను నీ విశాల దృక్పదంకు చిన్నదానివైన చేతులెత్తి నమస్కరిస్తున్నాను

అంతమాటెందు కన్నయ్యా! నీకు అల్లుడెంతవుసరమో నాకూ కోడలంత అవుసరమె అందుచేత డబ్బు ఇచ్చి పుచ్చుకోడాల్ప ప్రసక్తే అనవసరం నువ్వెలా సంతోషిస్తున్నావో నేనూ అలాగే సంతోషిస్తున్నాను

"వెళ్ళొస్తానమ్మా

కుటుంబరావు ఇంటికి చేరగానే ఇంట్లో అందరికి ఈ విషయం తెలియజేసేడు సుమతి సమస్య ఈ విదంగ పరిష్కారమైనందుకు అందరు సంతసించేరు కాని కమలమ్మ మనస్సులో ఏదో వెల్తి బాదిస్తూంది ఏవో సామాన్లు కొనడానికి జయలక్ష్మి విశాఖపట్నం వెళ్ళింది ఎలాగు ఆ రోజు శలవు తీసుకుంది కనుక విశాఖలో ఈ శుభవార్తను రామారావుకు తెలియ-జేద్దామని ఆతృత చెందింది

జయలక్ష్మి విశాఖ వెళ్ళగానే ఆ మద్యాహ్నం కమలమ్మ తండ్రితో తన మనస్సులోని దిగులుని తెలియజేసింది

నాన్నా! మరి పెద్దది జయలక్ష్మి దానికి పెండ్లి చేయకుండ చిన్నది సుమతికి హఠాత్తుగ పెండ్లి చేస్తే లోకులు ఏమనుకుంటారు?

మరి దానికి సంబంధం కుదిరితే దాని పెండ్లి చేద్దాం – మరి కుదరాలిగ



## కాగితపు పడవలు

అలాగన్నావు బాగుంది జయతో పనిచేస్తున్న రామారావు గురించి నీ ఉద్దేశమేమిటి?

"మంచివాడులానే ఉన్నాడు ఏం – అతను జయను పెండ్లి చేసుకుంటానంటున్నాడా?

"జయ అంటే అతడి కెంతో ఇష్టం జయకు మంచి స్నేహితుడు నీ కిష్టమైతే నేను అతడిని అడుగుతా ఇద్దరి పెండ్లి ఒక్కసారి చేసేస్తే మనకి భారం పోతుందిగ నిశ్చింతగ ఉండొచ్చు

కుటుంబరావు ఆలోచనలో పడ్డాడు

"కమలా' నువ్వు చెప్పింది బాగుగానే ఉందిగాని మనం అన్ని విషయాలు ఆలోచించుకోవాలి – తొందర పడకూడదు సుమతి చేసిన పాడు పనికి మన అదృష్ట వశాత్తు జగ్గారావు దానిమీదున్న మోజు కొద్ది పెండ్లికి ఒప్పుకున్నాడు మనం తొందరగ దాని పెండ్లి చేయకపోతే వాడు మనస్సు మార్చుకోవచ్చు అందుచేత దాని పెండ్లి ఎంత వేగిరం జరిపిస్తే మనకి అంతమేలు ఇక జయ సంగతంటావా సుమతి పెండ్లి అయేసరికి మనకి బాంకులో ఉన్నదంత ఊడ్చుకుపోతుంది వాళ్లు కట్న కానుకలు పుచ్చుకోకపోయిన. పెండ్లికి ఏమిలేదన్న ఓ నాలుగు వేలన్న కావల్సి ఉంటుంది జయకు పెండ్లి-చేసి దాన్ని అత్త వారింటికి పంపించేస్తే దాని జీతం మనకు అందదు కృష్ణుడికి చదువు పూర్తి కాలేదు వాడు చదువు పూర్తిచేసి ఉద్యోగంలో చేరితేనేగాని మనకు ఇల్లు గడవదు నాకు వేరే సంపాదనలేదు అందుకే కృష్ణుడికి ఉద్యోగమయ్యేవరకు నేను జయలక్ష్మి పెండ్లి చేయలేను ఒక సంవత్సరం మనం జయ పెండ్లి సంగతి ఆలోచించరాదు

కమలకు ఏం జవాబు చెప్పాలో తెలియదు తండ్రి చెప్పింది సబబుగానే తోచిందిగాని ఎదిగిన పిల్లకు పెండ్లి చేయకుండ దాని ఆర్జన పైన ఆధారపడడం బేసబబుగా తోస్తుంది ఆ తికమకలో ఏమి అనలేక లోనికి పోయింది కుటుంబరావు నిస్సహాయుడై అలా కూర్చుండిపోయేడు దిగులుతో అతడికి జయలక్ష్మి అంటే యెంతో అనురాగం

జయలక్ష్మి విశాఖ చేరగానే సరాసరి రామారావు పని చేస్తున్న టెలిఫోన్సు ఆఫీసుకుపోయి రామారావుని కల్సింది ఇద్దరు ఆఫీసులోని బయట ఆవరణకు వచ్చి మాట్లాడుకున్నారు జయలక్ష్మి జరిగిందంతా చెప్పింది

"మీ నాన్నగారి ఆరోగ్యం బాగున్నందుకు సంతోషంగానే ఉంది జగ్గారావు జులాయిగా తిరిగిన. మనిషి మంచివాడిలా నాకు తోచేడు పెండ్లి అయితే అతడే ఉద్యోగ ప్రయత్నం చేస్తాడు అన్నిటికన్న సంతోషించవల్సిన విషయం మరొకటుంది అదే మన పెండ్లికి లైన్ క్లియర్ అయింది జయా మీ చెల్లెలు పెండ్లితో మన పెండ్లి జరిపించేయమను మీ నాన్నగార్ని

జయలక్ష్మి ఆనందంతో పొంగిపోయింది

"మరి కట్న కానుకుల సంగతి చెప్పేవుకాదు

అవన్ని పెండ్లి తరువాత నీ దగ్గర్నుండి తీసుకుంటాలేవోయి

జయలక్ష్మి బుగ్గలు సిగ్గుతో, ఉల్లాసంతో ఎరుపెక్కాయి

"అబ్బాయికి మాటలొచ్చాయే – సినీమాల ప్రభావం!

"కాదు జయా – అంతా జయలక్ష్మి ప్రబావం. లేకపోతే నాకు పెండ్లి తలంపా?"

"నేనేం గడుసుదాన్నికాను మీరే నన్ను వలలో వేసుకున్నారు

### 15

సుమతి పెండ్లి ఏ గొడవలు లేకుండ గౌరవంగ జరిగిపోయింది పెద్ద ఆర్భాటం లేకుండ దగ్గర బంధువుల్ని మాత్రం పిలచేరు పెండ్లి రెండు రోజులు రామారావు కుటుంబ సభ్యులంతా కొత్త వలసలోనే ఉన్నారు అందరకు తెల్సు రామారావు జయలక్ష్మి త్వరలోనే వివాహం చేసుకుంటారని

ఆ రెండు కుటుంబాలు ఆ బంధుత్వాన్ని ఏ నాడో ఒప్పుకున్నాయి అందుకే స్వేచ్ఛగ, జయలక్ష్మి కంటకాపల్లి వెళ్ళి వస్తుండేది మునుపటిలా రామారావు తల్లి దండ్రులను 'ఏమండి' అంటే వాళ్ళు అభ్యంతరం చెప్పేరు అందుకే 'అత్తయ్యా' అని 'మామయ్యా' అని పిలుస్తుండేది వాళ్ళ కోరికపైన అలాగే రామారావు కుటుంబరావుని పిలవడం అలవాటు చేసుకున్నాడు

పెండ్లికి వచ్చిన బంధువులు సాధారణంగా వేసే ప్రశ్నే వేసేరు

అదుగో మా పెద్ద అల్లుడు రామారావు మా జయలాగానే గవర్నమెంటు ఆఫీసులో పని చేస్తున్నాడు వాళ్ళిద్దరు ఏవో గవర్నమెంటు పరీక్షలకు కడుతున్నారు ఆ పరీక్షలై పోగానే వాళ్ళకు పెండ్లి జరిపిస్తాం అంతా సెటిల్ అయిపోయిన వ్యవహారమే అందుకే కుదిరింది గదా అని మగ పెండ్లివారు తొందర చేయడంవల్ల మా సుమతి పెండ్లి ముందుగా జరిపిస్తున్నాం, అని కుటుంబరావు చెప్పుకోపోతుండేవాడు

సుమతి పెండ్లి నిరాడంబరంగ జరిపించి నప్పటికి పెండ్లికి బాంకులో ఉన్న డబ్బంత కుటుంబరావు ఖర్చు చేయవల్సి వచ్చింది మగ పెండ్లి వారికి బట్టలు కొనడానికి పిల్లకు తులంన్నర పెట్టి బంగారం గొలుసు చేయించడానికి, వచ్చిన బంధువులకు కాపీ పలహారాలకు, బసకు, బోజనాలకే అయిదువేల రూపాయలయి పోయేయి

పెండ్లి జరిగిపోయిన పదిరోజులనంతరం రామారావు ఓ ఆదివారం కొత్తవలస వచ్చి కుటుంబరావుతో జయలక్ష్మి పెండ్లి ప్రస్తావన తెచ్చేడు కుటుంబరావు జవాబు చెప్పలేదు జయలక్ష్మి ద్వారంవద్దనే నిల్చునుంది

మామయ్యా! మీరు మౌనంగ ఊరుకుంటే మీ మనస్సులోని ఉద్దేశం మాకెలా తెలుస్తుంది మీకు ఈ పెండ్లి ఇష్టంలేదా?

"అదెంతమాట బాబూ! నాకు నువ్వు అల్లుడిగ రావడం కన్న సంతోషించదగ్గ విషయం లేదంటే నమ్ము – గాని ఇప్పట్లో నేను జయ పెండ్లి చేసే స్థితిలోలేను నా చేతిలో ఎర్రని పైసాకూడ లేదు ఉన్నదంత ఊడ్చి సుమతి పెండ్లి చేసేను కొంచెం ఆర్థికంగా సర్దుకున్నాక తప్పక జయలక్ష్మి పెండ్లి చేస్తాను

రామారావుకి నోటికొసవరకు వచ్చింది – తనూ జయలక్ష్మి ఆఖర్చునంతా భరించి పెండ్లి చేసుకుంటామని చెప్దామని కాని ఆ ముసలాయన ఆత్మాభిమానం యెక్కడ దెబ్బతిని కాదుపో అంటాడో అని జంకి ఊరుకున్నాడు

రామారావు గాలి తీసిన బుంగలా తయిపోవడం చూచి జయలక్ష్మి అతడిని గదిలోకి తీసుకుని వెళ్ళి చెప్పింది – "మీరేమి దిగులు పడకండి నేను, మా అక్క అతనికి నచ్చచెప్పి వప్పిస్తాం మీరు మీ వాళ్ళను అడిగి చూసేరా?

నేను అడగవల్సిన అవసరం లేదు వాళ్ళకు అబ్యంతర మేమిలేదు మా తల్లి తండ్రులకు కట్న కానుకల మీద ఆశలేదు వాళ్ళ పిల్లలకు ఇచ్చుకోలేక

## ఓ కవీ!

కాలం చెల్లిన
భావాలుతో
నువ్వు
కవిత లల్లితే –
సమాజానికి
నువ్వు చేసేది
మేలు కాదు
కీడు!

–యాసలపు సూర్యారావు

అడిగిన వాళ్ళనే తిట్టిపోస్తున్నప్పుడు ఆ నోటితోనే మగపెండ్లివారుగా ఇతరులను ఎలా బాధ పెట్టగలరు మరి నువ్వు వాళ్ళకు ఎంతో నచ్చి నువ్వు వాళ్ళ కోడలువని ఆ గ్రామంలో అందరికి చెప్పేసేరు అందుకే మా వాళ్ళను గురించి నాకేమి జంకులేదు

ఎందుకేనా మంచిది మీరు ఓసారి మీ వాళ్ళను అడగండి

అవును నువ్వు మళ్ళీ నన్ను అండి, మీరు అంటున్నావు? ఏమిటి సంగతి?

అబ్బే మరేం లేదు నువ్వు పెండ్లి కొడుకువి కాబోతున్నావు కదా బర్తను గౌరవించాలని

అదేమిటో గాని నువ్వలా పిలవగానే నేను పరాయి వాడిగ నీకు దూరమై పోతున్నట్లు భావన కల్గుతుంది నాకు

లేదు రామారావు – నువ్వే నా ప్రాణం మీకు దూరమై నేను జీవించగలనా? జయలక్ష్మి కండ్లలోని ఆ ఆరాదనను చూసి రామారావు తృప్తి చెందేడు

రామారావు వెళ్ళిపోయిం తర్వాత జయలక్ష్మి తన అక్క దగ్గరకు వెళ్ళి జరిగింది చెప్పింది

అక్కా! అతను నన్ను చేసుకుంటానని అనురాగంతో ముందుకు వస్తే నాన్నగారు ఇలా అభ్యంతరం చెప్పి పంపించేసేరు అక్కా ముందు ఏం జరుగుతుందో మనకు తెలియదు కదా! రామారావు నాన్నగారు మరేదో మంచి సంబంధం వచ్చి అతడిమీద వత్తిడి తెస్తే ఏమౌతుందో మనకు తెలియదు కదా రామారావు నన్ను ప్రాణ సమానంగా చూసుకుంటున్నప్పటికి పరిస్థితుల ప్రభావం మనుష్యులమీద ఒకొక్కప్పుడు మనం






# కాగితపు పడవలు

వూహించుకోని విదంగా పడుతుంది అదే నా బయం నువ్వోసారి నాన్నగార్కి చెప్పి చూడు ఇది నా విషయం గనుక నేను ఆరిందలా నాన్నగారితో ఎలా వాదించగలను చెప్పు

నువ్వు బెంగపెట్టుకోకు నేను సర్ది చెప్తాగా

ఇద్దరు తండ్రి దగ్గరకు వచ్చేరు కమలమ్మ జయలక్ష్మి బయాన్ని వ్యక్తపరచింది

అందుకే నాన్న, అతడు పైసా కూడ కట్న కానుకలకు కోరకుండ మన జయను పెండ్లి చేసుకుంటానని వచ్చినప్పుడు నువ్వు కాదనడం బాగు లేదు డబ్బు లేదంటున్నావు జయలక్ష్మి తన ప్రావిడెంటు ఫండులోంచి రెండు వేల వరకు తీసుకో గలనంటుంది నా నగలు తనఖా పెట్టి మరో రెండు వేలు తెద్దాం ఆ డబ్బుతో పెండ్లి జరిపిద్దాం – ఏమంటావు నాన్నా?

కుటుంబరావు జాలిగా ఇద్దరి కూతుర్లను చూచేడు

నేను చాల నిర్భాగ్యుణ్ణి తల్లీ! అందుకే కూతురు ఆర్జనమీద కటుంబాన్ని నెట్టకుని వస్తున్నాను నాకు ఆస్థి లేదు ఒక స్థితి లేదు పైగా ఈ అనారోగ్యం ఒకటి జయా! నన్ను తప్పుగ అర్థం చేసుకోకు మన కృష్ణుడికి ఉద్యోగం కాగానే నీకు రామారావుకి వివాహం జరిపించి నిన్ను అత్త వారింటికి పంపిస్తాను

జయ మౌనంగా ఊరుకుంది కమలమ్మే జవాబు చెప్పింది

అది కాదు నాన్న! రామారావు ఏమన్నాడంటే 'మీ కా బయం అక్కర-లేదు జయలక్ష్మి జీతం జయలక్ష్మిదే అందులోని ఓ పైసా కూడ నాకక్కరలేదు ఇలా కలసి తిరుగుతే నలుగురు నాలుగు విదాల అనుకుంటారు – కనుక ఇద్దరం పెండ్లి చేసుకుని బార్యా భర్తలమనిపించుకుని సంఘంలో గౌరవంగ, నిర్భయంగ మెసల గలుగుతాం మరి కొన్నాళ్ళు జయ యామూలుగా ఈ ఇంట్లోని తను తన ఇంట్లో ఉండొచ్చుని ఏ కుటుంబానికి ఈ వివాహంవల్ల ఎటువంటి ఇబ్బంది ఉండదని అన్నాడు అందుకే ఈ పెండ్లి చేద్దాం

కుటుంబరావు కాస్సేపు ఆలోచించి అన్నాడు

చూడమ్మ పెండ్లి ముందర చేసిన వాగ్దానాలు పెండ్లి అనంతరం నిలబెట్టుకోడం చాల కష్టం ఎందుకంటే పెండ్లి అయిం తర్వాత మన అమ్మాయి మనస్థత్వమే మారిపోతుంది అప్పుడు ఈ ఇల్లు, ఈ కుటుంబం సభ్యులు మరి తనవిగా గోచరించవు అది చాల సాధారణమైన విషయమే పైగా రామారావు ఈ ఏర్పాటుకి ఒప్పుకున్నా రామారావు తల్లి దండ్రులకు అబ్యంతరం ఉంటుంది ఇంతకు పెండ్లయిన పిల్ల వద్ద నుండి నెల నెలా జీతాన్ని ఏ అధికారంపై నేను మాత్రం కోరగలను చెప్పు? నామీద కోపగించుకోకండ మీ ఇద్దరు సావధానంగ ఆలోచించుకోండి టైమయింది నా మాత్రలు అందుకో కమలా – వేసుకుంటాను

ఆ మరునాడు జయలక్ష్మి ఈ విషయమై చర్చించడానికి రామారావు కోసం ఎదురు చూచింది – గాని రామారావు ట్రెయినులో రాలేదు ఆపీసుకు రాలేదు ఆ మరునాడు ఆపీసుకు వచ్చేడు ఇద్దరు మాట్లాడుకునేందుకు సాయంత్రం బీచికి పోయేరు

నిన్నను ఆఫీసుకు రాలేదేమి?

నా ఒంట్లో బాగు లేదు విపరీతమైన తలపోటు వచ్చింది

ఇప్పుడెలాగుంది?

నిన్న రాత్రి నిద్దట్లో సర్దుకుంది

రామారావు ఉత్సాహంగ లేకపోవడం చూసి జయలక్ష్మి కాస్త ఆశ్చర్య పోయింది

**(ఇంకా ఉంది)**

## ఆర్. – జల్లేడుపల్లి

ఆంధ్ర భాషలో స్త్రీ కేర్పడినన్ని పర్యాయ పదాలు పురుషునికి ఏర్పడలే దెందుకంటారు కె రా గారు!

★ ప్రత్యేకం పురుషుడు కావ్య వస్తువు కాడు! స్త్రీ కాగలదు! అంచేత

## సి. హెచ్. జి ఆర్. – టిట్లాఘర్

మీ ప్రశ్నావళితో మిమ్మల్ని బేరీజు వేసుకొని మీ మనస్తత్వం తెలుసుకోవడం కష్టతరం

★ ఆదే కద – రచయిత నేర్పు రాసిన ప్రతి మాటతో నూ – స్వీయ చరిత్ర తెలిస్తే ఎలా?

మీ అమ్మాయిపెళ్ళప్పుడు కట్నం గురించి కథ వ్రాసి ప్రచురించారు ఏదో పత్రికలో దాని పేరు, పత్రిక పేరు ఏ సంవత్సరంలో ప్రచురించారో – తెలుపుతారా?

★ నే నిప్పటిదాకా 'కట్నం' కద రాయలేదు – మీ సమాచారం తప్పు

## జి. వి. కె. ఆర్. – హైదరాబాదు

ఏ వయసులో ఆ ముచ్చట అంటారెందుకు కె రా గారూ

★ లేకపోతే – యౌవన కాలం అంతా ముసలి తనానికి ప్రిపరేషన్‌తోను, తీరా ముసలితనం వచ్చాక – యౌవనం తిరిగి రాబట్టుకోవాలన్న తాపత్రయంలో గడిపేస్తారు – మనుషులు! అందుకని అలా అంటారు

కోరికలే లేకపోతే?

★ మనిషి సాధించిన వాటిలో కంటే – కోరికలలో నే – ఎక్కువ బ్రతుకుతాడు

మనిషి తత్వం తెలిపేది?

★ వృత్తి కాదు ప్రవృత్తి

## బి. వి. పి. – విశాఖపట్నం

సెన్సారు మెంబరు కావడానికి అర్హత లేమిటి?

★ నేనే అయ్యానంటే – అర్హతలు అక్కర్లేదనేగా అర్థం!!

## కె. ఎన్. ఆర్. – వినుకొండ

సోదరీ, స్త్రీలు చంచల మనస్కులా?

★ కాదు సోదరా కామెర్ల వాడి కళ్ళకి లాగ – అలా అనిపిస్తుందేమో మరి!

## బి. ఎస్. – డోర్నకల్

ఈ ప్రపంచంలో అన్నిటికంటే అతి భయంకరమైనది ఏది?

★ నమ్మకద్రోహం

## కె. జె. ఆర్. – చిన్నరావూరు

ప్రజలు భావించె దేవునికి, వేదాలు తెలియపరిచే దేవునికి సంబంధమే లేదు యిది అన్యాయం కాదా?

★ పెదవి దాటిన మాటలే పలు విధాలుగా రూపాంతరం చెందుతాయే – యిక దేవుడు గురు తెలియకుండా మారిపోవడంలో ఆశ్చర్యం దేనికి




## ఎం. సి. హెచ్. – ఎమ్మిగనూరు

పెరిగి పోతున్న ధరలను ఎలా అదుపు చేయవచ్చు నంటారు?

★ ఒకసారి పెరిగిన ధరలు – తగ్గడం చాలా అరుదు! ఎంత ధరైనా పెట్టి కొనడానికి కొందరైనా సిద్ధంగా వున్నప్పుడు – అవి తగ్గించే ప్రయత్నాలు ఎందుకు చేస్తారు?!

మానసికంగా ఎదగడం అంటే ఏమిటి?

★ వయసుకు తగిన బుద్ధితో ఆలోచించి ప్రవర్తించ కల్గడం

## సి. హెచ్. వి. ఆర్. – కాగజ్‌నగర్

ఇప్పటి కాలంలో చాలామంది బ్రతుకంటే అసహ్యించుకుంటున్నారు కారణం?

★ బ్రతుకు ఒక పోరాటంగా మారడంతో విసిగి పోతున్నారు కొందరు బ్రతుకు భారంగా వున్నా బ్రతకవచ్చు గాని నిరాశ అయి వుంటే అసహ్యంగానే వుంటుంది

## ఎం. డి. – ఆళ్ళగడ్డ

రామలక్ష్మి అక్కయ్యగారూ ప్రశ్నావళిలో నా పేరు చూసుకోవాలని వుంటే – ఏదైనా అర్హత సంపాదించాలా?

★ అక్కర్లేదు చిట్టి తల్లీ – ఇదిగో నీ పేరు దుర్గవతి! సరేనా?!

## కె. ఎస్. ఆర్. – రామచంద్రాపురం

మీరు ఎల్ల వేళల కోరుకునేది ఏమిటి?

★ ప్రత్యేకించి ఏం లేదు – కూర్చున్న చోట నుంచి కదలమనకుండా వుంటే చాలు – అనుకుంటాను!

## ఎస్. ఎస్. – బొబ్బిలి

నాకు కట్నం తీసుకోవాలని లేదు కాని నాకు ఇద్దరు చెల్లెళ్ళు వాళ్ళకి నాలాంటి కట్నం తీసుకోని వాళ్ళు దొరుకుతారని నమ్మకం ఏమిటి? తనకు మాలిన ధర్మం పనికిరాదని కదా?

★ మీ చెల్లెళ్ళని ఎందుకు తక్కువగా అంచనా వేస్తున్నారు? వాళ్ళు కట్నం పుచ్చుకొనే వాడిని పెళ్ళాడమనరని ఏమిటి నమ్మకం? అంచేత ఏదో వంక కోసం వెతకడం పొరపాటు

## బి. వి. ఆర్. – కాకినాడ

క్రాంతికి శాంతికి తేడా ఏమిటి ?

★ క్రాంతి దర్శనం హింస ద్వారానూ, శాంతి అహింస ద్వారానూ ఏర్పడతాయి

## బి. వి. బి. – సిద్ధాంతం

ఈమధ్య ఎం జి ఆర్ తరపున రాజకీయ రంగ ప్రవేశం చేసిన జయలలిత గారిపై మీ అభిప్రాయం?

★ హుందాగా, గంభీరంగా, నాజూకుగా, ఎంతో మంచి మనసున్న యువతి జయలలిత రాజకీయాలలోకి దిగడానికి ముందు – పార్టీనంతా క్షుణ్ణంగా కాచి వడబోసింది – మన జమున గారిలా కాదు – తాటాకు మంటలా ఎగరడానికీ, ఆరడానికీ చక్కని వక్త విషయ పరిజ్ఞానం కల వ్యక్తి ముఖ్యంగా జనాన్ని ఆకర్షించేది ఆమె మూర్తి అనుకుంటారు గాని ఆమె పోకడ అలా అందరినీ ఆకట్టుకొంటుంది







# సుబ్బారావు! బుబ్బారావు!!

కొలుపూరి త్రిమూర్తిసత్యనారాయణ

"నిజం వెంకూ! మీ అత్త' మీద ఒట్టు! నన్ను నమ్ము!

నాకింకేం చెప్పొద్దు – మీ అసలు స్వరూపం ఇప్పుడు తెలిసింది! ఇంకొక క్షణం కూడా ఇక్కడ వుండను!

"అది కాదు

ఏం చెప్పొద్దు – నేను వెళ్తున్నా!

ఇప్పుడు మీ ఊరికి బస్ లేదు!

బస్ లేకపోతే – విమానం మీద వెళ్తాను!

నువ్వు వెళ్లిపోతే నేను బ్రతకలేను వెంకూ?

ఏం నాటకంలో దీ డైలాగ్?

ఖర్మరా భగవంతుడా? నేను నాటకాల్లో వేషాలు వేసినంత మాత్రాన – ఏం మాట్లాడినా నీకు నాటకాల్లో డైలాగుల్లా వుంటున్నాయా? అసలు నా బాధను అర్థం చేసుకోవేమిటి? నా మాట విను – అంతగా వెళ్లాలనుకుంటే రేపు వెళ్ళువుగాని రేపు సాయంత్రం అయిదు గంటలగ్గాని మీ ఊరు వెళ్లే బస్‌లేదు

ఇక చేసేది లేక బట్టలు సర్దుకున్న సూట్‌కేస్‌ను విసురుగా క్రిందపడేసి – గబగబా లోపలకు వెళ్లి మంచంమీద బోర్లా పడుకొని ఏడుస్తోంది సత్యవతి

కుర్చీలో కూర్చొని జుట్టు పీక్కోబోయాను – బాదనిపించి మానేశాను

ఆఫీసునుంచి మల్లెపూలతో ఎంతో హుషారుగా వచ్చి, గుమ్మంలో అడుగు పెట్టబోతున్న నన్ను – అప్పుచేసి, ఎగ్గొట్టేసి తప్పించుకు తిరుగుతున్న అప్పుల్రావుని కాలర్ పట్టుకొని నిలేసినట్టు మా శ్రీమతి –

శకుంతల ఎవరు? అని అడిగింది

దుష్యంతుడి భార్య!' అన్నాను నవ్వుతూ

ఆ దుష్యంత మహారాజు తమరేనా?

నే నే నేనా? నేనేమిటి వెంకట సత్యవతి ఎందుకలా గుచ్చి గుచ్చి అడుగుతుందో అర్థం కాలేదు నాకు

శకుంతలా, మీరు ప్రేమించుకున్నారట పెళ్లి కూడా చేసుకుంటా నన్నారట చాన్నాళ్లనుంచి ఉత్తరాలు రాసుకుంటున్నారట మీరు ఆఫీసుకి వెళ్లగానే వచ్చింది! స్వగ్రామంనుంచి ఏదో పనిమీద ఈ ఊరు వచ్చి, మిమ్మల్ని చూద్దామని వచ్చిందట ఎన్నాళ్లనుంచీ రాకపోకలు? చెప్పు మావయ్యా? నన్నెందుకిలా మోసం చేశావ్? ఆ వగలాడినే కట్టుకోక పోయావా? ."

"నామాట నమ్ము! ఆ శకుంతల ఎవరో నిజంగా నాకు తెలియదు!"

ఎంత బాగా నటిస్తున్నావ్ మావయ్యా? పరిషత్ నాటకాల్లో నటిస్తే నీకు తప్పకుండా బెస్ట్ యాక్టర్ ఖాయం!

ఈ ఆడవాళ్ళకి అనుమానం రాకూడదు వచ్చిందా - మనశ్శాంతి లేకుండా చేస్తారు!

★ ★ ★

ఉద్యోగం పురుష లక్షణం! ఆ లక్షణం నాలో కనిపించాక మా అక్క కూతురు వెంకట సత్యవతితో నా పెళ్ళి జరిపించారు

పెళ్ళయి వారం రోజులయిందో లేదో – మూడం ఆ పైన ఆషాడం అని – వెంకట సత్యవతిని పుట్టింటికి నన్ను ఆఎసుక పొమ్మన్నారు అంతే గాకుండా ఆషాడం వెళ్ళేవరకూ ఒకరి ముఖాలు ఒకరు చూడకూడదని ఆర్డినెన్స్ జారీ చేశారు పెద్దవాళ్ళు

పట్టుమని ఏడు రాత్రులు గడిపామో లేదో – ఇంతలో ఎంత ఎడబాటు?!

ఆషాడం ముందు పెళ్ళెందుకు చేశారు? ఆ తరువాతే చేయకపోయారా? అని పెద్దవాళ్ళ మీద విరుచుకు పడ్డాను

ప్రక్కకు తిరిగి ముసిముసిగా నవ్వుకున్నారు నా బాధ వాళ్ళకేం తెలుసు? ఈ పెద్ద వాళ్ళందర్నీ ఎండలో వరుసగా నిలబెట్టి యినుపకడ్డీ ఎర్రగా కాల్చి వాతలు పెట్టాలన్నంత కసిగా వుంది నాకు!

ఒకరాత్రి, ఒక పగలు కాదు – ఒక రోజు రెండురోజులు కాదు – రెండునెలలు! భగవాన్! ఎంత ఘోరమైన శిక్ష విధించావ్?

విరహ వేదనతో బారెడు గెడ్డం పెంచేసి, బీరుబాటిల్ పట్టుకొని విరహగీతాలు పాడుకుంటూ వీధుల్లో పడదామనుకున్నాను కాని మా మేనేజరు సెలవివ్వనన్నాడు!

ఆ రెండు నెలలు ఇరవై ఏళ్ళుగా గడిచాయి నాకు

ఓ శుభ ముహూర్తాన మా నాన్నొచ్చి – ఆషాడం వెళ్ళిపోయింది – వచ్చే బుధవారం మంచిది – వెళ్ళి అమ్మాయిని తీసుకొచ్చి కాపురం పెట్టు! ఈ కటకటాల గది కాకుండా ఇంకో మంచి యిల్లు అద్దెకు తీసుకో! అన్నాడు

టి కని బ్లాకులో కొన్న కేజీ పంచదారలో ఓ గుప్పెడు తీసుకొచ్చి మా నాన్న నోట్లో పోశాను

వెలమపేటలో ఓ ఇల్లు అద్దెకు తీసుకొని వెంకట సత్యవతిని తీసుకొచ్చి, కొత్త కాపురం పెట్టి మూడు రోజులయిందో లేదో, అప్పుడే కలతలు

ఆ రాత్రి ఉపవాసం మల్లె పూలు నన్ను చూసి ఎగతాళిగా నవ్వుతున్నట్లనిపించింది!

★ ★ ★

ఆ మర్నాడు ఆఫీసుకి శలవు పెట్టి, ఇంటి దగ్గరే వున్నాను – కోపంలో వెంకట సత్యవతి ఏ అఘాయిత్యానికి పాల్పడుతుందోనని భయం వేసి!

ఉదయం పదకొండు గంటలయింది

వెంకట సత్యవతి ఇంకా అలకపాన్పు దిగలేదు – ప్రభుత్వ సహాయం అందని వరద బాధితుడిలా దిగులుగా కుర్చీలో కూర్చున్నాను నేను

ఇంతలో తలుపు చప్పుడైతే వెళ్ళి తీశాను

ఎదురుగా ఓ అపరిచిత వ్యక్తి,

నమస్కారం!" చేతులు జోడించాడతను

లోపలకొచ్చి కూర్చోండి!" అన్నాను

అతను లోపల కొచ్చి కుర్చీలో కూర్చుని –

నా పేరు సుబ్బారావు! ఇంతకు ముందు ఇదే ఇంట్లో అద్దెకి వుండేవాడ్ని ఈ యింటి అడ్రస్‌కి లెటర్స్ ఏమైనా వచ్చాయో తీసుకువెళ్దామని వచ్చాను అన్నాడు

ఇంతలో బయటనుండి – పోస్ట్! అన్నకేక వినిపించింది

అతను బయటకు వెళ్ళి – ఏవో పుస్తకాలతో డబ్బు లెక్క పెట్టుకుంటూ తిరిగి ఇంట్లోకి వచ్చాడు

నేను కార్టూనిస్టుని! యివిగో నా కార్టూన్లు ప్రచురింపబడిన పత్రికలు – కాంప్లిమెంటరీ కాపీలు! ఇంతకు ముందు ప్రచురించబడిన కార్టూన్లకి పారితోషికం యిదీ! "

అని డబ్బు జేబులో పెట్టుకొని –

నేను యిల్లు మారినట్టు ఆ యింటి అడ్రస్ పోస్టుమేన్‌కి యిప్పుడే చెప్పాను ఒకవేళ పొరబాటున యిక్కడ వేస్తే లెటర్స్ వుంచండి – ఎప్పుడైనా వచ్చి తీసుకు వెళ్తాను! "అన్నాడతను

నాకు చటుక్కున ఓ ఆలోచన తట్టింది!

మీకు శకుంతల తెలుసా? అని అడిగాను

నా హృదయ సామ్రాజ్ఞి నా కలల రాణి – వచ్చిందా యిక్కడికి? ,

వచ్చి, మా కొత్త కాపురంలో కలతలు పెట్టి వెళ్ళిపోయింది!

నేను యిల్లు మారినట్టు ఆమెకు లెటర్ రాయాలనుకుంటూనే మర్చిపోయాను!

మా కొంప ముంచావ్! నిన్న నేను ఆఫీసుకి వెళ్ళాక – మీ శకుంతల వచ్చి - సుబ్బారావుగారున్నారా? అని మా ఆవిడ్ని అడిగిందట లేరు – ఆఫీసుకు వెళ్ళారు " అని మా ఆవిడ చెప్పింది

'మీరెవరు?" అని శకుంతల అడిగితే – నేను సుబ్బారావుగారి పెళ్ళాన్నని" మా ఆవిడ చెప్తే – "నన్ను ప్రేమించి, మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటారా? ఎంత మోసం! దగా! అని ఏడుస్తూ వెళ్ళిపోయిందట! " అన్నాను

ఇంతకీ మీ పేరు?" అడిగాడతను

"తమరి నామదేయమే – నా నామధేయం! అక్కసుగా అన్నాను

"కొంప ముంచారు! నాకు నిజంగా పెళ్ళయి పోయిందేమోనని – అక్కడ నా శకు ఏ అఘాయిత్యం చేసుకుందో ఏమో – వస్తాం! గుమ్మం వైపు పరిగెత్తబోయాడతను

గబుక్కున అతని రెక్క పట్టుకొని ఆపి –

"ఆగు నాయనా! ముందు మా కొంప తేల్చు – ఆ తరువాత నీ కొంప గురించి ఆలోచిద్దువుగాని

వెంకూ! వెంకూ! " మా ఆవిడ్ని పిలిచాను

వచ్చింది వెంకట సత్యవతి

చెప్పవయ్యా! చెప్పు! జరిగిందంతా మా వెంకూకి చెప్పు! అన్నాను –వెంకట సత్యవతికి నామీద వున్న అనుమానం పోగొట్టాలని నా తాపత్రయం!

"అంతా విన్నానండి! " తల వాల్చుకొని చెప్పింది వెంకట సత్యవతి

"క్షమించండి! నావల్ల మీకు చాలా ట్రబుల్ కలిగింది వస్తానండి! " అని వెళ్ళిపోయాడతను

వెంకట సత్యవతి నన్ను వాటేసుకుంది – ఆ పగలే వెన్నెల రాత్రిలా తీయగా – హాయిగా గడిచిపోయింది మాకు! □

ఇటీవల లయన్స్ క్లబ్ (విజయవాడ), లయనెస్ క్లబ్, లియో క్లబ్బుల సంయుక్త సమావేశంలో న్యూరో సైకియాట్రిస్టు, హిప్నో థెరపిస్టు డాక్టర్ నిచ్చెనమెట్ల అశోక్ కుమార్ హిప్నాటిజం గూర్చి ప్రసంగించారు వేదికపై ఆశీనులైన వారిలో లయనెస్ శ్రీమతి టి చాముండేశ్వరిమూర్తి (సెక్రటరీ), లయనెస్ శ్రీమతి యస్ శ్రీమణి కృష్ణమూర్తి (ప్రెసిడెంట్),లయన్ శ్రీ జి యస్ ఆర్ ప్రసాద్, (ప్రెసిడెంట్),లయన్ శ్రీ కె రవి (సెక్రటరీ) గార్లని చిత్రంలో చూడవచ్చు



# డాక్టర్ సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

## ఎమ్. ఆర్. కె. – జంగారెడ్డిగూడెం

నా వయస్సు 19 సంవత్సరములు నేను వ్యాయామం చేసేటప్పుడు గాని. మరెప్పుడైనా గాని వెనక్కి వంగినట్లైతే నా కళ్ళ ముందు దోమలు కదలాడుతున్నట్లు అనుభూతి కలుగుచున్నది గత రెండు సంవత్సరములుగా ఇలా జరుగుచున్నది

★ దీనిని నేత్ర వైద్యులు మస్కె వాలిటాంటిస్ అని అంటారు హ్రస్వ దృష్టి ఉన్న వారిలో ఇది ఎక్కువగా ఉంటుందని వారి అభిప్రాయం దీనికి ప్రత్యేక చికిత్స ఏమీ లేదు

## కె. ఎన్. ఆర్. – రాజమండ్రి

మేము ఏజన్సీలో ఉన్నప్పుడు మలేరియా వచ్చింది ఈ ఊళ్ళో ఉంటున్నా కూడా అప్పుడప్పుడూ మలేరియా వస్తున్నది శాశ్వత నివారణ తెలువగలరు

★ మలేరియా రోగానికి మలేరియల్ పేరసైట్‌లు కారణం అవుతాయి ఈ పేరసైట్‌లను దోమలు ఒక వ్యక్తి నుంచి మరొకరికి చేరవేస్తాయి

ఈ రోగం ఉన్నప్పుడు క్లోరోక్విన్, ప్రైమాక్విన్ అనే రెండు మందులు వాడవలసి ఉంటుంది దోమలు మళ్ళీ మళ్ళీ రాకుండా చుట్టు ప్రక్కల వాతావరణాన్ని శుభ్రంగా ఉంచుకొని దోమ తెరలు వాడుతూ ఉండాలి

కొన్ని సందర్భాలలో మాత్రం పై మందులకి పేరసైట్‌లు లొంగని పరిస్థితి ఏర్పడుతుంది ఆటువంటివారు వైద్యుల సలహా మేరకు మెటా కెల్విన్ వంటి మందులు వాడటం మంచిది

## కె.ఎస్.ఎన్.–అనకాపల్లి.

కొమ్ము సెనగలు బలమా? ముఖము కడుగకుండా తినవచ్చా? నానబెట్టిన నీరు త్రాగవచ్చా? ఎండా కాలం ఎక్సర్‌సైజు చేస్తే ఏమైనా హానికరమా?

★ పై వాటివల్ల ఏ విధమైన హానిలేదు సెనగలు నానబెట్టిన నీటిలో కలుషితాలు ఉండే అవకాశం లేక పోలేదు సెనగలు అమ్మేటప్పుడు దుమ్ము, ధూళి వాటి మీద చేరి ఉంటాయి కనీసం ఒకటికి రెండుసార్లు కడగకుండా, వాటిని నానవేసి ఆ నీరు త్రాగితే మంచికి బదులుగా సూక్ష్మ క్రిములు కడుపులోకి పోయే అవస్థ ఉంటుంది

## పి.సి ఎస్.ఆర్ – కడప

నా వయస్సు 21 సంవత్సరములు ఎత్తు 5 7 బరువు 55 కెజీలు అలర్జీకి సంబంధించిన పూర్తి రోగ లక్షణాలు నాలో ఉన్నాయి దీనికి సంబంధించిన ఏ స్పెషలిస్టును సంప్రదించాలి తెల్పండి ముఖ్యంగా కంటికి ఎక్కువగా వున్నది కళ్ళు నీరు కారటం, దురద వున్నవి దుమ్ము పొగ, సబ్బు పౌడర్ లాంటివి అసలు పడవు

★ మెడికల్ కాలేజీ ఆస్పత్రులలో అలర్జీ క్లినిక్‌లని ఉంటాయి అక్కడి వైద్యులను సంప్రదించటం మంచిది కళ్ళు బాధింప బడినప్పుడు నేత్ర-వైద్యులు వ్రాసి ఇచ్చిన మందులు వాడటం అవసరం □









ఆప్కో

# “కేవలం ధనార్జనే ధ్యేయం కాదు”



## కాలిఫోర్నియా తెలుగు సంఘం అధ్యక్షునితో ప్రత్యేక ఇంటర్వ్యూ

డబ్బు సంపాదించడానికే అమెరికా వెళ్లినప్పటికి తమ ధ్యేయం పూర్తిగా డబ్బు సంపాదనే కాదని మొదట రెండు మూడు సంవత్సరాలు తమ మాతృదేశాన్ని విడిచి పెట్టి ఆత్మీయులకు దూరంగా వుంటున్నది డబ్బు సంపాదనకే అనిపించినా ఆ భావం తర్వాత తొలిగిపోతుందని తమ హృదయం ఇక్కడ తెలుగువారిలాగానే వుంటుందని అన్నారు సదరన్ కాలిఫోర్నియా తెలుగు సంఘం అధ్యక్షులు శ్రీ ఆట్లూరి చంద్రశేఖరరావు

శ్రీ చంద్రశేఖరరావు 46 సంవత్సరాల క్రితం కృష్ణా జిల్లా గన్నవరం తాలూకా పొట్టిపాడులో జన్మించారు తేలప్రోలు హైస్కూలులోనూ విజయవాడ యస్ ఆర్ ఆర్ అండ్ ఎ వి ఆర్ కళాశాలలోనూ ఆంధ్ర లయోలా కళాశాలలోనూ చదివిన శ్రీ చంద్రశేఖరరావు 'ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి జియో ఫిజిక్స్‌లో యం ఎస్ సి డిగ్రీని పొందారు తదుపరి 1962లో ఉన్నత విద్యాభ్యాసానికై అమెరికా వెళ్లి కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలోను లాస్ ఏంజిల్స్‌లోనూ అభ్యసించి జియో కెమిస్ట్రీలో మాస్టర్స్ డిగ్రీ పొందారు

తరువాత విశ్వ విఖ్యాత శాస్త్రవేత్త రసాయన శాస్త్రంలో నోబుల్ బహుమతి గ్రహీత అయిన డబ్ల్యుయఫ్ లిబీ మార్గ దర్శకత్వంలో పరిశోధన చేసి ది పాసిబుల్ యాంటీ- మేటర్ కంటెంట్ ఆఫ్ ది తుంగుస్కా మీటర్ అనే పరిశోధనా వ్యాసాన్ని 1965లో ప్రచురించారు ఈ వ్యాసం ప్రముఖ అమెరికన్ పత్రికలయిన టైమ్ మరియు లాస్ ఏంజిల్స్ టైమ్స్ లచే ప్రముఖంగా కీర్తించబడింది శ్రీ చంద్రశేఖరరావు గత 14 సంవత్సరాలుగా కాలిఫోర్నియా రాష్ట్రంలోని హంటింగ్‌టన్ బీచ్‌లోని హగ్స్ ఎయిర్ క్రాఫ్ట్ కంపెనీలో కంప్యూటర్ సాఫ్ట్ వేర్ డెవలప్‌మెంటు విభాగపు సీనియర్ ప్రాజెక్టు ఆఫీసర్‌గా వుంటున్నారు బెంగుళూరు ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ ఆధ్వర్యంలో డిసెంబరు నెలలో జరుగుతున్న ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్ ఆన్ కంప్యూటర్స్ సిస్టమ్స్ అండ్ సిగ్నల్ ప్రాసెసింగ్'లో పాల్గొనుటకు శ్రీ చంద్రశేఖరరావు ప్రస్తుతం మన దేశం వచ్చారు

1972లో చికాగో తెలుగు సంఘం అధ్యక్షులుగా పని చేసిన శ్రీ చంద్రశేఖరరావు ప్రస్తుతం సదరన్ కాలిఫోర్నియా తెలుగు సంఘం అధ్యక్షులుగానూ ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ అసోసియేషన్ జాయింట్ సెక్రటరీగా ఉండటమే కాక తెలుగు అసోసియేషన్ ఆఫ్ నార్త్ అమెరికా (టానా) కార్యక్రమాలలో ఎన్నో బాధ్యతలు నిర్వహిస్తున్నారు

తమ సదరన్ కాలిఫోర్నియా తెలుగు సంఘం నెలకొక కార్యక్రమం నిర్వహిస్తుందని ఉగాది దీపావళి మొదలగు పండగ దినాలలో ప్రత్యేక సాంస్కృతిక కార్యక్రమాలు జరుపుకుంటుందని, అవన్నీ నూటికి నూరు శాతం తెలుగు వాతావరణంలోనే జరుగుతాయని నాటికలు, భరతనాట్యం మొదలగు కార్యక్రమాలుంటాయని తెలుగు సంఘం కార్యక్రమాలపై అడిగిన ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పారు శ్రీ చంద్రశేఖరరావు

అక్కడ కూడా మీ సంఘాలలో రాజకీయాలు కుల బేధాలు వుంటాయా అన్న ప్రశ్నకు చిరునవ్వుతో సమాధానమిస్తూ ఇక్కడ వున్నట్లే అక్కడా వుంటాయని సంఖ్య పెరిగిన కొద్దీ సమస్యలూ పెరుగుతాయని అయితే అవన్నీ పట్టించుకో తగినంత పెద్దవి కావనీ, ఇవి సంఘపు కార్యక్రమాలకు అవరోధం కావని శ్రీ చంద్రశేఖరరావు చెప్పారు అక్కడ తమ పిల్లల వివాహాలు తమకు పెద్ద సమస్యగా మారిందనీ తమ పిల్లలు అప్పుడప్పుడూ భారత దేశం వస్తున్నప్పటికీ పూర్తిగా భారతీయ సంప్రదాయం పట్ల మక్కువగానీ పూర్తిగా అమెరికన్ సంప్రదాయాల పట్ల ఆసక్తిగాని చూపటం లేదని తమ సమస్యలను గురించి చెప్పారు శ్రీ చంద్రశేఖరరావు

భారత దేశాన్ని ప్రముఖంగా ఆంధ్రప్రదేశ్‌ను పారిశ్రామికవంతం చేయడానికి అమెరికా ఆంధ్రులు ఉత్సాహం చూపిస్తున్నారా అన్న ప్రశ్నకు సమాధానంగా మా అంతట మాకు ఆ ఆలోచన లేదు 5 నుండి 10 శాతం మాత్రం ఈ రకపు ఆలోచనలు అప్పుడప్పుడు చేస్తుంటాం కాని ఎక్కువ మంది ఇక్కడ ఎవరైనా తమ బంధువులో స్నేహితులో బాధ్యత వహిస్తే తమ తమ వంతు పెట్టుబడులతో ముందుకు రావటానికి సిద్ధంగా వున్నారు అన్నారు శ్రీ చంద్రశేఖరరావు

అక్కడ ఎంత తెలుగు వాతావరణాన్ని భారతీయ వాతావరణాన్ని కల్పించుకుంటున్నా సహజ వాత్సల్యాన్ని ఆత్మీయతలను తాము, తమ పిల్లలు కోల్పోతున్నామేమో అనే చిరు భావన తమ మనసులలో ఏదో మూల వుంటుందన్నారు శ్రీ చంద్రశేఖరరావు

—డా. యార్లగడ్డ లక్ష్మీప్రసాద్



# ‘కొత్త సం
# కొత్త
-హీ

మాటింగ్ స్పాట్‌లో కృష్ణంరాజు ఉంటె ఎంతో సందడిగా ఉంటుంది జోక్‌లతో అందర్నీ నవ్విస్తూంటా రాయన పరిసరాలు కళ కళలాడుతూంటే ఆయనకు పరమానందం భోళాగా ఉండడం బగవంతుడు ఆయన కిచ్చిన వరం అందర్నీ ఎప్పుడూ చిరునవ్వుతో ఆప్యాయంగా పల్కరించడం ఆయన సంస్కారం

1984 వెళ్ళిపోతోంది 1985 లో ప్రవేశిస్తున్నాం అరుణాచలం స్టూడియోలో అగ్గిరాజు సెట్‌లో కలుసుకున్నప్పుడు ఈ విషయం గురించే ముచ్చటించుకున్నాం

## ‘నేతే కాదు మాత కూడా’

శ్రీమతి ఇందిరా గాంది అస్తమయంతో ఒక శకం అంతరించిందనే చెప్పాలి ఈ శతాబ్దపు ముఖ్య వ్యక్తి ఆమె ఆమె నాయకత్వంలో మన దేశం ఎన్నో విజయాలను సాదించింది నేడు ప్రపంచంలో మన దేశానికి బహుళ ప్రచారం రావడానికి ముఖ్య కారణం ఆమే ఆమెకున్నంతటి రాజకీయ పరిజ్ఞానం మన దేశంలో మరెవరికీ లేదని నిస్సంకోచంగా చెప్పొచ్చు దేశానికి నేతగానే కాదు, మాతగా కూడా నేనామెను ఎంతో ఆరాదిస్తాను దృఢదీక్షకు ఉదార స్వభావానికి కార్యదక్షతకు ప్రతిరూపమ్మైన అంతటి సమర్థవంతురాల్ని మనదేశం క్లిష్ట పరిస్థితుల్లో ఉన్నప్పుడు కోల్పోవడం ఎంతైనా దురదృష్టకరం, అన్నారాయన

శాంతి, సర్వమానవ సమానత్వం, దేశ ప్రగతి, సమగ్రతా పరిరక్షణకోసం చివరిదాకా కృషి చేసిన శ్రీమతి ఇందిరాగాంది బహుముఖ సేవలు బావితరాల వారికి తెలియజేయాలనే లక్ష్యంతో ఆమె స్మృతి చిహ్నంగా ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, ఢిల్లీ, బొంబాయి పంజాబ్‌లలో ఎంపిక చేసిన కొన్ని విశ్వవిద్యాలయాల్లో ఆమె స్మారక పీఠాలు నెలకొల్పడానికి, స్మారకోపన్యాసాల నిర్వహణకు కృష్ణంరాజు ఆధ్వర్యంలో ఆలిండియా కృష్ణంరాజు ఫాన్స్ అండ్ కల్చరల్ అసోసియేషన్ తగు ఆర్థిక సహాయం అందజేయడానికి నిశ్చయించింది

అంతేకాదు, పై అసోసియేషన్ ప్రెసిడెంట్ శ్రీ బసవ పున్నయ్య, ఎగ్జిక్యూటివ్ ప్రెసిడెంట్ శ్రీ జె వి శాస్త్రి ఆధ్వర్యంలో సెప్టెంబర్ 9 న విశాఖపట్నంలో కృష్ణంరాజు సారధ్యంలో తెలుగు చలన చిత్ర కళాకారుల సంఘంచే నిర్వహించబడిన ‘తారా విభావరి’ కార్యక్రమం ద్వారా వసూలైన ఆరు లక్షలలో శ్రీ శ్రీ స్మారకోపన్యాసాల కోసం ఆంధ్ర విశ్వ విద్యాలయానికి యాభైవేలు విరాళంగా ఇవ్వబడింది మిగతా సొమ్ము విశాఖలో అల్లూరి సీతారామరాజు కాంస్య విగ్రహ ప్రతిష్ఠాపనకు, ఆ జిల్లాలో గిరిజన సంక్షేమ కేంద్ర నిర్మాణానికి కేటాయించబడింది

## వితరణ శీలి

శ్రీమతి ఇందిరాగాంది దారుణ హత్య అనంతరం



# వత్సరం... ఆశలు...?
## రో కృష్ణంరాజు

దేశంలో చెలరేగిన మారణకాండలో నష్టపోయిన బాధితుల సహాయార్థం ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్‌గాంధి కోటి రూపాయలు కేటాయించడం నాకు కల్గించిన స్ఫూర్తితో ప్రధాన మంత్రి సహాయ నిధి'కి నవంబర్ 25 న ఢిల్లీ వెళ్ళి శ్రీ రాజీవ్ గాంధికి లక్ష రూపాయలు ఉడుతా భక్తిగా అందజేశాను అన్నారు కృష్ణంరాజు

ఇంకా – ఇటీవల నెల్లూరు చిత్తూరు జిల్లాలలో తుపాన్ పీడితుల సహాయార్థం మన 'ముఖ్యమంత్రి సహాయ నిది కి పాతికవేలు కేటాయించారాయన

సింహాచలం దేవస్థానం వద్ద లక్ష రూపాయల పై చిలుకు వ్యయంతో గెస్ట్‌హౌస్ నిర్మాణానికి ఆర్థిక సహాయం అందజేయడానికి సంకల్పించారు

1985 జులైలో లాస్ ఏంజిల్స్‌లో జరిగే ప్రపంచ తెలుగు మహా సభలకు మన రాష్ట్రంనుంచి ముగ్గురు పాత్రికేయులను ఎంపికచేసి పంపడానికి అయ్యే వ్యయాన్నంతా భరించడానికి నిశ్చయించారు





స్వస్థలం మొగల్తూరులో 1985 లో ప్రారంభమయ్యే కళాశాల నిర్మాణానికి తగు సన్నాహాలు చేస్తున్నారు

ఇక, గుప్తదానా లెన్నో

ఆయన కదో తృప్తి, అదో ఆనందం

## నిగర్వి

బొబ్బిలి బ్రహ్మన్న ఘన విజయం గురించి కృష్ణంరాజు అంటారిలా ఈ ఘన విజయం అందరిదీనూ ప్రధాన పాత్రదారిగా నాకేకాక, మా డైరెక్టర్‌గారికీ మా యూనిట్‌లోని ప్రతి ఒక్కరికీ అత్యంత సంతృప్తి నిచ్చిన చిత్రం ఒక మహోన్నతమైన చిత్రాన్ని రూపొదించాలనే తపనతోనే ప్రతి ఒక్కరూ కృషి చేశారు చిత్తశుద్ధితో చేసే కృషికి తమ ఆదరణ తప్పకుండా ఉంటుందని నవ్యతను కోరే ఉత్తమాభి రుచిగల ప్రేక్షక మహాశయులు కూడా నిరూపించారు అంచేత ఈ విజయం అందరిదీనూ దీంతో నటుడిగా నా బాధ్యత మరింత పెరిగింది మామూలు రొటీన్ పాత్రలను కాక 1985 నుంచి నటుడుగా నాకు మరింత పేరు తెచ్చే పాత్రలనే ఎన్నుకోవలసిన ఆవశ్యకత ఏర్పడింది అదృష్టవశాత్తు అలాంటి పాత్రలు కొన్ని లభించాయి కూడా నటుడిగా నాకింతకన్నా కావలసిన ఆనందం ఏముంది?

కొత్త సంవత్సరం వస్తోందంటే ఎన్నో ఆశలు చిగురించడం సహజం 1985 వ సంవత్సరంలో మన దేశం శాంతి సౌభాగ్యాలతో కళకళలాడుతూంటుందని ఆశిస్తూ, అందరికీ నా నూతన సంవత్సర శుభా కాంక్షలు అందజేస్తున్నాను, అన్నారు కృష్ణంరాజు

**(జి. వి. జి.)**



"మానవుడే మహనీయుడు"లో ఎ.ఎన్.ఆర్., శ్యామలగౌరి



సుమన్, విజయశాంతి, "దర్జాదొంగ"

# సినిమా

## "కళాసాగర్" అవార్డులు

ఉత్కృష్టమైన సాంస్కృతిక కార్యక్రమాలతో గత 13 ఏళ్ళుగా మద్రాసులోని తెలుగువారిని రంజింపజేసి బహుముఖ ప్రశంసలందుకున్న కళాసాగర్ సినిమారంగానికి ఇతోధిక ప్రోత్సాహ మివ్వాలనే మహదాశయంతో గత 9 ఏళ్ళుగా ఫిలిమ్ అవార్డులను అందజేస్తున్న విషయం సర్వ విదితమే డిసెంబర్ 9 సాయంత్రం మద్రాసు యూనివర్శిటీ సెంటినరీ హాలులో భారీ ఎత్తున జరిగే బహుమతీ ప్రదానోత్సవానికి శ్రీయుతులు డి ఎస్ లింగం జి రామదాసు, ఆర్ ఎస్ గణేశ్వరరావు న్యాయ నిర్ణేతల బృందం ఈ కింది అవార్డులను నిర్ణయించినట్లు కార్యదర్శి సుబాన్ ప్రకటించారు ఉత్తమ చిత్రం ఆనంద భైరవి ప్రత్యేక ప్రశంస నేటి భారతం దర్శకుడు జంధ్యాల (ఆనంద భైరవి) నటుడు కమలహాసన్ (సాగర సంగమం) నటి జయసుధ(ధర్మాత్ముడు) స్పెషల్ అవార్డు దాసరి నారాయణరావు (ఎమ్ ఎల్ ఎ ఏడుకొండలు) సహాయ నటుడు రాళ్లపల్లి (అభిలాష), సహాయ నటి శకుంతల (రంగుల కల) హాస్య నటుడు సుత్తివేలు (రెండు జెళ్ల సీత) హాస్య నటి శ్రీ లక్ష్మి (ఆనందభైరవి) కదకుడు కొండమ్ముది శ్రీరామ చంద్రమూర్తి (ఆనంద భైరవి) గేయ రచయిత అదృష్టదీపక్ (నేటి భారతంలోని మానవత్వం పరిమళించింది) గాయకుడు ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం (సాగర సంగమం) గాయని ఎస్ జానకి (ఆనంద భైరవిలోని కొలువైతివా రంగశాయి) ప్రత్యేక ప్రశంస ఎస్ ఎ శైలజ (సాగరసంగమంలో వేవేల గోపెమ్మల) సంగీత దర్శకుడు ఇళయరాజా (సాగర సంగమం)

రంగస్థల కళా కారులను కూడా ప్రోత్సహించే లక్ష్యంతో 1981–84 మధ్య ప్రదర్శింపబడిన నాటకాలకు నిర్ణయింపబడిన నాలుగవ త్రైవార్షిక బహుమతులు ఉత్తమ ప్రొడక్షన్ వేటకుక్కలు (బహురూప నట సమాఖ్య, విశాఖ) దర్శకుడు తల్లావఝుల సుందరం (కొక్కొరకో) రచయిత ఇసుకపల్లి మోహనరావు (తర్జని) నటుడు ఎం సంజీవి (ఈ చరిత్ర ఏ సిరాతో) నటి ఇందిర (హరిజనా గ్రహారం) హాస్య నటుడు ఎ ఎస్ రామలింగస్వామి (అయోమయోపాఖ్యానం)

దాసరి నారాయణరావు, "లంచావతారం"



"ఉగ్ర నరసింహం"లో కృష్ణంరాజు, జయప్రద



"ఋణానుబంధం"లో అశ్వని, మోహన్‌బాబు, రాజేష్





"మాంగల్య బంధం" సుహాసిని, శరత్‌బాబు



**"ఓ ఇంటి కాపురం"లో భానుప్రియ, మమత**

# విశేషాలు —జి.వి.జి.

## పినిశెట్టి దర్శకత్వంలో పింజల నాగేశ్వరరావు చిత్రం

నవంబర్ 6 నుంచి 10 వరకు ఫస్ట్ షెడ్యూల్ పూర్తి చేశాం, అన్నారు పినిశెట్టి రవిరాజా, ఈయన కథ, స్క్రీన్ ప్లే దర్శకత్వ బాధ్యతలు వహించే పి ఎన్ ఆర్ పిక్చర్స్ తాజా చిత్రంలో చిరంజీవి ద్విపాత్రాభినయం విశేషాకర్షణ రాధిక, భానుప్రియ, సిల్క్ స్మిత, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, అన్నపూర్ణ సుదర్శన్ ప్రభృత తారాగణం సత్యమూర్తి సంభాషణలు ఇళయ రాజా సంగీతం లోక్‌సింగ్ ఛాయ, కృష్ణ శిల్పం, తార నృత్యాలు, రాజేంద్ర సహకార దర్శకత్వంతో డి రాజేంద్రరాజు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ ఎన్ వెంకటేశ్వరరావు నిర్మాణ సారధి ఫిబ్రవరికి షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు నిర్మాత పింజల నాగేశ్వరరావు ఈయన తమిళంలో నిర్మించిన జనవరి – 1 అనే చిత్రం హిట్ అయింది దాన్ని అదే పేరున తెలుగులో త్వరలో విడుదల చేయడానికి సన్నాహాలు చేస్తున్నారు

"శ్రీ వామనావతారం"లో దీప



మణివణ్ణన్ దర్శకత్వం నెఱపిన ఈ సస్పెన్స్ థ్రిల్లర్‌లో సులక్షణ, దీప, తార అనూరాధ, విజయకాంత్ పాత్రధారులు ఇళయ రాజా సంగీత దర్శకుడు

## హిప్నాటిజం ప్రధానాంశంగా "పగపట్టిన కళ్ళు"

తీరని అన్యాయం జరిగినప్పుడు పగపట్టిన వ్యక్తి విచక్షణా రహితంగా ఎంతటి దారుణానికి ఒడికడతాడో చెప్పడం ఎవరికీ సాధ్యం కాదు ఐతే ఈ చిత్రంలో కథా నాయకుడు ఒక విచిత్రమైన ప్రయోగంతో తన చేతికి నెత్తురు అంటుకోకుండా పగసాధిస్తాడు హిప్నాటిజం ప్రధానంగా తెలుగులో తయారైన తొలిచిత్రం ఇదే కావచ్చు అన్నారు పి శైలజ ఈమె సమర్పణలో వై ఆదిశేషమ్మ ఎం ఆర్ మహాలక్ష్మి నిర్మించిన వినోదా క్రియేషన్స్ పగపట్టిన కళ్ళు చిత్రంలో శ్రీప్రియ, సిల్క్ స్మిత, రోహిణి నవనటి వనిత విజయకాంత్ నంబియార్ పెమ్మసాని రామకృష్ణ ప్రభృతులు నటించారు రాజశ్రీ మాటలు, పాటలు రాశారు బి ఎస్ లోకనాధ్ ఛాయాగ్రాహకుడు కె ఎం బాలకృష్ణ దర్శకుడు

"ఆడ పిల్లలే నయం"లో చంద్రమోహన్, మురళీ కృష్ణ, జయసుధ



"శ్రీకట్న లీలలు"లో ఒక దృశ్యం





"పట్నంతో పోరాటం" — సిల్క్ స్మిత

## సుమన్, జయసుధ, రజనీకాంత్‌తో అట్లూరి పూర్ణచంద్రరావు సమర్పించే చిత్రం

తొలిసారిగా జయసుధ, సుమన్ నాయికా నాయకులుగా నటిస్తున్నారు. తన కుటుంబంలో అల్లకల్లోలం, అశాంతిని సృష్టించిన ఏ ద్రోహ వర్గంపై ప్రతిజ్ఞలు, ప్రగల్భాలు ప్రకటించకుండా చాలా కూల్‌గా, కామ్‌గా తన ప్రతీకారాన్ని మూడో కంటికి తెలియకుండా తీర్చుకునే ప్రొఫెసర్ కమ్ రాబిన్‌హుడ్‌గా సుమన్... న్యాయ విచారణ సమయంలో సాక్ష్యం చెప్పాల్సివచ్చినప్పుడు — ఎంత వారలైనా బోను ఎక్కి జవాబులు చెప్పాల్సిందే అని నిలదీస్తూ ధర్మపోరాటం సాగించే న్యాయవాదినిగా జయసుధ... ఒకవైపు తమాషాగా జోక్‌లు వేస్తూనే మరొకవైపు మనసులో దుండగుల వధకాల్ని పసిగడుతూ, వాటిని ప్రతిఘటిస్తూ ముందుకు సాగే గూఢచారి పాత్రలో రజనీకాంత్ నటిస్తున్నారు," అన్నారు అట్లూరి పూర్ణచంద్రరావు. ఈయన సమర్పణలో "పట్నానికి కళ్ళులేవు" అనంతరం వంకినేని సత్యనారాయణ నిర్మించే శ్రీకర్ ప్రొడక్షన్స్

సినిమాలు మానేసి రాజకీయాల్లో చేరదామనుకున్నాను— కానీ సినిమా రంగంలోనే రాజకీయాలు నడపవచ్చని ఆగిపోయాను.



## పి. సి. రెడ్డి దర్శకత్వంలో సుబ్బరాజు సమర్పించే సిల్క్ స్మితతో "మాయలాడి"

సిల్క్ స్మిత సెక్సీ డాన్సర్‌గానే కాకుండా చక్కని నటిగా మన్నన అందుకునే రీతిలో నటిస్తోంది. కరాటే, గుర్రపు స్వారీ, డాన్స్‌లో ప్రావీణ్యం పొందిన ఆరడుగుల అందగాడు కపిలదేవ్‌ను హీరోగా పరిచయం చేస్తున్నాం," అన్నారు ఎస్. వి. సుబ్బరాజు. ఈయన కథ, సమర్పణలో పి. ఎస్. రంగనాధవర్మ నిర్మించే శ్రీ వాణి సినీ ఆర్ట్స్ "మాయలాడి" చిత్రంలో రాజసులోచన, త్యాగరాజు, రాళ్ళపల్లి, జీవాతో పాటు గొల్లపూడి మారుతీరావు ఒక అపూర్వమైన గెటప్‌లో కనిపిస్తారు. మధు సంభాషణలు, రాజ్-కోటి సంగీతం, ఎన్. ఎస్ రాజు ఛాయ, వెంకటేశ్ సహకార దర్శకత్వం, మోహన్‌రెడ్డి - రత్నారావు ప్రొడక్షన్, గౌతంరాజు కూర్పుతో ఎస్. బంగారురాజు నిర్మాణసారధి "నవంబర్ 15కు షెడ్యూల్‌ను పూర్తి చేశాం. డిసెంబర్‌లో 22 రోజుల పాటు షూటింగ్ ఉంటుంది. జనవరిలో విడుదలకు సిద్ధమవుతుంది," అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే పి. చంద్రశేఖరరెడ్డి.

## షూటింగ్ పూర్తయిన "ఋణానుబంధం"

రక్తం పంచుకు పుట్టిన బిడ్డలే తల్లిదండ్రుల్ని ధిక్కరిస్తున్న ఈ రోజుల్లో, తోడబుట్టిన వాళ్ల మధ్య ఐకమత్యం దుస్సాధ్యమవుతున్న ఈ యుగంలో –తనను చేరదీసి ఆదరించిన ఓ ప్రేమమూర్తి కన్నబిడ్డల్ని కంటికి రెప్పలా కాపాడుతూ, తన ఔన్నత్యాన్ని నిలబెట్టుకోడానికి ప్రయత్నించిన ఓ మంచి మనిషి మరపురాని కథ పెంచి పెద్ద చేసిన తననే ఎదిరించి, తనకిష్టమైన అమ్మాయిని వివాహం చేసుకోడానికి సిద్ధమైన తమ్ముడ్ని, మమతలు పంచిన తన సన్నిధినే పెన్నిధిగా తలచిన చెల్లెల్ని ఆ అన్నయ్య ఎలా సంతృప్తి పరుస్తాడో అనేక మలుపులతో నవరసభరితంగా చిత్రీకరించాం,' అన్నారు బి భాస్కరరావు ఈయన స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో ఆర్ సురేష్‌రెడ్డి నిర్మించిన గోదాలయ ఆర్ట్ పిక్చర్స్ ఋణానుబంధం లో మోహన్‌బాబు, జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, గుమ్మడి, రాజేష్, కాంతారావు, సారథి, నళిని, మహలక్ష్మి, ఆనంది, అశ్విని, సుమిత్ర ముఖ్య భూమికలు నిర్వహించారు కాశీ విశ్వనాద్ సంభాషణ కర్త సత్యం స్వరకల్పనలో సి నారాయణరెడ్డి, గోపి గీతాలు రాశారు సత్తిబాబు, చాయ, హీరాలాల్ నృత్యాలు, వెంకటేశ్వరరావు, కూర్పు, ఇ ప్రకాష్‌రెడ్డి సహ దర్శకత్వం నిర్వహించారు డిసెంబర్‌లో విడుదల చేస్తాం, అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే ఆం వి గురుపాదం



"కాలరుద్రుడు"లో త్యాగరాజన్, ఊర్వశి, జానకి

## "మంత్ర దండం" చివరి షెడ్యూల్

నవంబర్ 1 నుంచి 20 వరకు జరిగిన షెడ్యూల్‌తో షూటింగ్ దాదాపు పూర్తయినట్లే అన్నారు భీమవరపు బుచ్చిరెడ్డి ఈయన కొమ్మినేని స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో సమర్పించే కౌసల్యా పిక్చర్స్ మంత్ర దండం లో శివకృష్ణ, వనితశ్రీ, కాంతారావు, అత్తిలి లక్ష్మి, వంకాయల సత్యనారాయణ జీవా, మోహినిగా అనూరాధ నటించారు పేరాల రచన, చక్రవర్తి సంగీతం హెచ్ ఎస్ వేణు చాయ, నాగరాజు శిల్పం గౌతమ్‌రాజు కూర్పు, దిలీప్– జయప్రసాద్‌రెడ్డి సహకార దర్శకత్వం సి వి ఎస్ రామారావు – శ్రీనివాసులరెడ్డి ప్రొడక్షన్‌తో బి అంజిరెడ్డి నిర్వహణ బాధ్యతలు వహించారు బి కౌసల్యా బుచ్చిరెడ్డి నిర్మాత

---

## సినీతార

సినీతార సీరియల్ నెం. 8

(జరిగిన కథ సినిమాల్లో చేరడానికి వచ్చిన లేఖకు ఫ్లాష్ పరిచయమయ్యాడు లేఖ తల్లి కథ బ్రోకర్ రామయ్య చెప్పినట్టు వినడానికి సిద్ధపడింది)

తల్లి మాటల్ని పదేపదే తలుచుకుని ఆలోచించిన లేఖ తానూ ఒక నిర్ణయానికొచ్చింది

వెంటనే బ్రోకర్ రామయ్యను కలుసుకుంది

"ఇంత కాలానికి వొచ్చావన్నమాట! చాలా సంతోషం పద!" అన్నాడు రామయ్య.

* * *

ప్రస్తుతం లేఖకు చిన్న చిన్న వేషాలు దొరుకుతున్నాయి ఓరోజు సెక్సీ నృత్యాలుచేసే జయమాలతో పరిచయం ఏర్పడింది జయమాల ఆహ్వానం పై ఆమె యింటికి వెళ్ళింది లేఖ.



జయమాల చాలా మంచిది "తల్లి, చెల్లెళ్ళు, తమ్ముళ్ళకోసం ఎంత కష్టపడుతోందో కదా!" అనుకుంది లేఖ.

బెడ్‌రూంలో బీరువాలు తెరిచి చీరలు చూపించింది జయమాల కొన్నివందల చీరలున్నాయా బీరువాల్లో "లేఖా ఇన్ని చీరలున్నా సినిమాల్లో ఒక్క చీర కట్టుకోడానికి కూడా నోచుకోలేదు నేను. కారణం! వాళ్ళకి కావలసింది నా నటనకాదు, నా శరీరమ్మీద ఎంత తక్కువగా గుడ్డలుంటే వాళ్ళంత ఆనందిస్తారు, అందుకే ఈ చీరచూడు! ఈ చీరంటే నాకెంతో అభిమానం ఎందుకో తెలుసా? అభం శుభం తెలియని అమాయకపు పిల్లగా ఒంటినిండా ఈ చీర కప్పుకునే నేను మద్రాసు చేరాను. చనిపోయినప్పుడు ఈ చీర నా శవంమీద కప్పితే ఎంతో సంతోషిస్తాను" అంది జయమాల భోరున ఏడుస్తూ.

సినిమాల్లో నవ్వుతూ తుళ్ళుతూ సెక్సీగా నృత్యాలుచేసే జయమాలలో పెద్ద బంగళాలో ఉంటూ రోజూ కారుల్లో తిరిగే జయమాలలో ఇంత బాధ వుందని తెలిసి లేఖ ఆశ్చర్యపడింది. తానూ బాధపడింది

ఆ రోజు రాత్రంతా జయమాలని గురించే ఆలోచిస్తూ నిద్రపోయింది లేఖ.

(ఇంకా వుంది)

...తారల జీవితాల్లో కూడా ఎన్నో భావాలు, కథలు వున్నాయి. వారి జీవితాలకు అద్దంపట్టే చిత్రం లావణ్యా ఆర్ట్ పిక్చర్స్ వారి "సినీతార" కె.జి. జార్జ్ దర్శకత్వంలో పద్మవరెడ్డి శివకుమార్ ... ఈ చిత్రానికి గోపి రచన చేయగా, వి.ఎస్.వి. నరసింహారావు సమర్పిస్తున్నారు.



అరుణ. "మామగారొను నారు జాగత "

# ఇరుగు – పొరుగు

★ మహారాష్ట్ర ముఖ్యమంత్రి వసంత్ దాదా పాటిల్ కుమార్తె ఆశాపాటిల్ "ముగ్గి జాలి హో " (ఓ అమ్మాయి పుట్టింది) అనే మరాఠీ చిత్రం ద్వారా వెండి తెరకు పరిచయం గావింపబడుతోంది ఈమె నర్తకీమణి కూడా

★ సుమలత బావ, స్థిర ఛాయా గ్రాహకుడు రవి ఒక తమిళ చిత్రాన్ని సుమలత నాయికగా నిర్మించబోతున్నాడు మణివణ్ణన్ దర్శకుడు

★ సుజాతకు చాలా కాలంగా పోలీస్ ఆఫీసర్‌గా నటించాలని ఆశ "శివప్పునీల" అనే తమిళ చిత్రంలో ఆమె కోర్కె నెరవేరబోతోంది

★ మద్రాసు చిత్ర థియేటర్‌లో అంద జూన్ 16 నాళ్" అనే చిత్రం ప్రదర్శింపబడడానికి ముందు ఈ విధంగా ఒక స్లయిడ్ చూపించబడింది "విన్నపం " ఈ చిత్రం రీ రికార్డింగ్ సరిగా లేదు అంచేత, మా థియేటర్‌లో సౌండ్ లోపంగా భావించకండి

★ రమేష్ ఇటీవల అంబికై నేరిల్ వందాళ్ అనే తమిళ చిత్రంలో ఓ పాట పాడాడు ఈయన్ని తమిళ సినిమా రంగానికి పరిచయం చేసింది ఇళయ రాజా

★ మద్రాసు 'లియో' థియేటర్‌లో ఆ మధ్య "కాయం అనే మలయాళ చిత్రం ప్రదర్శింపబడినప్పుడు పోస్టర్లు ఎంతో సెక్సీగా వేయబడ్డాయి థియేటర్‌లోని షో కార్నుల్లో కూడా ఎన్నో పోజులలో శృంగార దృశ్యాలు ప్రదర్శించబడ్డాయి కాని, ఆ చిత్రంలో అలాంటి సన్నివేశాలు ఒక్కటైనా లేకపోయేసరికి ఆగ్రహం చెందిన ప్రేక్షకులు ఆ తదుపరి ఆటకు క్యూలో నిలుచున్న వారితో "వొట్టి ఫ్రాడు శృంగార దృశ్యం ఒక్కటైనా లేదు మీ డబ్బును వృథా చేయకండి," అని ప్రచారం చేశారట

★ జితేంద్ర, షమ్మీకపూర్ కలిసి తొలి సారిగా సలీమ్ నిర్మించే "ఇన్సాఫ్ చిత్రంలో బుక్ అయ్యారు ఇందులో జితేంద్ర తండ్రిగా షమ్మీకపూర్ నటిస్తున్నాడు

★ ఎన్ సి సిప్పీ నిర్మించే " మేరీ జంగ్" చిత్రాన్ని డైరెక్ట్ చేసే రమేష్ సిప్పీకి పారితోషికం 22 లక్షలట

★ రాజీవ్ కపూర్ "ప్రేమ్ గంధ్ అనే చిత్రాన్ని స్వీయ దర్శకత్వంలో నిర్మిస్తున్నాడు ఇతని పేరు 'చింపు' కాని, చదువుకునే రోజుల్లో ఇతని మిత్రులంతా 'ఛాంపియన్' అని పిలిచేవారట అంచేత తన చిత్రాన్ని ఆర్ కె ఛాంపియన్ ఫిలిమ్స్ బానర్‌లో తయారు చేస్తున్నాడు "

★ ప్రముఖ మరాఠీ, హిందీ రచయిత విజయ్ టెండూల్కర్ సినిమా రంగంలో ప్రవేశించడానికి ముందు ఒక ఉల్లిపాయల గోదాములో గడిపేవారట మూడు పుటలా ఆ ఉల్లిపాయలతోనే కడుపు నింపుకునేవారట ఈయన భార్య, అమితాబ్‌బచ్చన్‌కు ఫాన్ అయితే, ఈయనకు అమితాబ్ బచ్చన్ ఫాన్ "మంది, అర్ధసత్య" లాంటి చిత్రాలకు పని చేసిన ఈ రచయితకు పొగ, తాగుడు లాంటి వ్యసనాలేవీ లేవు టీ కూడా తాగరట ఈయన బొంబాయి పార్క్‌వే హోటల్‌లో స్వంత ఖర్చుతో ఒక గదిని బుక్ చేసుకున్నారు అక్కడికి ఉదయం పది గంటలకు వెళ్ళి, రాత్రి పది పదిన్నర వరకు స్క్రిప్టు పనులు పూర్తి చేసి, ఆ తర్వాతగాని ఇంటికి తిరిగి రారట

★ మద్రాసు వడపళనిలోని స్టంట్ ఆర్టిస్ట్సు అసోసియేషన్ ముందు "మహిళలకు ప్రవేశము లేదు" అనే బోర్డు వేలాడదీయబడింది ఇది అవసరమా?

★ నిర్మాణంలో ఉన్న తాజా జేమ్సుబాండ్ చిత్రం ఎవ్యూ టు కిల్ రోజర్‌మూర్‌కు జేమ్సుబాండ్‌గా ఇది ఏడవ చిత్రం "బహుశా ఈ పాత్రను నేను ధరించడం ఇదే చివరిసారేమో!" అంటాడతను

–జి. ఏ. జి.




# బోర్న్‌విటాతో పెరిగే ప్రాయం యిది యికే

## వాళ్ళు మిమ్మల్ని మెచ్చుకునే రోజొకటి వస్తుందిక!

పెరిగే వయసుల్లోని పిల్లలు మరే మాల్టెడ్ ఆహార పానీయమూ కాకుండా బోర్న్‌విటాయే ఎందుకు కావాలంటారు? రెండు తరాల్లోని తల్లిదండ్రులు వాళ్ళ పిల్లలకి యిక మరేదీ కుదరదని ఎందుకు పట్టుబడతారు?

కేవలం ఘుమ్ అనిపించే రుచి మాత్రమే కాదు. మరి కేవలం బోర్న్‌విటా పేరు చూసి కాదు. ఉంది అందులో మరేదో ఉంది యింకా మరెంతో. అదే మరి బోర్న్‌విటా, పెరిగేందుకు తోడ్పడే ఆహార పానీయం.

క్యాడ్‌బరీస్

**బోర్న్‌విటా**

పిల్లలు సరిగ్గా పెరగడం,
అందుకే మరి బోర్న్‌విటా యివ్వడం.

1 కి గ్రా ప్యాక్‌లో
కూడా దొరుకుతుంది
దీని లోపల ఉంది ఉచితంగా
లభించే
మగ్.




OBM/3784 TEL

సీరియల్

# ఎదవీణ మోగినవేళ

"కృష్ణజ"

ఒక్కసారిగా ఆమెకు దుఃఖం ముంచుకు వచ్చింది తను పతిత తను పతిత ఈ నిజాన్ని జీర్ణించుకోలేని సాకేత మోకాళ్లల్లో తల దూర్చుకుని వెక్కి వెక్కి ఏడ్చింది ఆమెలో దుఃఖం వరద గోదావరిలా ఉప్పొంగి చెలియలి కట్ట దాటింది

మనుషులు అలా ఎంతసేపో దుఃఖించలేరు

కొంతసేపటికి ఆ దుఃఖోద్వేగం తగ్గ ముఖం పడుతుంది మనస్సులో ప్రశాంతత లేక నిర్లిప్తత చోటు చేసుకుంటుంది

అది మానవ ప్రకృతి

సాకేత దుఃఖోద్వేగం ఉపశమించే వరకూ స్వామీజీ మౌనంగా ఉండిపోయారు

అయినింటి ఆడపిల్లలు అంతకంటే ఒక్క అడుగు కూడా ముందుకు వేయరు వేయలేరు

కత్తి పుచ్చుకుని ఆశ్రమం వరకూ వచ్చిందంటే అదే చాలా ఎక్కువ బహుశా ఆమె తన జీవిత మొత్తంలో చేసిన మొట్ట మొదటి పెద్ద సాహస కార్యమదే అయి ఉంటుంది

అంతకు మించిన సాహసం చూపిస్తేనే లోకం ఆశ్చర్యపోతుంది ఈ విషయం స్వామీజీకి తెలుసు

సాకేత తనను ఏమీ చెయ్యలేదు

అలాంటి ఆడపిల్లలు కనీసం పోలీసు రక్షణ కూడా తీసుకోలేరు మానసికంగానూ, శారీరకంగానూ స్త్రీ ఎంత అబలో ఈ దేశపు పురుషుడికి తెలిసినంతగా మరెవ్వరికీ తెలీదు

ఈ దేశపు పురుషుడి మహద్భాగ్యం అదే

ప్రతి స్త్రీ ఒక ఫూలన్ దేవిలా శారీరక మానసిక శక్తి సామర్థ్యాలు సంపాదించగలిగితే ఇన్ని అనాద కదలు ఉండేవి కావు

ఇన్ని వ్యబిచార గృహాలు వెలిసేవి కావు

స్త్రీల కదలు కన్నీటి గాదలుగా ముగిసేవి కాదు

**జరిగిన కథ - 9 :** సాకేత అత్తగారి పోరువల్ల స్వామీజీ అభ్యంతర మందిరానికి వెళ్ళింది. ప్రసాదం, తీర్థాలలో మత్తు మందు కలిపి సాకేతకిచ్చి మగతలో ఉన్న సాకేతను అనుభవిస్తాడు స్వామీజీ! తన కోడలు గర్భం దాల్చిందని ఇరుగు పొరుగు వారితో గర్వంగా చెప్పుకో-సాగింది జానకమ్మ. సాకేత తను గర్భవతినని తెలుసుకొని స్వామీజీ మోసం గ్రహించి అతని దగ్గరకు వెళుతుంది. అతనిప్రతి రూపం తనలో ప్రాణం పోసుకుంటోందని ఆలోచన వచ్చిన సాకేత నేల మీద కూలబడిపోయింది.

సాకేతా

చదువుకున్నావేమో స్త్రీ, పురుష కలయిక లేకుండానే సంతానం కలుగుతుందని ఎలా అనుకున్నావ్ ?

చివ్వున తల ఎత్తి చూసింది సాకేత

మా అత్తగారు నిన్ను దేవుడని నమ్మింది ఆమె బలవంతం మీదనే నేను రావల్సి వచ్చింది నీ మోసం అందరికీ చెబుతాను నీ గుట్టు బట్ట బయలు చేస్తాను నిన్ను పోలీసులకు అప్పగిస్తాను

ఇంకా ?

ఈ బాబాలూ, స్వాములూ గురువులూ వచ్చి మోసగాళ్ళని ప్రపంచానికి తెలియ జెపుతాను ఎందరో అమాయకులైన ప్రజలు మీ నుండి రక్షింపబడతారు

పసి పాప వంక చూసి ప్రేమగా, జాలిగా నవ్వినట్లు నవ్వారు స్వామీజీ ప్రజలు కాదు అమాయకులు నువ్వు స్త్రీ పురుష కలయిక లేకుండా సంతానం కలగదనే విషయం పసి పిల్లలతో సహా ప్రపంచంలో ప్రతి ఒక్కరికీ తెలుసు అయినా నా దగ్గరికి వస్తారు ఎందుకంటావ్ ? గొడ్డు ఎక్కడ కట్టినా మా ఇంట ఈనితే చాలనే బలహీనతతో ఎలాగోలా పిల్లలు పుడితే చాలు తమ వంశం నిలిస్తే చాలు తమ పుంసత్వానికి గుర్తుగా మిగిలితే చాలు తమ సంసారాలు నిలిస్తే చాలు ఎవరికి ఎలా పుట్టిందీ అక్కర్లేదు దేవుడి దయ బాబాగారి మహాత్మ్యం అంటూ హరి కదలు చెబుతారు కాదని అవతలివాడికీ వీడికీ తెలుసు కానీ ఎవరూ కాదనరు సాకేతా! ఇదీ ప్రపంచం మీ అత్తగారి విషయమే తీసుకో

ఏమిటి ?

కొడుకు నపుంసకుడని తెలుసు

అదిరి పడింది సాకేత

ఆయన ఆయన అంది తొట్రుపాటుతో

ఊఁ ఆయనే సాకేతా! స్త్రీ వంధ్యత్వం గల స్త్రీల శాతం సహజంగా తక్కువగా వుంటుంది డాక్టర్ ట్రీట్‌మెంట్‌తో కొందరిలో సెట్‌రైట్ అవుతుంది కూడా అందుకు వాళ్ల అభ్యంతరం కూడా ఉండదు కానీ చిక్కంతా పురుషులతోనే అనేక కారణాల వల్ల పురుషులలో వంధ్యత్వం ఏర్పడుతుంది డాక్టరు పరీక్ష చేయించుకునేందుకు నామోషీ పురుషుడు ఏదైనా భరించగలడు గానీ, తన మగసిరిని గురించిన బలహీనతను మాత్రం తట్టుకోలేడు

సాకేత బొమ్మలా కూర్చుండిపోయింది

ఆమె కళ్ళు నుండి ధారగా కన్నీరు వర్షిస్తున్నాయి

సాకేతా పిచ్చిదానిలా ఎందుకలా దుఃఖపడతావు ? ఆనందంగా గర్వంగా ఉండాల్సిన ఈ సమయంలో దుఃఖం ఎందుకు ?

ఆనందం గర్వం ఏం చూసుకుని ఆనందం ?

బిడ్డకు తల్లివి కాబోతున్నావు సంతోషంగా లేదూ ?

ఈ పాపంతో తల్లినయేకంటే అసలు జీవితంలో తల్లి కాకపోవడం అదృష్టం

స్వామీజీ స్థిరంగా, మధురంగా మందహాసం చేశారు

హుఁ పాపం ఏది పాపం ? సంఘంలో తన పరువు నిలుపుకునేందుకు ఒక అమాయకురాలి మెడలో తాళి కట్టడం పాపం కాదా ? కొడుకు నపుంసకుడని తెలిసీ కోడలిని సంఘంలో గొడ్రాలిగా చిత్రించడం పాపం కాదా ? పిల్లలు కలగలేదని ఆమెను వేదించడం పాపం కాదా ?

స్వార్థంతోనే కావచ్చు కానీ ఒక అమాయకురాలి సంసారాన్ని నిలబెట్టడమేనా నేను చేసిన పాపం

స్వార్థపరులైన అత్తగారికీ భర్తకూ బుద్ధి చెప్పడం, బ్రతుకు

నిలుపుకోడం చేస్తే అది నీ పాపమా ?

సాకేత బొమ్మలా అతని వంక చూస్తూ వింటూండిపోయింది ఇతను తన దుష్ట చర్యను ఎంత లౌక్యంగా సమర్థించుకుంటున్నాడు ఈ లౌక్యంతో నే అతను అధికార, అనధికారులతో సహా పలుకుబడిగల వారినంతా తన గుప్పిటలో ఇముడ్చుకున్నాడు పొట్టేలు కొండను ఢీకొన్నట్లు అతన్ని తానేమి చేయలేననే సత్యం తెలిసి వచ్చింది సాకేతకు

చెప్పు సాకేతా! అత్త, భర్త స్వార్థానికి బలియైపోవడమేనా పాపం కానిది ? ఆదొక్కటేనా పుణ్య మార్గం ?

సాకేతా! ఆనందంగా ఇంటికి వెళ్ళు నీ అత్తా, నీ భర్తా సంతోషిస్తారు

సాకేత మౌనంగా ఉండిపోయింది ఆమె ఏం ఆలోచిస్తుందో అతనికి అంత పట్టలేదు

సత్యా! ఒక సలహా యవ్వనమంతా అడవి కాచిన వెన్నెల్లా చేసుకునే-కంటే, మరో మార్గం చూసుకోడం మంచిది

సాకేత మౌనంగా బయటికి నడిచింది

ఆమె గుండెల్లో ఏముందో ఆ అనుభవశాలికి సైతం అంతుబట్టలేదు అతని నుండి సంతాన వరం పొందిన స్త్రీ అదో వరంగా భావించిందే తప్ప, ఎప్పుడూ, ఏ స్త్రీ కూడా అతన్నిలా నిగ్గ తీసి అడిగిన వాళ్ళు లేరు

స్వామీజీ గుండెల్లో సాకేత ఒక ప్రత్యేకమైన స్త్రీమూర్తిగా నిలిచి-పోయింది

*                    *                    *

కలలో నడచినట్లు నడిచి ఇల్లు చేరుకుంది సాకేత

గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకుంది

కోడలిని పలకరించేందుకు కొంచెం జంకు కలిగిన జానకమ్మ ఆ పనీ, ఈ పనీ చక్కబెడుతూ ఉండిపోయింది

సాకేత ఇంటి కప్పు వంక చూస్తూ ఎంతోసేపు అలాగే ఉండిపోయింది మనస్సు శూన్యమైనట్లూ, తన ఈ శరీరం తనది కానట్లూ అయో-మయంగా ఉండిపోయింది

మనస్సు ఆ స్థితిలో ఎంతోసేపు ఉండలేదు

మెదడుకు ఆలోచనలే ఆహారం అది లేకుండా మనస్సు లేదు మనస్సు లేకుండా మనిషి లేడు

మంచిగానీ, చెడుగానీ మనస్సు నిరంతరం ఆలోచిస్తూనే ఉంటుంది

సాకేత మెదడులో సన్నని కదలిక

ఎందుకిలా జరిగింది ?

ఇప్పుడు ఇప్పుడు తను చేయవలసిందేమిటి ?

ఈ పాపాన్ని తనెలా భరించగలదు ?

నిస్సహాయమైన కోపంతో ఆమె మనస్సు మండిపోయింది పెట్రోలు పోసి ఇంట్లో వారినీ, ఇంటినీ తగలపెట్టి, ఆ జ్వాలల్లో తానూ సజీవ దహనం కావాలనిపించింది

పదునైన కత్తితో ఇంట్లోని అందర్నీ నరికి ముక్కలు చెయ్యాలనీ, ఆపైన ఆ కత్తితో తనను తాను పొడుచుకుని ఈ యాతనలనుండీ, ఈ బాధల నుండీ విముక్తి చెందాలనిపించింది కానీ, ఏమీ చెయ్యలేని అశక్తతతో, నిర్జీవ ప్రతిమలా మంచం మీద పడి ఉంది

మరి ఏడ్చేందుకు కన్నీళ్ళు మిగలని కళ్ళు పొడారిపోయాయి లోకాన్ని చీకట్లు ఆవరించుకున్నాయి

అత్తగారు వచ్చి తలుపు తట్టింది "తీయలేదు " భోజనానికి రమ్మంటూ పిలిచింది బయట నుండే "పలకలేదు " సాకేతకు అత్తగారి ముఖం చూడాలంటేనే అసహ్యంగా ఉంది అసలు లోకంలో ఇలాంటి స్త్రీలు కూడా ఉంటారా ? చూస్తూ, చూస్తూ ఒక కన్నె జీవితాన్ని బలిపెట్టే స్వార్థం పతనానికి జారి అయినా సరే పరువు నిలుపుకునే అహంకారం ఎదుటి వారిని మాటలతో నే హత్య చేయగల పైశాచికత్వం పెళ్ళయిన ఒక్క సంవత్సరం ఏం ఊరుకుందో గొడ్రాలు గొడ్డుబోతు వంటి శబ్దాలతో తన హృదయాన్ని ముక్కలు చేసింది

ఒక స్త్రీ ఇంత దయలేని విధంగా ప్రవర్తించడం ఊహకే అందని సంగతి.

తనకూ ఒక ఆడపిల్ల ఉంది ' ఆమెకే తన స్థితి సంభవిస్తే ఏం చేసేది ? -

ఇన్నాళ్ళూ ఇలాంటి మనుషుల మధ్య తనెలా బ్రతికింది ?

ఈ చేదు నిజాన్ని భరిస్తూ, వాళ్ల ముఖాలు చూస్తూ ఎలా జీవిస్తుంది ?

జీవితమా ? ఇంకెక్కడి జీవితం ?

ఈ పాప ఫలాన్ని మోస్తూ తను బ్రతకలేదు .

తను తను చచ్చిపోతుంది కాని ' కాని ఇక్కడ కాదు తనను ప్రేమించే తన వాళ్ల మధ్య

తన చివరి శ్వాస తన వాళ్ల మధ్యే వదలాలి

వారి ఆప్యాయతలో కన్నీటిలో తన జీవితం ముగిసిపోవాలి సాకేత ఏదో నిశ్చయానికి వచ్చినట్లుగా నిశ్చింతంగా ఊపిరి తీసుకుంది

వంట గదిలో నుంచి గిన్నెల చప్పుళ్ళు



## ఎండమావులు

కంచి పట్టుచీర ధరించాలని కామాక్షి ఆరాటం
కాంచనా భరణాలంకృత కావాలని మీనాక్షి పోరాటం
అప్పు చెయ్యకుండా గొప్ప వరుణ్ణి తేవాలని వామాక్షి పితలాటం
అవమానం భరించలేక స్వగృహం నిర్మించుకోవాలని
ఏకాక్షి ఉబలాటం
ఒక టేమిటి?
డబుల్ కాట్, సీలింగ్ ఫాన్, రేడియో, టి. వి,
గ్యాస్ పొయ్యి, ప్రెషర్ కుక్కర్, ఫ్రిజ్,
వగైరా అన్నీ అమర్చుకోవాలని
మధ్య తరగతి మహిళా మండలి కుండే
మనో రథాలు పందెపు గుఱ్ఱాలై
పరుగెత్తి ఓడిపోతున్నాయ్
ఈ రిక లెత్తే వారి కోరికలు
ఎండమావులై పోతున్నాయ్

**—ఆకెళ్ల సుబ్బారావు**

## ఎదపీణ మ్రోగిన వేళ

మామగారు భోజనానికి వచ్చి ఉంటారు

ఈ ఇంట్లో ఆయన ఒక్కరే మనసున్న మనిషి

కోడలు భోంచేసిందా ?' భోజనానికి కూర్చుంటూ అడిగారు భార్యను

లేదు ముభావంగా అంది జానకమ్మ

ఆమె ముఖం కోపంతో చిటపట లాడిపోతోంది

అది అతనికి క్రొత్త కాదు ఆమె ముఖం ఎప్పుడో తప్ప ఎప్పుడూ అలాగే దర్శనమిస్తుంటుంది

భార్య స్వభావం అతనికి తెలుసు

ఆమె అహంకారం ఆమె మూర్ఖత స్వార్థం అతనికి క్రొత్త కాదు . అందుకే ఇంట్లో విషయాలనుండి సాధ్యమైనంత వరకూ తప్పించుకు తిరుగుతుంటారు ,

అమాయకంగా ఉండే సాకేత అంటే అతనికి అభిమానం

ఆమె దురదృష్టం పట్ల అమితమైన జాలి

ఆ పసిదాని పట్ల భార్య ప్రవర్తన కష్టం కలిగిస్తుంటుంది

ముగ్ధలా అమాయకంగా ఉండే ఆ పిల్లను చూస్తే ఎవరికైనా ప్రేమ, అభిమానం కలుగుతాయే తప్ప కావాలన్నా కఠినంగా ఉండటం సాధ్యం కాని విషయం

కానీ భార్య ?

కోడలి పట్ల తనకున్న జాలీ భార్య ముందు ప్రదర్శించడం మోహన్రావు-గారికి ఇష్టం ఉండదు దానివల్ల తాను ఆ పిల్లకు ఏమీ చేయలేకపోగా మరికొన్ని మాటలు అనిపించినవాడవుతాడు కానీ, ఈ సమయంలో అతనలా మౌనంగా ఉండలేకపోయాడు

'ఉదయం నుండీ ఏమీ తిన్నట్టు లేదు పిలవలేకపోయావా ? అన్నారు

"ఆఁ ఆమెకూ, మీకూ నేను జీతం ఇవ్వని దాసీదాన్ని ఆవిడగారు రాణీగారిలా మంచం ఎక్కితే వండి వార్చడం భోజనానికి ఒకటి నాలుగు-సార్లు పిలవడం విసురుకుంది జానకమ్మ

ఆ పూటకు వంట ఆవిడే చేసింది మరి

'మనం పొరపాటు చేశామేమో జానకీ

"ఏమిటి ?

మాధవ్‌కు పెళ్లి చేయడం

జానకమ్మ మౌనంగా ఉండిపోయింది

భర్త అలా అనడం ఆమెకు నచ్చలేదనే విషయం ఆమె ముఖం చూస్తేనే తెలుస్తోంది

ఆ పిల్ల నెమ్మది కాబట్టి ఇంత కాలమైనా మన గుట్టు గుట్టుగ్గా ఉంది

జానకమ్మ అయిష్టంగా ముఖం ముడుచుకుని ఊరుకుండిపోయింది

ఆ పిల్ల ఈ షాక్‌కు తట్టుకోలేకపోతోంది

మీచంతా చోద్యం అయిన వాళ్లకు ఆకుల్లోనూ కాని వాళ్లకు కంచాల్లోనూ అన్నట్లుంటుంది మీ ధోరణి ఇలాంటివి లోకంలో ఎన్ని జరగడం లేదు మన మొహాన్నే ప్రొద్దు పొడిచిందా ఏమిటి ?

ఆ పిల్ల నలుగుర్లోనూ పెడితే ?

ఏమీ పెట్టదు

ఆ పిల్ల ఏదైనా అఘాయిత్యం చేసుకున్నా ఇక అంతేనా ?

ఏమీ చేసుకోదు నాలుగు రోజులు పోతే అంతా సర్దుకుంటుంది మీరూరుకోండి

మోహన్రావుగారు చెయ్యి కడుక్కొని లేచారు అబోజనంగా ఉండి-పోయిన కోడలిపట్ల కనీస సానుభూతి కూడా చూపకుండా ఉండలేకపోయా-రాయన

వెళ్లి కోడలు పడుకున్న గది తలుపులు తట్టారు

సమాధానం రాలేదు

అమ్మా! సాకేతా అని పిలిచారు ఆప్యాయంగా

బదులు రాలేదు

అమ్మా! సాకేతా ఒక్కసారి తలుపు తీయమ్మా

అతని ఆప్యాయమైన పిలుపుకు కరిగిపోయింది సాకేత

కన్న తండ్రి ప్రేమ వినిపించింది ఆ పిలుపులో

కన్న తల్లి మమతలా తోచింది ఆ పిలుపు

కళ్లు చెమరించాయి

లేచి వెళ్లి తలుపు తీసి గుమ్మం ప్రక్కగా నించుంది

"అమ్మా! సాకేతా భోంచెయ్యమ్మా '

వద్దు మామయ్యా నాకు ఆకలిగాలేదు

"పెద్దవాణ్ని నా మాట వినమ్మా ముందు లేచి భోంచెయ్యి ఆ తరువాత ఏం చెయ్యాలో ప్రశాంతంగా ఆలోచించుకోవచ్చు మోహన్రావు-గారు తిరిగి వంట గదివైపు అడుగులు వేశారు

మంత్రముగ్ధలా అనుసరించింది సాకేత

తను పిలిచినప్పుడు భోజనానికి రాకుండా, మామగారి వెంట వంట-గదిలోకి వచ్చిన కోడల్ని చూస్తూనే మండిపోయింది జానకమ్మకు

విసురుగా లేచి అవతలకు వెళ్లిపోయింది

మామగారు స్వయంగా కంచం ఉంచి తనకు వడ్డిస్తుంటే సాకేతకు కన్నీళ్లు ఆగలేదు

కన్నీళ్ళతో పాటు రెండు ముద్దలు మింగింది

కడుపులో ఏదో కదలిక వికారం

గబగబా వాష్ బేసిన్ దగ్గరికెళ్లి భళ్ళున వాంతి చేసుకుంది సాకేత నోరు కడుక్కొని ఇటు తిరిగేసరికీ, ఆమె వంకే జాలిగా చూస్తూ నిలబడ్డారు మోహన్రావుగారు

'మామయ్యా ,

ఏమిటమ్మా ? సాకేత ఏదో చెప్పాలనుకునీ చెప్పలేకపోతోందని అర్ధం అయింది ఆయనకు

"నేను నేను

"చెప్పమ్మా

'నేను రేపు మా ఊరు వెళ్ళిపోతానండీ

'వెళ్ళిపోతాను అనడంలో మళ్ళీ రాను అనే అర్ధం వినిపించిందాయనకు

ఆయన అంతరాంతరాలలో ఆనందపు పొర కదలింది ఆయనకు తన ఇంటి పరువు ప్రతిష్టలు, గౌరవం ముఖ్యమే కానీ, అంతకంటే కూడా పరాయి తల్లి కన్న బిడ్డే అయినా సాకేత నిండు జీవితం ఇంకా ముఖ్యం ఆమె తన జీవితాన్ని పునర్నిర్మించుకోగలిగితే మనిషిగా అతను సంతోషిస్తాడు . నిండు హృదయంతో ఆశీర్వదిస్తాడు

"అలాగే నీ యిష్టం తల్లీ అన్నారు నెమ్మదిగా

సాకేత అక్కడ్నించీ వెళ్ళిపోయింది

కోడలు అక్కడ్నించి వెళ్ళిపోతూనే, వెళ్ళినంత విసురుగానూ ప్రవేశించింది జానకమ్మ

"ఏమిటి కోడలితో మంతనాలు ?

"ఛీ అసహ్యంగా మాట్లాడకు

చీదరించుకున్నారు మోహన్రావుగారు

"ఏమిటి పుట్టింటికి వెళ్ళిపోతానంటుందా

'ఆ

"మీరు ఒప్పుకున్నారా ?

ఆ

అసలు మీకేమయినా తెలివితేటలున్నాయా ? వద్దని చెప్పలేకపోయారా ?

"ఆ పిల్ల తన పుట్టింటికి వెడతానంటే ఆపడానికి మనం ఎవరం ?"

"ఇక అంతేనా? అత్తా మామా అనేది ఏమీ ఉండదా?'

"అన్నీ సవ్యంగా ఉన్న చోటే అలాంటివి ఉండట్లేదు ఇక ఇలాంటి పరిస్థితుల్లో చెప్పేదేముంది ?'

"ఊ ఈ తెలివి మాత్రం ఉంది " ఈసడించుకుంది జానకమ్మ తన అధికారాన్ని భరిస్తూ సకల సపర్యలూ జరిపే యంత్రం వెళ్ళిపోతానంటే ఆమెకు బాధగా ఉంది ఇలాంటి పరిస్థితుల్లో వెళ్ళిన కోడలు మళ్ళా సవ్యంగా వస్తుందా ? అనే అనుమానం కూడా ఉంది

విషయం విమలమ్మ చెవిని పడితే ఇక తన నోరు మూయించడం అసాధ్యం అనే ఆలోచన కూడా ఉంది

కానీ, కోడలిని పుట్టింటికి వెళ్ళకుండా ఎలా ఆపాలో మాత్రం తెలీలేదు

వారం రోజులుగా మాధవ్ షాపు దగ్గరే పడుకుంటున్నాడు.

ఇంట్లో జరిగే ఈ వ్యవహారం అతనికి చెప్పలేనంత న్యూన్యతాభావం కలిగించగా మనిషి రోజు రోజుకూ మానసికంగా కృంగిపోతున్నాడు అతనికి సాకేత అంటే చెప్పుకోదగిన అభిమానంగానీ, ప్రేమగానీ లేవు

అలాగని అయిష్టమూ లేదు

ఆరోగ్యవంతమైన శారీరక సంబంధాలు లేని భార్యా భర్తల అనుబంధాలకు పెద్దగా ప్రాధాన్యత ఉండదు

సాకేత- మాధవ్‌ల మధ్య పరిస్థితి కూడా అదే .

అతనికి సాకేత గర్భవతి అయినా అభ్యంతరం లేదు

పవిత్రత కోసం పడి చచ్చే స్త్రీ హృదయం అతనికి అర్ధం కాదు ఆలుమగల అనుబంధాలలోని మధురిమ అతనికి తెలియనట్లే, తన వల్ల అన్యాయమైపోయిన స్త్రీకి కనీస సానుభూతి అందించాలనే విషయం కూడా అతనికి తెలీదు

అలాంటి పరిస్థితి వచ్చినప్పుడు తప్పుకుపోయేందుకే ప్రయత్నిస్తుంటాడు మాధవ్ .

మూడు సంవత్సరాలుగా తానెరిగిన సాకేత వేరు

అపరకాళిగా తన మీద విరుచుకు పడిన సాకేత వేరు

ఆ రోజు భార్య ప్రవర్తన చూచిన మాధవ్‌కు ఆమె పట్ల దయ, సానుభూతి, కరుణ కలిగేందుకు మారుగా జంకు, బిడియం కలిగాయి అప్పటి నుండి అతను అవసరం ఉన్నా, భార్యతో మాట్లాడ్డం పూర్తిగా మానుకున్నాడు

అప్పటికే అంతంత మాత్రంగా ఉన్న భార్యాభర్తల సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి

*

మగతగా, బాధగా కళ్ళు విప్పింది సాకేత దాహం దాహం . అంతులేని దాహం బాధ వేదనా గుండెను పెకలించినట్లు . పిడికిటితో పెకలించినట్లు బాధ ఒళ్ళంతా సూదులతో పొడిచినట్లు సమ్మెటలతో బాదినట్లు బాధ తలంతా పోట్లు తల అదురుతూన్నట్లున్న వేదన .

కళ్ళ ముందు ఏవేవో గుర్తు తెలీని ఆకారాలు మసక మసకగా మసకబారిన ఆకారాలు దాహం సాకేత పెదవులు కదిలించింది కానీ శబ్దం మాత్రం రాలేదు

ఎండిపోతున్న పెదవులను నాలుకతో తడుపుకొంది రాధమ్మ గుడ్డ నీరు కక్కుకుంటూ, స్పూనుతో ఒక్కో చుక్కా నీళ్ళు పోస్తూ గొంత తడిపింది

కూతురిని ఆ స్థితిలో చూస్తున్న ఆమె మరీ నిగ్రహించుకోలేనట్లుగా గుండెలు పగిలేలా రోదించింది

ఆమెను ఓదార్చే వారు లేరు కారణం అందరూ ఆ సమయంలో అదే స్థితిలో ఉన్నారు

సాకేత మృత్యువుతో పోరాడుతూ, మూడు రోజులుగా హాస్పిటల్ బెడ్ మీద పడి ఉంది





## ఎదవీణ మ్రోగిన వేళ

సాకేత బలవంతంగా మరీ విచ్చుకుని చూసింది ,మూర్తీభవించిన శోక దేవతలా తల్లి

వేదనకూ బాధకూ ప్రతి రూపంలా తండ్రి

పసివాడిలా రోదిస్తూన్న తమ్ముడు సాగర్

అందరి కళ్ళల్లోని ప్రశ్నా ఒక్కటే

తల్లీ మీ బాధను పంచుకునేందుకు మేమంతా లెమనా ? ఎందుకిలా చేశావ్ ? మా గుండెల్లో చిచ్చు పెట్టాలని ఎందుకనుకున్నావ్? అ తరువాత ఆ తరువాత ఉన్నది ఎవరు ?

పోలిక దొరకని ఆ ఆకారం ఎవరిది ?

కళ్ళు గట్టిగా ఒకసారి మూసుకుని తిరిగి తెరిచి నిశితంగా పరిశీలించింది ఆ కాస్త కదలికకే మెదడు నరాలు తెగిపోతున్న బాధ తీవ్రమైన తలపోటు

ఎవరు శ్రీ శ్రీధర్ కాదూ

తలలోని రక్తనాళాలు అన్నీ ఒక్కసారి తెగిపోయినట్లుగా కళ్ల ముందు చీకట్లు అల్లుకున్నట్లుగా, శరీరం, మెదడు తేలికయిన అనుభూతితో మగతలోకి జారుకుంది సాకేత

చుట్టూ గాఢాంధకారం

ఆ గాఢ నిశీధిలో అంధకార బంధురమైన ఆ నిశీధి రాత్రిలో గమ్యం తెలీని ఒంటరి బాటసారిలా ప్రయాణిస్తుంది సాకేత చుట్టూ రాళ్ళూ రప్పలు తుప్పలూ కీకారణ్యంలో సంగీతంలా కీచురాళ్ళ కీచుగొంతులూ

దూరంగా ఏదో ప్రకాశమైన వెలుగు

రమ్యమైన ప్రకాశం రా రమ్మని పిలచే ప్రకాశం ఆ వెలుగులో ఎవరిదో రూపం ఆ రూపాన్ని పోల్చుకోడానికి చేసే ప్రయత్నంలో ఆ వెలుగుని చేరుకోడానికి చేసే ప్రయత్నంలో బాధనూ శ్రమనూ మరచిపోయి పరుగు తీస్తుంది సాకేత ఆ రూపం ఆ రూపం స్వామీజీది కాదూ అవును స్వామీజీయే రా రమ్మని పిలుస్తున్నారు రెండు చేతులూ సాచి

చిరు నవ్వుతో మృదువుగా పిలుస్తున్నారు స్వామీజీ పరుగు పరుగు పరుగు అంతు లేని పరుగు చుట్టూ కారు చీకటి కాళ్ళు గాలిలో తేలిపోతూ శరీరం తేలికయిన అనుభూతి

అగాధం తను అగాధంలో పడిపోతూంది కెవ్వు మంటూ గుండెలు పగిలేలా గావుకేక పెట్టింది సాకేత

రెండు బలమైన చేతుల మధ్య తన శరీరం

'హమ్మయ్య " తను పడిపోలేదు

"సత్యా

ఎవరు ? ఎవరు ?

ఎ - వ - రు ? శ్రీ శ్రీధర్ ఎందుకు ? ఎందుకీ రూపం తననిలా వెంటాడుతోంది ? కలలు కలవరింతలు కన్నీళ్ళు బాధ వేదనల మధ్య కళ్ళు తెరిచింది సాకేత

కన్నీళ్ళు చెంపల మీద నుండి కారిపోతున్నాయి

ఎదురుగా శ్రీధర్ శ్రీధర్ చేతుల్లో తను

"సత్యా ! ఎలా ఉంది ?' ప్రేమగా అడుగుతున్నాడు శ్రీధర్

సాకేతకు ఆశ్చర్యంగా వుంది

శ్రీధర్ ఎలా వచ్చాడిక్కడికి ?

తను తను చచ్చిపోలేదా ?

'సత్యా సత్యా, సత్యా ' ఆదరంగా పిలుస్తున్నాడు శ్రీధర్

**(ఇంకా ఉంది)**

# దరిద్రుడు

## బలివాడ కాంతారావు

తన ముప్పయ్యేళ్ల జీవితంలో అవమానం అంటూ యెరగని మంగపతికి, యీ సంఘటన భరించలేని అవమానమైంది హాయిగా దర్జాగా మూడు పడక గదుల బంగళాలో వున్నవాడు,' ఒక మధ్యాహ్నం హఠాత్తుగా ఒంటరిగా ప్రయాణం కట్టాడు తన స్వగ్రామానికి తన కడుపు జబ్బుకు మందిచ్చే ఆయుర్వేద వైద్యుడు వస్తున్నాడని తెలిసిన వెంటనే యీ ప్రయాణం స్టేషనుకు వెళ్లేసరికి మెయిలు మూడు గంటలు లేటు రైలు దిగేసరికి బస్సులేదు తినడానికి స్టేషను దగ్గర యేమీ లేదు స్టేషను దగ్గరలో నున్న దూరపు బంధువుల యింటికి వెళ్లి నోరు విడిచి భోజనం పెట్టమని అడిగాడు ఆ యిల్లాలు ఆ రాత్రి మీద కాస్త విసుక్కునే విధిలేక వండిపెట్టింది రాత్రి పండ్రెండుకు భోజనం అయినా, మంగపతికి నిద్దర పట్టలేదు ఎప్పుడు తెల్లారుతుంది యెప్పుడు వెళిపోతానని చూశాడు తెలతెలవారు తుండగనే ఆ మాసిన గడ్డం, బట్టలతో దువ్వని యెగురుతున్న జుత్తుతో స్టేషనువేపు వెళ్లాడు వేసవి ఉదయం యెండ చుర్రుమంటున్నా తన వూరు వెళ్లే బస్సు జాడ యింకా తెలియలేదు బస్సు స్టాండుకు దక్షిణ వేపున రైలు స్టేషను ప్రక్కనే ఒక ఓవర్ బ్రిడ్జివుంది ఉత్తరానికి ఒక శివాలయం ఈ ఓవర్ బ్రిడ్జి ప్రక్కన నీడగా వుందని పతి అక్కడ కూర్చున్నాడు తనకు యెదురుగా బ్రిడ్జికి రెండోప్రక్కన యింకో వ్యక్తి కూర్చున్నాడు చిరిగిన నిక్కరు బనియానుతో బక్కచిక్కివున్నాడు ఉండీ ఉండీ దగ్గుతున్నాడు దరిద్రం అంటుకుని అసహ్యంగా వున్నాడు పతి దృష్టి అంతా వాడిమీద వుండటం మూలాన యెవరెవరు ఓవర్‌బ్రిడ్జిమీద పోతున్నారో పట్టింపుగా చూడటంలేదు ఇంతలో యీ భరించరాని అవమానం జరిగిపోయింది అవమానించిన వాడెవడో సరిగ్గా చూడలేదు తనూ యెదరగా వున్న వాడిలా అడుక్కునే వాడనుకుని యెవడో తన ముందూ ఒక నాణాన్ని పడేసాడు ఇంతవరకూ తనో నల మహారాజుననుకున్న పతికి, అడవుల పాలయినంత బాధ కలిగింది

ఇచ్చు అర్ధరూపాయి అది పట్టుకుని తనవేపు చూసుకున్నాడు తెల్లని కళీ లాల్చీ బాగా మాసిపోయి వుంది కాళ్లలో అరిగిన చెప్పులు లేచి అటువేపు వెళ్లి ఆ అసలు అడుక్కునే వానితో

ఈ అర్ధరూపాయి నామీద విసిరిన వాడెవడో నీకు తెలుసా?'

'తెలుసు ధర్మం చెయ్యటం అంటే అతనికి మోజు!

దరిద్ర గొట్టు వెదవ! మోజైతే నీలాంటి ముష్టి వాళ్లకి వెయ్యలేక పోయాడా?'

అయ్యా! తమరు తమ నెలవు కానిచోట కూర్చున్నారు

ఐనా నేను అడుక్కున్న వాడిలా కనిపిస్తున్నానురా?

నా కంటికి కనిపించలేదు కానీ అతని కంటికి యెలా కనిపించారో?

కష్టార్జితమైతే యిలా చేస్తాడా?

నన్నేం చెయ్యమంటారు?

ఒక పని చేస్తావా?

చెప్పండి

'ఇదిగో - యీ అర్ధరూపాయి వాడి ముఖాన్న పారేసి నా బదులు నాలుగు చీవాట్లు పెట్టు

ఈ దరిద్రుడు చెయ్యిచాపాడు ఆ అర్ధరూపాయి వాడి చేతిలో పడేసి నీ పేరు

నీలాచలం

'నీలాచలం! తప్పకయీ పని చేస్తావా?

"నమ్మకం లేకపోతే మీరే రండి

బస్సు వచ్చే టైమయ్యింది నేను అర్జంటుగా వెళ్లాలి

ఈ అర్ధ రూపాయి అతని మీద విసరి యేం చెయ్యమంటారు?

క్షమాపణ చెప్పమను

దానికి అతను వుత్తరం రాయాలి కదా! తమ యెడ్రసు యివ్వండి

పతి అక్కడే దొరికిన ఒక చిత్తు కాగితం మీద అలా దారిపోయే వాని దగ్గర పెన్ను తీసుకుని యింగ్లీషులో తన యెడ్రసు రాసి యిచ్చాడు నీలాచలం ఆ కాగితం అందుకోగానే గట్టిగా యెడ్రసు చదివి-

మంచి హోదాలో వున్నవారే మీరు అన్నాడు

ఇంగ్లీషు చదువుకున్న వాడివి అడుక్కుంటున్నా-



వేం సిగ్గు పడటం లేదా? మందలించినట్లు మంగపతి అన్నాడు

చలం అలా కళ్లప్పు చెప్పి చూసాడు ఆ చూపుల వెనుక తొలిసారి ఒక ఆలోచన పుట్టింది

అయ్యా! మీ రెవరో గానీ మీ పని నాచేత చెయ్యించుకోడానికి మంచి సలహా యిచ్చారు నాదో చిన్న మనవి మీకు అవమానం చేసినవాడు తక్కువ-వాడు కాడు పేరూ పరపతీ వున్నవాడు వాడిని నేను వంచాలంటే వాడికి మీ బదులు నేను అవమాన పర్చాలి దీనికి మీరు నా కిచ్చే పారితో షికం యెంత?

"దీని కెందుకు పారితో షికం?

పాతిక రూపాయలతో మొదలైన బేరం చివరకు ఒక రూపాయికి దిగింది ఆ రూపాయైనా పతి చలం మీద విసుక్కుంటూ విసిరేసి బస్సు వచ్చిందని పరుగెత్తాడు

వారం రోజుల తరవాత గ్రామంనించి తిరిగి వెళిపోతూ మంగపతి, నీలాచలం ఆ జాగాలో వుంటాడేమోనని చూశాడు లేడు బహుశః యీసరికి ఇంటికి ఉత్తరం వచ్చి వుంటుందేమోనని అను-కుంటే యింట్లో యింకెన్నో వుత్తరాలున్నయ్‌గానీ తను యెదురు చూచిన వుత్తరంలేదు నెలరోజులు గడిచినా యే వుత్తరం లేకపోవటంతో మోసపోయా-నని యిదో అవమానంగా తీసుకున్నాడు ఒక అవమానం బరువు మోయలేక వుపాయం ఆలోచించి యిప్పుడు రెండు అవమానాల బరువుతో సతమత మవుతున్నాడు మండిపోతున్న మనసుతో పీడపడిన మనిషిగా కదులుతున్నాడు ఆరునెలల' నాటికైనా నీలాచలం జాడగానీ, ఉత్తరంగానీ లేదు

అర్ధాంతరంలో వచ్చిన అంగవైకల్యంలా యీ సంఘటనలు అతని మనసులో పదేళ్లయినా నిల్చిపోయాయి ఈ బెదురు నించి బయటపడలేదు

ఉద్యోగరీత్యా మద్రాసు ఒకసారి వెళ్లాడు పిల్లలు, భార్యా యేవో సామాన్లు కొనమన్నారని ఒక సాయంత్రం పారీస్ కార్నర్‌లోని పేవుమెంటు షాపులకు వెళ్లాడు ఎక్కడా సరిగ్గా బేరం కుదరటం లేదు సింగపూర్ సామాన్లన్నీ వున్నయ్ ఏవి అసలు సరుకో యేవి నకిలీవో చెప్పటం సాధ్యం కాదు అందరూ మోసగాళ్లలాగే తన దృష్టికి కనిపించడం-చేత యే వస్తువునైనా సగానికి సగం యిస్తానంటు-న్నాడు దీపాలు వెలిగించినా తన కొడుకు చెప్పిన కాలిక్యులేటర్ కొనలేక పోయాడు అలా వెళ్తూ ఒక పేవ్‌మెంటును ఆనుకుని వున్న బడ్డీ షాపు యెదర ఆగి ఆ సైంటిఫిక్ కేలిక్యులేటర్ విలువెంత "అని అడిగాడు ఆ షాపువాడు-

రెండువందల డబ్బయి అన్నాడు

నూటయేభయి కిస్తావా? బేరమాడాడు పతి

ఆ షాపువాడు యెగాదిగా చూసి ఆ కాలిక్యులేటర్ మంగపతి చేత పెట్టూ-

'ఊరకేతీసుకోండి అన్నాడు

ఊరకే తీసుకోడానికి నేను దరిద్రుడననుకున్నావా? అని తీక్షణంగా అడిగాడు మంగపతి

## నిశీధిలో....

నల్ల బజారు
నడి రోడ్డులో
నల్ల నోటు
నకిలీ సరుకు
చేయి మార్చుకుని
చెరో గమ్యం చేరుతున్న వేళ
నిశీధి అంచుల్ని చీలుస్తూ
కచేరిలో మోగిన గంటలకి
కళ్ళిప్పిన గూర్కా వాలా
కార్ఖానా చుట్టూ తిరుగుతున్నవేళ
అక్రమాన్ని చాటుతూ
కుక్కలు అరిచినా బాగుణ్ను
ఆ చూకీ తెల్పుతూ
చుక్కలు మెరిసినా బాగుణ్ను

తమ్మిశెట్టి రామారావు

# దరిద్రులు

పరపతి వున్న మనిషి యేమన్నాడంటే అంటూ చప్పున మెడలో లాకెట్ తీసి చూపించాడు షాపువాడు'

మంగపతి మిడిగుడ్లకు చలం మెడలోని బంగారు గొలుసుకు లాకెట్‌లా వున్న అర్ధరూపాయి కనిపిం-చింది

ఇదిగో! ఆనాడు మీరు యీలక్కి అర్ధరూపాయి యివ్వకపోతే, యీనాటికీ అడుక్కుంటూ వుండే వాడిని రండి లోపలకి రండి

సంశయిస్తున్న మంగపతితో

నేను కోపంతో వూరకనే తీసుకోమనలేదు మిమ్మల్ని పోల్చగానే మీ అబ్బాయి చదువు సాగడానికి ఇది వుపయోగ పడుతుందని యిచ్చాను ఇదంతా మీ చలవకదా! అలా సంశయిస్తారేం ఎలా యింత-వాడిన య్యానో తెలుసుకోడానికైనా లోనికి రండి

కొట్టు వెనుకనే చిన్న జాగాలో ఒక టేబిలు, నాలుగు కుర్చీలు – చిన్న టేబిలు ఫేను తిరుగు-తోంది 'థమ్సప్' బోటిల్స్ రెండు తీసి విప్పాడు ఎదరెదరగా కూర్చున్నారు చలం మొదలు పెట్టాడు

మనిద్దరం తొలిసారి కలుసుకున్నప్పుడు యిద్దరి పరిస్థితి ఒక్కలానే వుంది కదా '

అంటే?'

మీరు హోదాలో వున్నా మీ కెవరూ అవమానించ-లేదు నేను అడుక్కుంటున్నా అప్పటివరకూ నన్నె-వరూ అవమానించలేదు మీకు ఆ కోదండరామయ్య అవమానిస్తే, మీరు నన్ను అవమానించారు

నేనా?

అవును ఇంగ్లీషు చదువుకుని అడుక్కుంటు-న్నావు సిగ్గులేదా అన్న మీ మాటలను అవమానంగా తీసుకున్నాను అవమానాన్ని అవకాశంగా వినియో-గించుకోవాలని ఆ క్షణంలోనే నిశ్చయించాను

నిశ్చయించి నమ్మకద్రోహం చేశావు కదా!

'లేదు అదేం చెయ్యలేదు తొలిసారి చదువువలన వచ్చిన తెలివితేటలు ఉపయోగించాను ఆ రోజే కోదండ రామయ్య యింటికి వెళ్లాను 'బాబూ ఒక రహస్యం' అన్నాను అనగానే తన గదిలోనికే తీసుక-పోయాడు బాబూ తమరు యెవరికి ధర్మం చెయ్యాలో యెవరికి చెయ్యకూడదో ఆలోచించరా అన్నాను ఏమైందిరా అన్నాడు యిచ్చు అర్ధ రూపాయి చూపించి 'మీరీ వుదయం ఒక సి ఐ డి ఆఫీసరు మీద ధర్మంగా యీ నాణెం విసిరారు అతగాడు నామీద విసురుతూ మీ అంతు చూస్తానన్నాడు మీకీ భాగ్య భోగాలెలా వచ్చాయో కూపీతీసి తగిన చర్య 'తీసుకుం'టానన్నాడు మీ ఉప్పు తిన్న వాడిని జాగర్త పడండి' అన్నాను

కోదండరామయ్య భయపడ్డాడా? అడిగాడు మంగపతి

కాసేపు ఆలోచించి – యీ పని చెయ్యడానికి వాడి దగ్గర యెంత పుచ్చుకున్నావో చెప్పితే దానికి వంద-రెట్లు నేనిస్తాను నిజం చెప్పు అన్నాడు

'అబద్ధం అని ఎలా పోల్చుకున్నాడు?

ఎలా పోల్చుకున్నాడో తరవాత చెప్పాడు ఎందరినో యిలానే బ్లాక్‌మెయిల్‌చేసి తనూ పెద్ద-వాడయ్యాడట ఆ చేతులు మర్చి పోడానికే చేతనున్న సంపదను బీదాబిక్కి మీద విసురుతున్నాడట "

ఎంత యిచ్చానని చెప్పావు? వందని చెప్పి వుంటావ్'

లేదు అలా చెప్పివుంటే ఒక చెంప పెట్టు పెట్టే-వాడు ఉన్నమాట చెప్పాను బేరం ఆడి ఆడి ఒక రూపాయి మీద పారేసి ఇంకో అవమానం అంటిం-చాడని చెప్పాను నీలాంటి నిజాయితీ గల మనిషి బాధపడ కూడదని వ్యాపారం కిటుకులు చెప్పి, పెట్టు-బడికి సరిపడ్డ డబ్బిచ్చాడు

అంటూ లేచి ఆ కాలిక్యులేటర్ తెచ్చి మంగపతి యెదురుగా పెట్టూ 'మీ అబ్బాయికి కానుక' అన్నాడు

నేను రూపాయి దీనికోసం యివ్వలేదు కోదండ రామయ్యచేత క్షమాపణ వుత్తరం రాయిస్తావని యిచ్చాను

అప్పుడే రాయమని కోరితే నామీద విరుచుక పడ్డాడు

ఏమని?

ఆ దరిద్రుడికెవడు రాస్తాడని

మంగపతి కాస్సేపు అలా నిల్చొనే వణికిపోయాడు జేబులో రెండు వందల డబ్బయ్యేదు రూపాయలు తీసి టేబిలు మీదపెట్టి, కాలిక్యులేటర్ తీసుకుని వెళ్లిపోయాడు □

# సాగర్ స్కిమ్ మిల్క్‌తో ఆతిధ్యం

మీ యింటికెవరైనా రాగానే, గడపతొక్కి లోపలికి రాగానే, మీ అతిధులకి మీరు చేసే సత్కారం ఏమిటి? ఓ చిరునవ్వు, ఓ కప్పు టీ—అవునా? మరి పరంపరాగతంగా వస్తున్నదది—మీ సంప్రదాయం, సంస్కృతి, ఆదరణ-వేటి చక్కని పరిణామ స్వరూపం.

మరి వాళ్లొచ్చేసరికల్లా మీ యింట్లో పాలు అయిపోయాయనుకోండి. మీకెలాగో యిబ్బందిగా అనిపించదూ? ఇక అప్పడి కప్పుడు ఉన్న పళంగా పాలు రమ్మంటే ఎలా వస్తాయి గనక?

సాగర్ స్కిమ్ మిల్క్ పౌడర్, మరి మీ అమ్మగారి, అమ్మమ్మగారి నుంచీ తరతరాలుగా వస్తున్న ఆ చక్కని సంప్రదాయాన్ని నిలబెడుతుందిక. అది గూడా పొదుపుగా, త్వరగా, తేలికగా. ఇక తీపి పదార్థాలూ, పుడ్డింగులూ అవీ చేసుకోవడానికి యిదెందో బాగుంటుంది.

# సాగర్
## స్కిమ్ మిల్క్ పౌడర్

పాలలోని మంచిదనాన్నంతా యిస్తుంది, కొవ్వు పదార్థాలు లేకుండానే.




ASP/SMP/5/84



మార్కెట్ చేసేవారు:
గుజరాత్ కోపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్
పోస్ట్ బాక్స్ 10, ఆనంద్ 388 001. గుజరాత్.

ధారావాహిక

# దేదీప్య

## కంచుమర్తి వెంకటేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

పది రోజులుండి తిరిగి వైజాగ్ వచ్చేసాను చదువులో పడ్డాను వారాని కొక లెటరు వచ్చేది అన్నయ్య దగ్గర నుండి రోజులు అలాగే గడుస్తు-న్నాయి

ఫైనలియర్‌లో ఉంటుండగా అన్నయ్య దగ్గర నుండి లెటరు వచ్చింది వదినకు నెలలు నిండాయని నేను హైదరాబాదు పరుగెత్తాను అప్పటికే అక్కడకు అక్క వచ్చింది

వదిన గదిలో నొప్పులు పడుతుంది

గది బయట అన్నయ్య, నేను పిచ్చెక్కినట్టు పచార్లు చేసాం

ఆ సమయంలో తనొక డాక్టరనే విషయం కూడా మరచి పోయాడు అన్నయ్య బేలగా వాపోతున్న అన్నయ్యను ఓదార్చడానికి ప్రయత్నించాను

డాక్టర్ పిల్లలు లేకపోయినా ఫరవాలేదు కానీ అవంతి నాకు కావాలి అవంతికేం ప్రమాదం జరగకుండా జాగ్రత్తగా చూడండి

అన్నాడు అన్నయ్య బయటకు వచ్చిన లేడీ డాక్టరుతో

అన్నయ్యా ! వదిన క్షేమంగా ఉంటుంది ప్రసవ సమయంలో ఆడవాళ్ళకు ఆ మాత్రం బాధ ఉంటుంది

ఏం చెప్పాలో తెలియలేదు నాకు

అన్నయ్యకు తెలియక కాదు అవంతంటే అన్నయ్య కంత ప్రాణం

గదిలోంచి వదిన అరుపులు ఆగిపోయాయి

పసిపిల్ల ఏడుపు వినిపించింది

మా ఇద్దరి ముఖంలో ఆనందం

డాక్టరు బయటకు వచ్చింది

ప్రమోద్ మీకు అమ్మాయి పుట్టింది కానీ

అని మాట పూర్తి చేయకుండా మళ్ళీ లోపలకు వెళ్ళిపోయింది

అన్నయ్య, నేను లోపలకు వెళ్ళాం

ఎదురుగా కనబడిన దృశ్యానికి కొయ్యబారి-పోయాం ఇద్దరం

వదిన వదిన

అని ఆగిపోయాడు శివప్రసాద్

అతని కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి

ఏమైంది తర్వాత చెప్పండి

కంగారుగా అడిగింది దేదీప్య

చాలా సేపటి వరకు మాట్లాడలేదు శివప్రసాద్

ప్లీజ్ చెప్పండి

గదిలోకి వెళ్ళగానే అంతవరకూ పాప పుట్టిందన్న ఆనందం అంతా ఎగిరి పోయింది

అయాం సారీ డాక్టర్ ప్రమోద్ చాలాసేపు ప్రయత్నించాం బిడ్డను బ్రతికించగలిగేం గాని తల్లిని రక్షించలేకపోయాం

అన్నారు డాక్టర్

నో నో అక్క చనిపోవడానికి వీల్లేదు

అని గట్టిగా అరచింది దేదీప్య

ఆగిపోయాడు శివప్రసాద్

'దేదీప్యా

అక్క చనిపోయిందా నేను నమ్మను నమ్మను

**జరిగిన కథ - 12 : సుస్మిత వాళ్ళ ఊరిలో సరళ భర్త రాఘవను కలిసింది దేదీప్య. సరళ రాఘవల సంసారం కుదుట పడింది. దేదీప్య తన అక్క ఫోటో శివ-ప్రసాద్ ఇంట్లో, ఆల్బమ్‌లో చూసింది. శిరీష తన అక్క కూతురే అని తెలుసు-కుంది. శివప్రసాద్ తన కుటుంబ గాథను దేదీప్యతో చెప్పడం ప్రారంభించాడు.**

`దేదీప్యకు ఏడుపు ఆగడంలేదు ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి

దేదీప్యా

దేదీప్యను గుండెల కదుముకున్నాడు అతని గుండెలమీద తల ఆనించి తనివితీరా ఏడ్చింది అలాగే పొదివి పట్టుకున్నాడే గాని నోటంట మాటలు రావడంలేదు శివప్రసాద్‌కు

దేదీప్యా

దేదీప్య ఏడుపు ఆపలేదు

దేదీప్యా అందుకే గతం గుండెల్లో దాచుకుని బాధ పడుతున్నాను నీ కెలా చెప్పాలో తెలియక, చెప్పితే నువ్వు బాధను భరించలేవని ఇన్నాళ్ళూ చెప్పకుండా నాలో నేనే కుమిలి పోతున్నాను

తర్వాత మరి మాట్లాడలేదు శివప్రసాద్

చాలాసేపటి వరకు తేరుకోలేదు దేదీప్య

దేదీప్య కళ్ళు ఎర్రబడ్డాయి

* * *

### 39

వదిన చనిపోయిందన్న నిజం అన్నయ్యను కలచి వేసింది

తను ప్రేమించి పెళ్ళి చేసుకున్న అవంతి తన కోసం తల్లి తండ్రులకు దూరమై వచ్చిన అవంతి చనిపోయింది

పదే పదే అలా అనుకుని పిచ్చివాడిలా ఏడ్చేసాడు అన్నయ్య

అచ్చు గుద్దినట్టు వదిన పోలికలు పాపలో స్పష్ట-మయ్యాయి

నెల రోజుల వరకు అన్నయ్య ఆ షాక్ నుండి తేరు-కోలేదు

డాక్టర్ శ్యామలరావు దంపతులు అన్నయ్యను ఓదార్చేవారు

శివప్రసాద్ నీకు పరీక్షలు దగ్గర కొస్తున్నాయి నువ్వెళ్ళు అన్నయ్యను మేము చూసుకుంటాం

అని బలవంతంగా నన్ను వైజాగ్ పంపించారు

పరీక్షలు దగ్గర పడడంతో చదువులో పడ్డాను

పరీక్ష లయింతర్వాత హైదరాబాదు వెళ్ళాను అన్నయ్యను వైజాగ్ వచ్చేయమన్నాను

వద్దు శివడూ ఆ ఊరు వెళ్ళితే నా మనసు మరింత క్షోభిస్తుంది అవంతిని తల్లి తండ్రుల నుండి దూరం చేసాను ఇప్పుడు ఈ లోకం నుంచే పంపించేసాను ఏముఖం పెట్టుకుని రాగలను పాప పుట్టింతర్వాత అమ్మా నాన్న దగ్గరకు వెళదాం అన్న అవంతి ఈరోజు చచ్చిపోయిందని వెళ్ళి చెప్పాలా కూతురు దూరమైందని ఇప్పటికే ఆ తల్లి తండ్రులు ఎంత బాధ పడుతున్నారో గ్రహించగలను ఆ బాధకు తోడుగా ఈ విషయం చెప్పి మరింత క్షోభ కలిగించే-కంటే అవంతి ఎక్కడో క్షేమంగా బ్రతికే ఉందనే ఆశలో ఉంచడమే మంచిది ఇలా జరుగుతుందంటే పెళ్ళవగానే వెళ్ళి కనబడి క్షమాపణ కోరేవాడిని

ఇప్పుడెలా చెప్పాలి చెప్పితే నన్ను అసలు క్షమించరు ఈ విషయం ఎవరికి తెలియకూడదు అన్నాడు అన్నయ్య

చివరగా ఒక మాట అన్నాడు

శివుడూ నా కొక సహాయం చేస్తావా

ఏంటన్నయ్యా

పాపను నీ దగ్గరే పెంచు ఇక్కడ పాప ఉంటే పాపను చూసినప్పుడల్లా అవంతే గుర్తుకు వచ్చి ఆ జ్ఞాపకాలు నన్ను పిచ్చివాడిని చేస్తున్నాయి అవంతి జ్ఞాపకాలకు దూరంగా ఉండాలంటే పాప నా దగ్గర ఉండకూడదు

అన్నయ్య మాటలకు ఆశ్చర్యపోయాను

డాక్టర్ శ్యామలరావు అన్నయ్యతో ఒక విషయం చెప్పారు

ప్రమోద్ అయిందేదో అయిపోయింది అవంతి మనకు దక్కదు మళ్ళీ అవంతి తల్లి తండ్రులకు నెమ్మదిగా ఈ విషయం చెబుదాం ప్రస్తుతం పాప సంగతి ఆలోచించు శివుడు దగ్గరకు తీసుకెళ్ళమని చెబుతున్నావు శివుడు చిన్నవాడు ఈ విషయంలో వాడిమీద అంత పెద్ద బరువు ఉంచడం బావ్యం కాదు పాప పోషణకు, నీ గురించి చూడ్డానికి ఇప్పుడు ఒక మనిషి కావాలి పాపకు అమ్మ కావాలి నిన్ను ఓదార్చడానికి నీ బాధల్లో సగం పాలు పంచుకో- డానికి ఇల్లాలు కావాలి అందుచేత నువ్వు మళ్ళీ పెళ్ళి చేసుకో

డాక్టర్ శ్యామలరావుగారి మాటలు వినిపించుకో- లేదు అన్నయ్య

అవంతిని ప్రేమించాను నా మనసును, నాలోని ప్రేమంతా అవంతికే ఇచ్చేసాను ఇప్పుడు మరొక అమ్మాయిని ప్రేమించలేను – పెళ్ళి చేసుకోలేను నా అవంతిని మరువలేను

ఖచ్చితంగా చెప్పేసాడు అన్నయ్య

వదినంటే అంత ప్రేమ అన్నయ్యకు

అన్నయ్య మాటను కాదనలేక పాపను నేను పెంచా లని నిర్ణయించుకున్నాను వైజాగ్ వచ్చేసాను పాప సంరక్షణకు ఆయాను పెట్టాను

ఎం కాం పాసవ్వడం, బాంకు టెస్టులో సెలక్టవడం, పి వో గా ఉద్యోగం రావడం జరిగి- పోయాయి వెంట వెంటనే

తర్వాత అన్నయ్యకు పారెన్ ఛాన్సు రావడంతో అవంతి జ్ఞాపకాలకు కొంతకాలం దూరంగా ఉంటానని చెప్పి వెళ్ళిపోయాడు

పాపకు శిరీష అనే పేరు పెట్టాను

పాపకు పేరు పెట్టిన రోజున అక్క, డాక్టర్ శ్యామలరావుగారి దంపతులు, శిల్ప అందరూ వచ్చారు శిల్ప అప్పటికి ఇంటర్మీడియట్ చదువు- తుంది శిల్పను నా కిచ్చి పెళ్ళి చేయాలని మొదటి- నుండి అనుకునేవారు కానీ నాకు ఇష్టంలేదు శిల్పకు కూడా ఆ సమయంలో పెళ్ళంటే భయం మెడిసిన్ చదువుతానని చెప్పడం ఇద్దరం హాయిగా నిట్టూర్చాం

ఊహ తెలిసినప్పటినుండి నన్ను శిరీష 'డాడీ అని పిలిచేది డాడీ ఆ పిలుపుకు పొంగిపోయాను నేను శిరీషకు డాడీని

శిరీష బుల్లి బుల్లి నడకలు ముద్దు ముద్దు మాటలు నా కెంతో సంతోషాన్ని, ఆనందాన్ని కలిగిం- చేవి ఆఫీసు నుండి రాగానే శిరీషతో నే నా లోకం నా చేత్తో పెడితేనే ఏదైనా తినేది నేను ప్రక్కన ఉంటేనే పడుకునేది నేను ఆఫీసు నుండి వచ్చే వరకు ఆయా దగ్గర బుద్ధిగా ఉండేది అల్లరి చేసేది కాదు

శిరీషకు తల్లిని, తండ్రిని నేనే

దగ్గర వాళ్ళకు తప్ప ఇంకెవరికీ తెలియదు ఈ నిజం శిరీష నా కూతురే అనుకుంటుంది లోకం నాకూ అదే కావాలి శిరీష నా కూతురు

తర్వాత శిరీషను కాన్వెంటులో చేర్పించిన రోజున నిన్ను చూసాను శిరీషను నీ ద్వారా నీ కుటుంబం దగ్గరకు చేర్చాలని, అవంతి ప్రస్తావన నెమ్మది నెమ్మదిగా తెలియజేయాలని ఆరాటపడి నిన్ను ఎలా- గైనా నా దగ్గరకు తీసుకోవాలని నిర్ణయించుకుని టీచరుగా ఇంటికి వచ్చేలా చూడమని హెడ్ మిస్ట్రెస్ గారికి చెప్పాను నా ప్లాను బాగా సక్సెస్ అయింది

దేదీప్యా ఇదీ జరిగింది ! మీ అక్కను మీనుండి దూరం చేసినందుకు మమ్మల్ని క్షమించు

నేను శిరీష తండ్రిని మామీద కోపం లేకపోతే నా శిరీషకు తల్లివి కాగలవా అని ఆగిపోయాడు శివ- ప్రసాద్

అక్క చనిపోయింది

ఆ తలపే భయంకరంగా ఉంది

కన్నీటితో శివప్రసాద్‌ను చూసింది దేదీప్య



శివప్రసాద్ దేదీప్య కన్నీటిని తుడిచి హృదయానికి హత్తుకున్నాడు

*  *  *

**40**

అక్క చనిపోయిందన్న విషయం తెలిసినప్పటి-నుండి దేదీప్య మనసు మనసులో లేదు. ఎప్పటికైనా అక్క వస్తుందని ఆశతో ఎదురు చూస్తున్న అమ్మా నాన్నల ముఖం చూడలేకపోతుంది

ఈ విషయం ఎలా చెప్పాలి?

విని భరించగలరా

భరించలేరు

ఈ నిజం తనలో నే ఉండి పోవాలి

భగవాన్ ఎంతటి శిక్ష విధించావు అనుకుంది బాధగా

రెండ్రోజుల వరకు స్కూలుకు వెళ్ళలేదు

ఒకటే ఆలోచనలు

శిరీషకు తల్లివి కాగలవా

శివప్రసాద్ ప్రశ్న గుండెల్లో రొద చేసింది

అతను తనను ప్రేమిస్తున్నాడు

తను అతన్ని ప్రేమిస్తుంది

శిరీష అక్క కూతురు

తల్లిలేని లోటును తీర్చాలి

శిరీషను ఒకసారి ఇంటికి తీసుకురావాలి

శిరీషను చూడగానే అమ్మా, నాన్నల్లో ఎటువంటి భావాలు కలుగుతాయో గ్రహించాలి అక్క చనిపోయిందన్న నిజం వాళ్ళకు నెమ్మదిగా తెలియా-లంటే, అక్కను మరచి మామూలు మనుషులవ్వా-లంటే శిరీష అమ్మా, నాన్న దగ్గరకు చేరువవ్వాలి

మన వరాలను చూడగానే వాళ్ళ హృదయాలు

## ఆవు – అల్లుడు

నా భార్య  
రోజుకి మూడుశేర్లు పాలిచ్చే  
జర్సీ ఆవును ఐదువేలకు కొంటే  
నేను  
నెలకి నాలుగొందలు సంపాదించే  
అల్లుణ్ణి పదివేలకి కొన్నందుకు  
విచారిస్తున్నా!

–మోదు రాజేశ్వరరావు (కుసుమ)

# దేదీప్య

సంతోషంతో నిండి పోవాలి

ఒక నిర్ణయానికి వచ్చింది దేదీప్య

*  *  *

దేదీప్య తన నిర్ణయం చెప్పగానే శివప్రసాద్ సంతోషంతో ఎగిరి గంతేసినంత పని చేశాడు ఆశ్చ-ర్యం నిండిన కళ్ళతో దేదీప్యను చూసాడు

గులాబీ రంగు చీరలో రతీదేవిలా ఎదురుగా నవ్వుల పువ్వులు వెదజల్లుతూ నిలిబడి ఉంది దేదీప్య

ఆ చీర కొన్న సంఘటన గుర్తుకు వచ్చింది శివ-ప్రసాద్‌కు

దేదీప్యా

శివప్రసాద్ దేదీప్యను కౌగలిలో బంధించి ఉక్కిరి బిక్కిరి చేసాడు

దేదీప్య అతని కౌగలిలో ఇమిడిపోయింది

దేదీప్య శరీరంలోని అణువణువు పులకరించింది

డాడీ

అంటూ శిరీష రావడంతో దూరంగా జరిగింది దేదీప్య

డాడీ షికారుకు వెళ్దాం', అని దేదీప్యను చూసి టీచర్ మీరూ వస్తారా అంది

దేదీప్య శిరీషను ఎత్తుకుంది

శిరీషా ఒక గుడ్ న్యూస్ చెబుతాను నాకేమి-టిస్తావు

అన్నాడు శివప్రసాద్

గుడ్‌న్యూస్ చెప్పితే ఒక ముద్దు ఇస్తాను

అయితే చెప్పను

చెప్పుడాడీ రెండు ముద్దులిస్తాను చాక్-లెట్లు ఇస్తాను

శిరీష మాటలకు శివప్రసాద్ నవ్వుతూ దేదీప్య చేతుల్లోంచి తీసుకుని ముద్దులు కురిపించాడు

శిరీషా రేపటినుండి టీచర్ నీకు టీచరే కాదు మమ్మీ కూడా

మమ్మీ

ఆ పదం కొత్తగా, వింతగా ఉంది శిరీషకు

ఆ పదం ఎప్పుడూ ఆ చిన్నారి నోటినుండి రాలేదు

డాడీ అనేపదం తప్ప

మరి అందరి దగ్గర మమ్మి, డాడీ ఉంటారు నాకు మమ్మీలేదు నువ్వే చెప్పావు మమ్మి ఎక్కడ ఉందో చెప్పలేదు ఈ మమ్మి ఎప్పుడు వచ్చింది టీచర్ కదా

ఆ చిన్నారి మనసుకు అర్ధమయ్యేలా ఎలా చెప్పాలి?

శివప్రసాద్‌కు అర్ధంకాలేదు

దేదీప్య శిరీషను దగ్గరకు తీసుకుంది

లేదమ్మా నీ మమ్మీని నేనే ఇన్నాళ్ళూ డాడీ అబద్ధం చెప్పారు నేను వచ్చేసానుగా రేపటి-నుండి టీచర్‌ను, మమ్మీని నేనే నువ్వు ఒప్పు-కుంటావా నువ్వు నన్ను మమ్మీ అనకపోతే నేను రాను ' అంది దేదీప్య

"అయితే నువ్వు నా మమ్మీవే భలే, భలే నాకూ మమ్మీ ఉంది నన్ను విడిచి ఎప్పుడూ వెళ్లవు కదా

శిరీష అలా అనగానే సంతోషంతో కౌగలించు-కుంది దేదీప్య

దేదీప్య కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి

శివప్రసాద్ తృప్తిగా నిట్టూర్చాడు

ముగ్గురూ బయటకు వచ్చారు

'ఎక్కడకు వెళదాం

కారును నెమ్మదిగా డ్రైవ్ చేస్తూ అడిగాడు

మా ఇంటికి వెళదాం' అంది దేదీప్య

గతుక్కుమన్నాడు శివప్రసాద్

చిత్తూరుజిల్లాలోని చౌడేపల్లిలో నవంబరు 28న జరిగిన సభలో 1983-84 విద్యా సంవత్సరానికి "మా బడి" ఉత్తమ విద్యార్ధిగా ఎన్నికయిన భూపతిపాలెం ఆశ్రమ పాఠశాలకు చెందిన సి నాగరాజు (7వ తరగతి)కు మాబడి మాసపత్రిక తరఫున బంగారు పతకము, నగదు బహుమతి రూ 500/- అందజేస్తున్న తెలుగు గంగస్పెషల్ కలెక్టర్ శ్రీ కె వెంకటశివయ్య

పాఠశాల ఉత్తమ విద్యార్ధిగా ఎన్నికయిన కొడిగెన హళ్ళి ఆశ్రమ పాఠశాలకు చెందిన యం మునిరాజులకు (10వ తరగతి) పాఠశాల మాసపత్రిక తరఫున బంగారుపతకాన్ని, రూ 1000/- నగదు బహుమతిని ఇండియన్ బాంక్ రీజియనల్ మానేజర్ శ్రీ పి సి పి రెడ్డి అందజేస్తున్న దృశ్యం



ఇప్పుడా?

ఏం ?

దేదీప్యా నామీదగాని మా అన్నయ్యమీదగాని కోపం లేదా

అక్క గురించి తెలిసిన క్షణంలో పొంగిపోయాను మనసున్న మంచి మనుష్యుల నీడలా అందమైన జీవితం గడుపుతుందనుకున్నాను ఆ ఆనందం శాశ్వతమై పదికాలాలపాటు ఉంటే అక్కంత అదృష్టవంతురాలు ఎవరూ ఉండరనుకున్నాను కానీ విధి అక్క జీవితాన్ని దగా చేసింది ఈ నిజం తెలిసిన క్షణంనుండి నా హృదయం ఎంత తల్లడిల్లి పోతుందో మీకు తెలుసు మాకు మా అక్కను కాకుండా చేసిన మిమ్మల్ని తిట్టాలా అక్క దురదృష్టానికి బాధపడాలో తెలియడం లేదు ఒక విషయంలో అక్క అదృష్టవంతురాలు స్త్రీగా కోరుకున్న అందమైన మనసున్న భర్తను సంపాదించుకుని ఆనందం నిండిన ఆ సంసారంలోని మాధుర్యాన్ని నోచుకుంది అక్క ఉన్నతమైన ప్రేమను అందించిన మనిషి చేతిలో తన జీవితాన్ని ముగింపు చేసుకుంది

శివప్రసాద్ దేదీప్యను అభిమానంగా చూసాడు

అతని కళ్లల్లో కృతజ్ఞతా భావం కనిపిస్తుంది

కారు ఇంటి ముందు ఆగింది

దేదీప్య శిరీషను ఎత్తుకుని దిగింది

కొద్దిసేపు సంశయించాడు శివప్రసాద్

దిగండి అంది దేదీప్య

కారు రోడ్డు ప్రక్కన ఆపి దిగాడు

అప్పుడే లోపలనుండి బయటకు వస్తున్న బలరాం పార్వతమ్మ, ఆ ఇద్దరిని చూసి ఆశ్చర్య-పోయారు ఇద్దరూ ముఖాలు చూసుకున్నారు

నాన్నా

ఏమిటమ్మా ఇంత ఆలస్యం అని శివప్రసాద్‌ను చూసాడు బలరాం ఎవరన్నట్లు

శివప్రసాద్‌ను తండ్రికి పరిచయం చేసింది దేదీప్య

పార్వతమ్మ చూపులు శిరీష మీద పడ్డాయి

పార్వతమ్మకు ఏవో జ్ఞాపకాలు కళ్లముందు మెదిలాయి

పార్వతమ్మ కళ్లల్లో నీళ్లు నిలిచాయి

దేదీప్య తల్లి పరిస్థితిని గమనిస్తుంది

పార్వతమ్మ దేదీప్య చేతుల్లోంచి శిరీషను తీసు-కుంది

దేదీప్యా ఈ పాప ఎవరమ్మా

దేదీప్య మాట్లాడలేదు

దేదీప్యా అవంతి కూడా చిన్నప్పుడు ఇలాగే ఉండేది ఇదే ముక్కు, ఇదే కళ్లు అంతా అవంతే

పార్వతమ్మ మాటలకు బలరాం అప్పుడు చూసారు శిరీషను

# ఇ'వేమన' పద్యాలు




సొమ్ము పడిన చోట శోధింప గలుగును
సొమ్ము లేనిచోట శోధనేల
అంజనంబు లేకయ' సొమ్మె దెలియదు
విశ్వదాభిరామ వినురవేమ.

దేదీప్యా నాకూ అలాగే అనిపిస్తుందమ్మా అన్నాడు ఆశ్చర్యంగా

అమ్మా ఈ పాప నిజంగా అక్క కూతురైతే ఎంత బాగుంటుంది

అంతకన్నా భాగ్యం ఏముందమ్మా అవంతి దూరమైనప్పటినుండి మాలో కలిగిన బాధకు కొంత ఉపశమనం కలుగుతుంది అవంతే ఈ చిన్నారి రూపంలో మన కళ్ల ముందుకు వచ్చిందని సంతో-షిస్తాం

శిరీషను ఎత్తుకుని వంటింట్లోకి వెళ్లిపోయింది పార్వతమ్మ

తల్లితో లోపలకు వెళ్లింది దేదీప్య

టిఫినుచేసి తీసుకొచ్చి నాన్నకు శివప్రసాద్ కిచ్చింది

తండ్రి వెనుక నిలబడింది దేదీప్య

శివప్రసాద్ అన్ని విషయాలు చెప్పిన తర్వాత అసలు విషయానికి వచ్చాడు

(ఇంకా ఉంది)

హాలివుడ్‌లో చలన చిత్రాల నిర్మాణంకంటె వివాదాల మీదే ఎక్కువ అభిరుచి ఉన్నట్లు తోస్తుందని ఒక హాస్యనటుడు అన్నాడు బ్లాక్ ఎడ్వర్డ్స్ మెట్రో గోల్డ్ విన్ మేయర్ యునైటెడ్ ఆర్టిస్ట్స్ సంస్థల తగాదాలు చెప్పుకోదగ్గవి దర్శక నిర్మాత ఎడ్వర్డ్స్ తన చిత్రం విడుదలను దెబ్బ తీశారంటూ 18 కోట్ల డాలర్లకు స్టూడియో మీద దావా వేశాడు దాని ఫలితంగా ఆయన అనేక డాలర్లు నష్టపోవలసి వచ్చింది

అసలు జరిగిందేమిటంటే సకాలంలో ఆ స్టూడియో ఎడ్వర్డ్స్ మీద ప్రతి దావా వేసింది ఇగ్లండులో ఎడ్వర్డ్స్ భార్య జూలీ ఆండ్రూసుతో విక్టర్ విక్టోరియా చిత్రం తీస్తున్నప్పుడు అయన పెద్ద మొత్తంలో అనవసరమైన ఖర్చులు చేశారని పేర్కొంటూ 340 మిలియన్ల డాలర్లకు దావా వేసింది ఆ చిత్రం తీస్తూ ఇతర ఖర్చులతో పాటు తనకోసం ఎడ్వర్డ్స్ రోల్సురాయ్ కారు కొన్న ఖర్చులు కూడా చేర్చి స్టూడియోను మోసం చేసినట్లు ఆరోపించింది అయితే తనను దూషించినందుకు ఎడ్వర్డ్స్ తిరిగి 40 కోట్లు డాలర్లకు దావా వేయడంతో పరిస్థితి చిక్కుల్లో పడింది ఇలాంటి వ్యవహారాలవల్ల నిర్మాతలు పంపిణీదారులు నటుల మధ్య సదవగాహన కొఱబడి అనుమానాలు మొదలవుతావు

నేడు హాలివుడ్‌లో అత్యంత జయప్రదమైన నిర్మాతలలో రిచర్డ్ జనుక్ ఒకరు ఈయన డేవిడ్ బ్రౌనుతో కలిసి జాస్ ది స్టింగ్ కకూన్ వంటి బాక్సాఫీసు చిత్రాలు నిర్మించాడు ప్రఖ్యాత మొగొల్ స్టూడియో అధిపతి డేరిల్ జానుక్ కొడుకే రిచర్డ్ జానుక్, ఈయన తన పార్ట్‌నర్ బ్రౌనుతో కలిసి తీసిన జాస్-1 జాస్ – 2 చిత్రాలలో వారి పెట్టుబడి 50 శాతమే అవి యూనివర్సల్ స్టూడియో వారిచే 40







మిలియన్ల డాలర్లకు రికార్డు స్థాయిలో టెలికాస్ట్ చేయబడ్డాయి యూనివర్సల్ స్టూడియోకి ఆ టెలివిజన్ సంస్థ పూర్తి ఫైకం వెంటనే చెల్లించింది కాని ప్రతి చిత్రం ఆరు సంవత్సరాలలో తిరిగి తిరిగి ప్రదర్శింపబడినందున జనుక్, బ్రౌనులకు వాయిదాలలో వారి వాటా మొత్తం చెల్లించబడింది ఆ మొత్తంపై వచ్చే వడ్డీ మాత్రం యూనివర్సల్ స్టూడియో తీసుకుంది ఇప్పుడు వచ్చిన సమస్య ఏమిటంటే తమ వాటాపై వచ్చిన వడ్డీని తమకి ఇవ్వాల్సిందేనని జానుక్ బ్రౌనులు కోరుతున్నారు ఇలాగే 50 దేశాలలో దిరాక్ఫోర్డ్ ఫైల్స్ అనే టి వి చిత్రానికి వచ్చిన డబ్బు 80 లక్షల డాలర్లు అని యూనివర్సల్ స్టూడియో లెక్కలు చూపించినప్పుడు నటుడు జేమ్సు కార్నర్ మండి పడ్డాడట తన లాయర్లను పిలిచి ఆ లాభాల్లో తనకు రావలసిన వాటాను పెద్ద మొత్తాలలో చెల్లించమని యూనివర్సల్ స్టూడియోపై దావా వేసాడట ఈ కేసు పెండింగ్‌లోనే ఉంది చివరకు ఈ కేసు కూడా మిగతా అన్ని కేసుల్లాగే కోర్టు బయటే పరిష్కారం కావలసి ఉందేమో! ఈ విధంగానే జాన్ హస్టన్ దర్శకత్వం వహించిన ది మేన్‌హు వుడ్ బి ది కింగ్ చిత్రంలో నటించినందుకు తమకు రావలసిన వాటా లాభాంను ఇవ్వకుండా మోసం చేశారని ఎల్లైడ్ ఆర్టిస్ట్స్ సంస్థపై సీన్ కెనరీ, మైఖేల్ కాయిన్‌లు 1970 చివరలో దావా వేశారు

ఇకపోతే ఐదు జేమ్స్‌బాండ్ 007 చిత్రాలపై వచ్చిన లాభాలలో పెద్ద మొత్తం వాటా తనకు రావాలంటూ ఎం జి ఎం యు ఎ సంస్థల మీద, జేమ్స్‌బాండ్ చిత్రాల నిర్మాత ఆల్బర్ట్ బ్రొకోలి 225 మిలియన్ల డాలర్లకు స్కాట్‌లాండ్‌కు చెందిన ఒక నటుడు లాస్ ఏంజిల్స్‌లో దావా వేశాడు సీన్ కానరీ వేసిన దావాలో నిర్మాతలు దేశ భద్రతకు భంగం కలిగిస్తున్నారని పేర్కొనడం ఆశ్చర్యం!

నిర్మాతల తప్పుడు లెక్కలు తెలిసినా తమపై దురభిప్రాయం ముద్రపడుతుందని జడిసి నటులు మిన్నకుంటారు అయితే బ్రిటన్ నటుడు మాల్కమ్ మెక్ డోవెల్‌ని పెళ్లాడిన వెంటనే మేరీ స్టీన్ బర్గన్ మోసం వగైరా ఆరోపణ మీద ఎం జి ఎం సంస్థపై కోటి పదిలక్షల డాలర్లకు దావా వేసింది ఆమెతోబాటు మరి కొందరు కూడా మా వంతు మాటేమిటంటూ దావాలు వేశారు ఆ కంపెనీ మీద! ఆ దావాలలో వాస్తవాలు లేకపోలేదు వివిధ వ్యాఖ్యానాలతో ఎల్మ్ కాంట్రాక్టులు ఉంటాయి మొత్తం రాబడులు నికరాదాయాలు వంటి వివరణలు కూడా అందులో ఉంటాయి కాని వాటి అర్థాలలో అవి ఉండవు!

నిజానికి పన్నుల రూపంలో స్టూడియోలు కొంత మింగేస్తాయి ఒక చిత్రం విదేశానికి అమ్మబడినప్పుడు అన్ని విదేశీ పన్నులు ఆ చిత్రం మీద లాభం పొందే వారిపైనే స్టూడియోలు వేస్తాయి

అంతే కాదు ఒక చిత్రం నిర్మించడానికి ఖర్చుపెట్టిన మొత్తం సొమ్ములో 66 శాతం పెట్టుబడి




పరపతిగా స్టూడియో తీసుకొంటుంది తరచూ లెక్కలలో విదేశీ అమ్మకాలు కనుపించకుండా పోతూ ఉంటాయి ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా తారాగణంలో ఎవరిపేరు ముందు ఉండాలి, స్క్రిప్ట్ రచయితలలో ఎవరి ఎవరిపేరు ముందు ఉండాలి అనేది సమస్యగానే ఉంది ఎందుకంటే తారాగణంలో ఎవరి పేరైతే అగ్రస్థానంలో ఉంటుందో వారికే ఎక్కువ శాతం లాభాలు ముట్టుతాయి!

ఏది ఏమైనా హాలివుడ్ గొడవలు ఒక పట్టాన తీరేవి కావు □

(లండన్ 'టైమ్స్' ఆధారంగా)

ఐశ్వర్యానికి
వైశ్యాబ్యాంక్
పథం

# మీరు కేవలం ఆశల మీదే జీవించలేరు



# పదవీ విరమణ కాగానే మీకు డబ్బు అవసరం ఎంతో ఉంటుంది

మా పరంపర డిపాజిట్ పథకంలో నెలకు 100/- రూ చొప్పున 120 నెలలు పొదుపు చేసుకుంటే పదవీ విరమణ తర్వాత సుఖమయ జీవనం సాగించవచ్చు. ప్రతినెలా రూ 197-80 మీ చేతికి వస్తా యి. లేదా రూ 21,772/- మొత్తంగా ఒకేసారి తీసుకోవచ్చు మీ ఉద్యోగానంతర జీవితం సుఖవంతంగా సాగిపోతుంది మా పరంపర పథకం మీకెంత సేవనందిస్తుందో గమనించండి

| డిపాజిట్లు నెలకు రూ | డిపాజిట్ కాలం నెలలు | మొత్తం పొదుపు రూ | 121నెలల తర్వాత మేమిచ్చే మొత్తం | |
|---|---|---|---|---|
| | | | నెలకు రూ | మొత్తం రూ |
| 100-00 | 120 | 12,000-00 | 197-80 | 21,772-00 |
| 200-00 | 120 | 24,000-00 | 395-60 | 43,544-00 |
| 400-00 | 120 | 48,000-00 | 791-20 | 87,088-00 |

వివరాలకు మీ దగ్గరలోని వైశ్యా బ్యాంకు సంప్రదించండి !!



## ది వైశ్యా బ్యాంక్ లిమిటెడ్

రిజిష్టర్డ్ ఆఫీసు అవెన్యూరోడ్, బెంగుళూరు-560 002
అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు 72 సెయింట్ మార్క్సరోడ్, బెంగుళూరు-560 001
ఛైర్మన్ రమేశ్‌గెల్లి



కలసి
అభివృద్ధి
సాదిస్తాం

KIRON/VBL/84

## వాతావరణ కాలుష్యం వల్ల కాన్సర్!

వాతావరణ కాలుష్య ప్రభావం క్యాన్సరుకు దోహదం చేస్తుందని పరిశోధకులు అంటున్నారు పరిశ్రమల పెరుగుదల యీ క్యాన్సరుకు సహాయకారి అట రసాయనిక పరిశ్రమలు, ఆయిలు పరిశ్రమలు వున్న చోట క్యాన్సరు శాతం ఎక్కువ కనుపిస్తోందట 1950లో క్యాన్సరు మరణాలు లక్షకు 304 వుంటే, 1980 నాటికిది 1134గా రూపొందిందట ఈ సమస్య ప్రపంచ సమస్యగా కూడా వున్నదని పారిశ్రామికంగా ఎగిసి పడుతూన్న దేశాలకీ సమస్య మరింతగా వున్నదనీ వీరన్నారట- ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే గోహత్య అంటే యిదే కాబోలు

## ఆస్తి కోసం సోదరుని హత్య!

ఆళ్లగడ్డ తాలూకా చాగలమర్రి గ్రామంలో ఆస్తి కోసం ఫకీర్ సాహెబ్ అనే అతనిని అతని సోదరుడు అతన్ని చంపి, పొలంలో పారేసి పారిపోయాడట

## అమితాబ్‌తో రేఖ ప్రేమాయణం!

హిందీనటి రేఖ తనకూ నటుడు అమితాబ్-బచ్చనుకు 1973 నుంచి ప్రేమాయణం జరుగుతోందని, తాళిలేకపోయినా తానాతనితో సంసార సుఖాలు ఎంచక్కా పొందుతున్నానని, కానీ అమితాబ్ తన సంఘ గౌరవ మర్యాదలకోసం యీ విషయం రహస్యంగా వుంచారని, తనకాతనితో పెళ్లికానందుకు బెంగలేదని మనసా ఆతన్ని కాక్షించి కామించి, తన సర్వస్వ మాతనికి యిచ్చి అతన్నుంచి పొందాల్సినదంతా పొందానని వో



పత్రికా ముఖంగా తెలియజేసిందట తనకు మాతృత్వమంటే చాలా యిష్టమనీ కనీసం డజను మంది పిల్లలకయినా తల్లికావాలనేది తన వాంఛ అని కూడా అంటూ పెళ్లి కాకుండా పిల్లలు పుట్ట రాదని తానా పనిని ఆపుకున్నట్టు వెల్లడించిందటామె

## పంటినెప్పికి పొదినా ఆకు!

కొందరికి పళ్లు పుచ్చు పట్టడంవల్ల పళ్లు బాధ కలిగి చల్లని పదార్థాలు తగిలినప్పుడు జిలార్చుకు పోతుంటుంది అలాంటివారు పొదినా ఆకు బుగ్గలో పెట్టుకు ఆ రసం నోట్లోవుంచుకుని, నెమ్మదిగా మింగుతూ వుంటే పళ్లనొప్పి తగ్గుతుందట



## విక్టోరియా విగ్రహానికి మరమ్మతు!

**లండన్ బక్కింగ్‌హామ్ ప్యాలెస్ ముందు ఠీవిగా నిలబడి వున్న అలనాటి విక్టోరియా మహారాణి విగ్రహం ముక్కు ఎవరో పగల కొట్టేశారట దాంతో ఆ విగ్రహ అంద చందాలు నాశనమయ్యే సరికి, ఆ విగ్రహం మార్పుడం వ్యయ ప్రయాసలతో కూడు కున్నదని ఆ ముక్కు బాగు చేసే పని నార్మన్ కుక్ అనే వో శిల్పికి యిస్తే ఆయన అష్ట కష్టాలూ పడి ముక్కు నతికి అవురా అని ముక్కున చూప రులు వేలేసుకునేలా చేశాట్ట**

## ఆరోగ్యానికి కొండగాలి!

**ఆరోగ్యం మీద పరిశోధనలు జరిపిన వో విజ్ఞాన బృందం కొన్ని విషయాలను శలవిచ్చింది మైదానాలలో వుండేవారికన్నా, కొండ ప్రాంతాలలో వుండే వారి ఆరోగ్యమే చాలా బాగుంటుందట కొండ గాలి వల్ల వూపిరి తిత్తులు చాలా బలంగా వుంటాయట కొండగాలి పీల్చే వారికి పుబ్బుసం వంటివి రావట ఆఫీసులలో, ఆఫీసుల వంటి గదులలో (బిజినెస్ చేసేవారు కూర్చునే చోట్ల) కృత్రిమ వాతావరణంలోనూ, కృత్రిమ కాంతులలోనూ రోజుకు ఏకబిగిన ఎనిమిది పది గంటలు మగ్గి పోయే వారికి తలనొప్పి, తలనాదు, జలుబు, శ్వాస బాధలు వగైరాలన్నీ వస్తాయని కూడా వీరు ప్రకటించారట**

## తుది మెరుగులు దిద్దుకుంటున్న కొత్త టెలివిషన్!

పశ్చిమ జర్మనీకి చెందిన సీమన్స్ కంపెనీ వారు చాలా ప్రయాసపడి వో పది ఏళ్లపాటు పరిశోధించి టి వి సెట్ ఒక చోట వున్నా, ఆ టీవి తెరను తీసి మరొకచోట పెట్టుకోడానికి వీలు కల్పించారట ఈ తెరను గదిలో కావాలంటే ఆ గదిలోని గోడకు పటం తగిలించినట్టు తగిలించవచ్చునట ఈ పరిశోధన యింకా తుది మెరుగులు దిద్దుకుంటోందని, ఇంకో ఏటిలో యిది జన బాహుళ్యానికి వచ్చేస్తుందనీ సీమన్స్ అంటోందట– వహ్వా!

## టెలిఫోన్‌లో కథలు!

చికాగోలో ట్రాన్స్‌వోకల్ కార్పొరేషను అనే వో సంస్థ టెలిఫోనులో కథలు వినిపించే సౌకర్యం కలుగజేసిందట కథ వినదలుచుకున్నవారు వారి నెంబరుకు డయిల్‌చేస్తే చాలుట ఆ నంబర్లో ఫోనులో చక్కని కథ చెప్పనారంభిస్తారట ఈ సర్వీసు రాత్రి ఏడునుంచి పన్నెండు గంటలవరకూ వుండట

## రాజుగారి పుట్టిన రోజుకి చందాలు!

డెన్మార్క్ రాణిగారి భర్త తన సొంతఖర్చుకు కూడా రాణిగారిని దేహీ అని చై చాచాల్సిందేనట ఆయన తనకైతాను ఖజానానుంచి డబ్బు తీసుకో వీలులేదట డెన్మార్క్ వ్యాపారుల సంఘం ఆ రాజు-గారి జన్మ దినోత్సవ వేడుకకు చందాల్జేసుకుని నగగా గాక, నగదుగా ఆయనకో డబ్బు సంచి బహూకరించారట

## కాళ్లమీద పోస్తే పెళ్లి – నెత్తిన పోస్తే విడాకులు!

తమిళనాడు తిరుపత్తూరు గ్రామ ప్రాంత అడవులలో నివసించే ఆదివాసి తెగవారికి పెళ్లి విడాకులూ వో చక్కని పందాలో నడుస్తాయట ఈ రెంటిలోనూ స్త్రీ ప్రాదాన్యతే వుంటుందట పసుపు కలిపిన ఒయ్యం (అక్షతలు) దోసిలితో తెచ్చి పసుపు పరుని కాళ్లమీద పోస్తే పెళ్లయినట్టే లెక్కట



ఆనక మొగుడు నచ్చని బార్య ఆ పసుపు బియ్యం తెచ్చి పదిమందిలోనూ తన మొగుడు తలమీద పోస్తే ఆమెకి ఆతడంటే యిష్టంలేక విడాకులు కోరినట్టుట అంతే ఆ మగుడు నెత్తి దులుపుకుంటూ పొవాల్సిందేనట

## బొంబాయి హార్బరు గొప్పతనం!

బారత దేశపు సముద్రపొడ్డు సుమారు ఆరు వేల కిలోమీటర్లట ఇందులో 10 పెద్ద హార్బరులు 160 చిన్న నౌకాశ్రయాలు వున్నాయట వీటిలో బొంబాయి హార్బరు చాలా పెద్దదట □

# అగాధం

పి.వి.ఆర్. శివకుమార్

"మమ్మీ మమ్మీ ఈ సమ్మర్ హాలిడేస్‌లో డాడీ లాంగ్ ట్రిప్‌కి ప్లాన్ చేశార్ట! అక్కతో అన్నీ చెప్తున్నారు

బన్నీ వచ్చి అన్నాడు

ఉఁ అవును మరి మీరు అల్లరి చెయ్యకుండా బుద్ధిగా వుండేట్లయితే తీసుకువెళ్లి అన్నీ చూపిస్తాం

ఓ అలాగే వుంటాం ఔట్ స్టేషన్స్‌కి వెళ్తే మేమసలు అల్లరి చెయ్యం అక్క తరఫునా తన తరఫునా కూడా హామీ ఇచ్చేశాడు వాడు నవ్వుకున్నాను నాలో నేనే

బయటి గదిలోంచి వారి గొంతు వినబడుతోంది శౌరిని కూర్చోపెట్టుకు ప్రోగ్రాం చెప్తున్నారు

ఎల్ టి సి మీద ఢిల్లీ బాంబేలలో తలోవారం గడిపి రావాలని ప్లాన్ నెల్లాళ్ల క్రితమే టికెట్స్ బుక్ చేశారు ప్రయాణం' రెండు రోజుల్లో పడింది ముందుగా చెప్తే ఎప్పుడు వెళ్తాం – ఎప్పుడు వెళ్తాం అని ప్రాణాలు విసిగిస్తారని ఇవాళ్టిదాకా చెప్పలేదు పిల్లలకి రెండురోజులే వుంది కాబట్టి ఇవాళ చెప్పారు

నాన్నా, బాంబేలో సుందర్ అంకుల్ వాళ్ళు వున్నారు గదా, వాళ్లింటికి వెళ్లొచ్చుగా మనం? మరి నువ్వు హోటీల్లో గది ఎందుకు బుక్ చేశావు? అడుగుతోంది శౌరి

చూడు మనం సిటీ చూడటానికి వెళ్తున్నామా? వారం రోజులు వుంటామా? ఎవరి ఇంట్లోనన్నా అన్నేసి రోజులు వుంటే, వాళ్ళకి ఇబ్బంది అన్నమాట అందుకే అలా ఎవరింట్లోనూ వుండకూడదు సుందరంకుల్ వాళ్లింటికి చూడటానికి వెళ్దాం కానీ వాళ్ల యింట్లోనే వుండిపోకూడదు చెప్తున్నారాయన

ఇంతకీ సుందరం నా స్వంత అన్నయ్య! ఉద్యోగ రీత్యా బాంబేలో వుంటున్నాడు వాడు వుంటున్న ఫ్లాట్ చిన్నది – ఒక్కగదీ, వంటగదీ – అంతే కానీ మేం వాళ్ల యింటికి వెళ్లక పోవటానికి కారణం అదొక్కటేకాదు మా వదిన మాట తీరు కూడా! తమ ఇంటికి బంధువు లెవరొచ్చినా సరే వాళ్ల సంపాదనంతా తిని పోవటానికే వచ్చారన్నట్లు మాట్లాడుతుంది అందుకే వాళ్లింట్లో ఒక్కపూట వుండాలనిపించదు

అమ్మా! నువ్వు ఎప్పుడేనా ఢిల్లీ వెళ్లావా?

రాత్రి భోజనాల దగ్గర సడెన్‌గా అడిగింది శౌరి

లేదే! ఇప్పుడు వెళ్తున్నాంగా!

ఇప్పుడు కాదు – నీ చిన్నప్పుడు మీ డాడీ తీసుకెళ్లలేదా?

ఊహుఁ

అంటే – మరి శలవుల్లో ఏం చేసే దానివి మమ్మీ? అడిగాడు బన్నీ

శలవుల్లో అరక్షణం ఆగి చెప్పాను శలవుల్లో మా తాతగారి ఊరికి వెళ్లేదాన్ని

ఏ వూరు?

సుత్తులూరు అని – బెజవాడ దగ్గర ఓ పల్లెటూరు

పల్లెటూరా? చ చ బోర్ కొట్టేదికాదా అమ్మా? ప్రతి ఏడూ అక్కడికే వెళ్లేదానివా?

ఈ బోరూ గీరూ మీకేగానీ, మాకు చిన్నతనంలో ఆ మాట కూడాతెలీదు' కొంచెం కోపంగా అన్నాను ఈ కాన్వెంట్ చదువులొచ్చేక పిల్లలిలా చెడిపోతున్నారని నా నమ్మకం ఆయన నా నమ్మకాన్ని చాదస్తం కింద లెక్కగట్టి వెక్కిరిస్తుంటారు

మీ తాతయ్యగారి వూళ్ళో ఏంచేసేవాళ్ళు మమ్మీ? మళ్లా అడిగాడు బన్నీ

శలవులకి మా తాతగారిల్లు ఓ తిరణాల అయ్యేది పది పదిహేనుమంది పిల్లల్లో, సందడిగా గడిచిపోయేది రెండు నెలలూ! చెప్పాను

రెండు నిముషాలపాటు ఏదో ఆలోచిస్తున్నట్టుగా వుండిపోయాడు బన్నీ ఆ తర్వాత అడిగాడు –

మమ్మీ! మరి మనం శలవుల్లో మా తాతయ్యగారి ఊరికి వెళ్లం ఎందుకని?

నేనూ, మా వారూ ముఖాలు చూసుకున్నాం ఆ ప్రశ్నకి!

సుత్తి వెయ్యకురా! అన్నం తిను ముందు! అయినా, మనం ఎంచక్కా ఢిల్లీ, ఆగ్రా బాంబే వెళ్తున్నాం గదా! అంది శౌరి



వాడు దాన్ని ఏదో అన్నాడు ఇద్దరూ వాదనకి దిగారు వాడికి జవాబు చెప్ప వల్సిన అవసరం తప్పిపోయింది నాకు

* * *

నీలం బల్బు కాంతి గదంతా పరుచుకుంది ఎల్లలు గాఢ నిద్రలో వున్నారు ఆయన కూడా నిద్రపోతూనే వున్నారు నాకే ఇంకా నిద్రపట్టలేదు

నా మనసులో ఇంకా అదే ప్రశ్న మెదుల్తోంది

మమ్మీ మరిమనం మన శలవుల్లో మా తాతయ్యగారి ఊరికి వెళ్లం ఎందుకని?

బన్నీ వేసిన ప్రశ్న

ఏం జవాబు వుంది ఆ ప్రశ్నకి?

వాడికి ఇద్దరు తాతయ్యలున్నారు

కానీ, ఏ తాత గారింటికి వెళ్ళగలడు వాడు?

మా అమ్మా నాన్న పెద్దన్నయ్య దగ్గర ఖరగ్‌పూర్లో వుంటున్నారు అక్కడ కాస్త అనాదరణ తోచగానే చిన్నన్నయ్య వాళ్ల దగ్గరకు త్రివేండ్రం వెళ్తారు అక్కడ ఎక్కువ రోజులున్నట్టు (మా చిన్నన్నయ్యకి) తోచగానే మూడో అన్నయ్య దగ్గరకి బొంబే వెళ్తారు అక్కడినించి మళ్ళా ఖరగ్‌పూర్

ఇహ మా అత్తగారూ మామగారూ రాజమండ్రి-లోనే మా మరిది దగ్గర వుంటారు మా మామగారికి ఆంధ్రదేశం దాటి రావటమనేది ఊహల్లోకి కూడా రాని విషయం అందుకే పాట్నాలో మా దగ్గరకు వాళ్ళు చుట్టం చూపుగా కూడా ఎన్నడూ రారు! ఎప్పుడేనా మేం వెళ్ళాల్సిందే!

రాజమండ్రి పేపర్ మిల్లులో మా మరిది ఓ చిరుద్యోగి అతనికి పెళ్లయిన పదేళ్లలో నేనూ మా తోటి కోడలూ వరసన పట్టున పదిరోజులైనా కలిసి వున్న పాపానపోలేదు మా మరిదికి యీయనంటే పడదు! మా మామగారు ఉన్నదంతా వూడ్చిపెట్టి యీయన్నే చదివించారనీ తనని హైస్కూలు చదువు దాటనియ్యలేదనీ అతనిక్కోపం అతనికి చదు-వబ్బలేదనీ యస్సెల్సీ దాటడానికే నాలుగేళ్ళు పట్టిందనీ యీయన చెప్తారు! దానా, దీనా



భారత ప్రభుత్వంచే జంతు సంక్షేమ బోర్డులో సభ్యుడుగా నియమించబడిన ఆంధ్రప్రదేశ్ జీవరక్షా సంఘం, (గుంటూరు) కార్యదర్శి శ్రీ పీలా రామకృష్ణ

## అగాధం

వీళ్లిద్దరి మద్యా 'హలో అంటే హలో' అనుకునే పాటి బంధుత్వం మాత్రం మిగిలింది!

ఇటువంటి పరిస్థితుల్లో ఏ తాతగారి ఇల్లు వీళ్లకి వేసంగి విడిదిగా మిగిలింది? ఏ తాతగారికి అసలొక ఇల్లంటూ మిగిలింది? తాతలంతా మామలమీదో, పెదనాన్నల మీదో ఆధారపడి వుంటున్న యీ కాలంలో పిల్లలు మునుపటి రోజుల్లోలాగా శలవులంటూ తాతల ఇళ్లకి వెళ్లే అవకాశం ఏది?

బోర్ కొట్టేది కాదా అమ్మా?' శౌరి అమాయకంగా అడిగిన ప్రశ్న గుర్తుకు వచ్చింది

దాంతో ఒక్కసారిగా నా చిన్ననాటి సంఘటనలన్నీ గుర్తుకి వచ్చి భరించలేనంత కమ్మని పూల పరిమళం చుట్టు ముట్టి ఉక్కిరి బిక్కిరి చేసి-నట్లయింది! 'బోరా?' ఎంత లైవ్లీగా గడిచిపోయేవి రోజులు? వేసవి శలవల కోసమే ఏడాది కాలాన్ని ఉగ్గబట్టి భరించేవాళ్లం

వేసవి శలవులు వస్తూనే అమ్మ మమ్మల్ని తీసుకు తాతగారింటికి చేరుకునేది ఏ వారం పది రోజులు అటూ ఇటూగా పెద్దమ్మా, పిన్నీ, ఇద్దరత్తయ్యలూ కూడా వచ్చేసేవారు – పిల్లల్తో సహా!

ఇంక వేసవి కాలం అంతా పిల్లల సందడే! పెద్దల హడావిడే! ఏటా మా తాత గారింట్లో ఓ పెళ్లి జరుగుతున్నంత హడావిడి!

మా తాతగారు సుత్తులూరులోని పెద్ద భూఖామందుల్లో ఒకరు ఆ లోగిలి ఎప్పుడూ ఓ దాన్యాగారంలా కళ కళ లాడుతూ వుండేది దొడ్లో అరడజను గేదెలుండేవి రెండు ఆవులుండేవి ఇంట్లో ఎప్పుడూ పాలు, పెరుగు, వెన్న గిన్నెల నిండా వుండేవి!

వేసవి శలవల్లో మీరంతా తప్పకండా రావా-లమ్మా! పిల్లలతో కల్సి వచ్చి శలవులన్నీ ఇక్కడే గడిపి వెళ్ళాలి మాకు ఇక్కడ ఏమీ తోచదు మీరంతా వస్తూ వుంటేనే సందడి మీ కోసం ఎప్పుడూ ఎదురు చూస్తూ వుంటాం అన్నారు అమ్మా నాన్నా

తపకండా వస్తాం నాన్నా, ఇన్నేళ్ళుగా మేమూ అదే ఎదురు చూస్తున్నాం మా అందరికీ కలుసు-కోట్రానికి కూడా ఇదే ప్లాట్ పారం లేకపోతే ఒకళ్ళకి ఒకరం చొప్పున దేశమంతా తిరగ్గలమా? ఇక్కడయితే అంతా కలుస్తుంటాం

నా మనసులో మాటే పైకి అంది అక్కయ్య

ఇహనించీ ఏడాదికోసారి మనందరం తప్పని-సరిగా ఇక్కడ కలవాల్సిందే అన్నాడు పెద్దన్నయ్య

అలాగే కలుద్దాం – మామగారు ఎల్ టి సి సౌకర్యాలు కల్పిస్తే నవ్వుతూ అన్నాడు మరిది

దేవుడు చల్లగా చూడాలిగానీ, నా కున్నది మీకు ఖర్చు చేయటానికి నే నెందుకు వెనకాడతాను బాబూ? అన్నారు నాన్న

వదల్లేక వదల్లేక ఒకరి నొకరం వదిలి బస్సు లెక్కాం

కానీ మనసునిండా ఎంత నిండైన అనుభూతి! ఈ అనుభూతి కోసం కాదూ నేను పరితపించింది? అనిపించింది

*   *   *

బర్ ర్ మన్న కాలింగ్ బెల్ మోతతో నిద్ర మెళుకువ వచ్చింది నే కన్నది కల అని తెలియటానికి రెండు నిమిషాలు పట్టింది! విసుగ్గా లేచి వెళ్ళి పాల పాకెట్లు అందుకుని లోపల పడేసి వచ్చి పక్క మీద వాలాను

ఎంత కమ్మని కల! తెల్లవారు జామున వచ్చే కలలు నిజమవుతాయంటారు కానీ ఈ కల మాత్రం నిజంకాదు – ఇది పచ్చి పగటి కల!'

నిరాశగా నిట్టూర్చాను

అయితే అంతర్గతంగా నేను పడుతున్న మదనానికి కారణం అర్ధమయింది

ఉన్న వూళ్ళోంచి కదలకుండా కూడా జీవితాంతం ప్రశాంతిని అనుభవించారు మన ముందు తరాల వాళ్ళు ఇవాళ మనం మనలో నే పేరుకున్న అశాంతికి కారణాలు తెల్సుకోలేక, కక్షలూ, కావేషాలూ చంపుకుని మనుషులం దగ్గర కాలేక, దేశాలు పట్టుకు తిరుగుతున్నాం – అయినా శాంతి దొరకటంలేదు!

ఇలాగే పడుకుని ఆలోచించటం మొదలు పెడితే నే నొక పిచ్చిదాన్నిగా మారిపోతానేమో నని భయం వేసింది!

తల విదిలించి, లేచి, బలవంతంగా దైనందిన కార్యక్రమాల్లో మునిగి పోయాను □




భగవంతునియందు గొప్ప భక్తి కలవారు ముక్తిని పొందినట్లే, ఆయనను విరోధించి, ఆయన వల్ల మృతి పొందిన వారు కూడా ముక్తిని పొందగలరు.

సనత్కుమారుని వల్ల విష్ణుదేవుని మహాత్మ్యాన్ని విన్న తరువాత రావ-ణుడు పయి విషయాన్ని గ్రహించి "మహాత్మా! విష్ణువుతో నాకు యుద్ధం తటస్థిస్తుందా? ఆయన వల్ల మృతి పొంది నేను ముక్తిని పొందగలనా?" అని అడిగాడు ఆ మహా ముని, "దను జాగ్రణీ! నీవాతనికి కోపం తెప్పించి, యుద్ధంలో ఆయనచే హతుడవై తప్పకుండా ఉత్తమ గతిని పొందు-తావు" అని సమాధానమిచ్చాడు "అది యెప్పుడు సంభవిస్తుంది?" అని ప్రశ్నించగా, సనత్కుమారుడు "త్రేతా-యుగంలో శ్రీహరి సూర్య వంశంలో శ్రీరాముడుగా పుట్టి, తండ్రి ఆజ్ఞ మేరకు సతీ సమేతుడై తమ్ముడు లక్ష్మణునితో కూడ వనంలో నివసించగా, ఆయన భార్యను అపహరించి, శ్రీరామునికి కోపం తెప్పించి యుద్ధంలో ఆ రాముని వల్ల మరణం పొంది ముక్తుడవు కాగల"వని చెప్పాడు

శ్రీహరికి కోపం తెప్పించాలనే, రావ-ణుడు సమస్త జనులను హింసిస్తూ, అధర్మంగా ప్రవర్తించసాగాడు. అతని బాధలకు తాళలేక దేవతలు విష్ణువుతో మొర పెట్టుకోగా, ఆయన వారిని ఊరడించి, తనకు సహాయంగా వానరులుగా అవతరించాలని చెప్పి తాను శ్రీరాముడుగా అవతరించాడు

విష్ణువు వల్ల మరణం పొంది, తరించాలనే సంకల్పంతోనే రావణుడు, శ్రీరాముని మోసగించి, అతడు పర్ణశాలను విడిచిపోయే-టట్లు, లక్ష్మణుడు ఆ తర్వాత అతని కోసం వెళ్ళేటట్లు చేసి, సన్యాసి వేషంతో సీతను అపహరించి లంకకు తీసికొని వెళ్ళిపోయి, ఆమెను అశోక వనంలో ఉంచాడు. రామునికి అతని పయి కోపం వచ్చి, వానర సమూ-హంతో కూడా పోయి, సముద్రాన్ని దాటి లంకలో ప్రవేశించి యుద్ధంలో రావణుణ్ణి సంహరించాడు రావ-ణుడు సీతాదేవిని స్వేచ్ఛా నిర్బంధంలో ఉంచినా కాముక దృష్టితో బలాత్క-రించలేదు రామునిచే సంహరించ-బడినందున ముక్తిని పొందాడు

భగవంతుని యెడల వైరం పూనినా, అతని వల్ల ప్రాణాలు కోల్పోయి-నందుననే- రావణునికి తాను కోరిన కైవల్యం లభించింది

ఈ విషయాన్ని కంకంటి పాపరాజు-గారు తన ఉత్తర రామాయణంలో వివరంగా తెలియజేశారు

–బులుసు వేంకటరమణయ్య



ఇటీవల బందరు ఆంధ్ర సారస్వత సమితి నిర్వహించిన సాహిత్య సభలో అధ్యక్షోపన్యాసం చేస్తున్న సారస్వత సమితి అధ్యక్షులు శ్రీ బోయిన వెంకటేశ్వరరావు శ్రీ మల్లంపల్లి శరభయ్యశర్మ (ఉపన్యాసకులు)గారిని కూడా చిత్రంలో చూడవచ్చు

## తెలుగు పద మాధుర్యం (సాహిత్య సభ)

ఇటీవల బందరులో ఆంధ్ర సారస్వత సమితి నిర్వహించిన సాహిత్య సభకు ఏలూరు స్పెషల్ డిప్యూటీ కలెక్టరు శ్రీ బోయిన వెంకటేశ్వరరావు అధ్యక్షత వహించారు వీరు తమ ఉపన్యాసంలో సాహిత్యం సమాజ హితవు కోరేదయి ఉండాలని అన్నారు డా దివాకర్ల వెంకటావధాని మాట్లాడుతూ తెలుగు భాషకు కవిత్రయము ప్రబంధ కవులు దక్షిణ ఆంధ్రులు చేసిన కృషినిగురించి చెప్పారు శ్రీ మల్లంపల్లి శరభయ్యశర్మ సాహిత్యంలోని శబ్దం అర్థం తాత్పర్యమేగాక భావాన్ని కూడా గ్రహించితేనే సాహిత్య పరిమళం వెదజల్లబడుతుందని అన్నారు

సభారంభంలో కార్యవర్గ సభ్యులు శ్రీ ఎల్ ఎన్ శాస్త్రి స్వాగతం పలికారు శ్రీ నందిగామ సూర్యనారాయణ వందన సమర్పణ చేశారు

# అవీ-ఇవీ-అన్నీ

## నూతలపాటి సాహితీ సత్కారం కవులకు విజ్ఞప్తి

పుత్తూరులో గంగాధరం సాహితీ కుటుంబం (రిజి) ప్రతి సంవత్సరం మే 29వ నూతలపాటి సాహితీ సత్కారం పేరుతో అందించే అవార్డుకు రచనలు పంప దలచిన కవులు క్రింది సూచనలు పాటించాలని కార్యదర్శి కోరుతున్నారు

1982 జనవరి నుండి 1984 డిసెంబరు లోపల మొదట ముద్రణ పొందిన కవితా సంకలనాలను మాత్రమే పంపాలి

వచన కవితా సంకలనాలకు ఆధునిక సామాజిక జీవనం ప్రతిబింబించే రచనలకు ప్రాధాన్యత యివ్వబడుతుంది కవితా సంకలనం రచయిత ఒకరే అయి ఉండాలి

అవార్డు పొందిన కవి సన్మాన సభకు తప్పక రావాలి అవార్డు సన్మాన సభయందే యివ్వబడును

అనువాదాలు వ్రాతప్రతులు అవార్డుకు స్వీకరించబడవు

పరిశీలనార్థం కవులు తమ రచనలు నాలుగు ప్రతులు శ్రీ ఎస్ మునిసుందరం కృష్ణా నిలయం వాటర్ ట్యాంక్‌రోడ్ పుత్తూరు (పిన్ 517583) చిత్తూరు జిల్లా అడ్రసుకు 31 మార్చి 1985 లోగా పంపాలి

## 'వాతావరణం'పై వ్యాస రచన పోటీ

యునైటెడ్ స్కూల్స్ ఆర్గనైజేషన్‌వారు వాతావరణ విభాగము వారితో కలసి నాల్గవ అఖిల భారత విద్యార్థుల వ్యాస రచన పోటీను వాతావరణము అను విషయముపై నిర్వహించపోతున్నారు ఇందులో 5 వ తరగతినుంచి 12 వ తరగతివరకూ గల విద్యార్థులకు ప్రవేశము కలదు ఈ పోటీ ప్రాంతీయ భాషలలోనే నిర్వహించబడును ప్రతీ భాషనుంచి ఈ పోటీలో పాల్గొను విద్యార్థులను 3 తరగతులుగా విభజించి ప్రతి తరగతినుంచి 3 బహుమతులు ప్రకటించుదురు పోటీ ఫలితములు జూన్ 5 1985 వాతావరణ దివసమున ప్రకటింతురు మొదటి బహుమతి రు 300రూ లు రెండవ బహుమతి రు 200 మూడవ బహుమతి రు 100 లు మొత్తం 144 బహుమతుల విలువ రు 28 800 లు

బహుమతి ప్రదానమునకు డిల్లీ వచ్చే విద్యార్థులకి అన్ని ఖర్చులు నిర్వాహకులే భరింతురు గెలిచిన వ్యాసములను వ్యాసకర్త ఫోటో తో సహా ఒక పుస్తక రూపమున విడుదల చేస్తారు

ఈ పోటీలో పాల్గొనే స్కూలువారు పూర్తి వివరములకై ఈ క్రింది వారిని సంప్రదించాలి

సెక్రెటరీ యు ఎస్ ఓ హౌస్
6 స్పెషల్ ఇన్‌స్టిట్యూషనల్ ఏరియా
న్యూఢిల్లీ–110067 □

ఇటీవల స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా రీజినల్ ఆఫీస్ విజయవాడ వారు ప్రదర్శించిన ఇంటింటి కథ నాటికలో పాల్గొన్న బృందం సర్వశ్రీ విన్నకోట విజయరాం (దర్శకుడు) చి మురళీకృష్ణ (బాల నటుడు) ఎశుపాటి ఉమామహేశ్వరమ్ (రచయిత) ప్రభాకం రామ్మూర్తి ఎ వి రవికుమార్ విఠల్‌బాబా లక్ష్మీనారాయణ నారాయణ అప్పారావు శంకరరావు శ్రీమతి రాజకుమారిగార్లని చిత్రంలో చూడవచ్చు



ఇటీవల కాకినాడలో జరిగిన స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా వారి సాంస్కృతిక పోటీలలో తెనెటిగలు పగబడతాయి నాటిక ప్రదర్శించి ఉత్తమ ప్రదర్శన ఉత్తమ విలన్ ఉత్తమ హాస్య నటుడు బహుమతులు పొందిన విజయవాడ స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా మెయిన్‌బ్రాంచి బృందం



ఇప్పుడు లభిస్తూన్న

డిలక్స

# నిరోధ్

మరింత నునుపైనది




సున్నిత మనస్కులైన దంపతులకు

అయిదింటికి
రూ. 1/-

★ ఉత్తమ మైన నాణ్యత గలది.

★ ఎలక్ట్రానిక్ సాదనాలతో పరీక్షింపబడినది.

అన్ని పెద్ద పట్టణాలలో
విక్రయింపబడుచున్నది

davp 84/28

## హైదరాబాదు నోట్‌బుక్

### శ్రీ బి ఎ రెడ్డికి సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు

ప్రముఖ చిత్రకారుడు గోలకొండ కేంద్రీయ విద్యాలయంలో చిత్రకళోపాధ్యాయుడు శ్రీ బి ఎ రెడ్డికి ప్రతిష్ఠాకరమైన 1984 సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు లభించింది శ్రీ రెడ్డి భారత - సోవియట్ మైత్రి అంతర్జాతీయ అవగాహన విశ్వమానవ సౌభ్రాత్రం పెంపొందించడానికి తనకళ ద్వారా బాలల చిత్ర కళ ద్వారా చేసిన అపూర్వ సేవకు ఈ బహుమతి పొందారు ఈ బహుమతి కింద ఒక బంగారు పతకం 7500 రూపాయల నగదు ఒక ప్రశంసా పత్రం లభిస్తాయి రెండు వారాలపాటు సోవియట్ యూనియన్‌లో పర్యటన సోవియట్ యూనియన్ ప్రభుత్వ వ్యయంతో చేసే అవకాశం వుంటుంది శ్రీ రెడ్డి ఇదివరకు పెక్కు బహుమతులు పొందారు 1980 లో ఆయనకు ఉత్తమ ఉపాధ్యాయ బహుమతి లభించింది 1981 లో పోలిష్ చాప్టర్ ఆయనకు ఆర్డర్ ఆఫ్ స్మైల్ బహుమతి ఇచ్చింది ఆయనకు హైదరాబాదులోను న్యూఢిల్లీలోను వ్యష్టి చిత్ర కళా ప్రదర్శనలు నిర్వహించారు సర్జనాత్మక కళా ఖండాలు రచించినందుకు గ్రావుక్కులకు కాళిదాస సమారోహ్‌లో శ్రేష్ఠపురస్కారం రాష్ట్ర లలితా కళా అకాడెమీ అవార్డులు లభించాయి దేశంలోని పెక్కు మ్యూజియంలను ఆయన కళా ఖండాలు అలంకరించాయి కేంద్రీయ విద్యాలయ సంస్థాన్ ఆయనకు పెక్కు ప్రోత్సాహక బహుమతులు ఇచ్చి గౌరవించింది సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డును నవంబరు 13 న ఉపరాష్ట్రపతి శ్రీ ఆర్ వెంకటరామన్ న్యూఢిల్లీలో జరిగిన సమావేశంలో శ్రీ రెడ్డికి అందజేశారు

గడచిన 13 సంవత్సరాలుగా గోలకొండ కేంద్రీయ విద్యాలయం విద్యార్థులు సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డును సంపాదిస్తూనే ఉన్నారు ఈ అవార్డులోను ఒక బంగారు పతకం,ప్రశంసాపత్రం ఇస్తారు అవార్డు పొందినవారు నల్ల సముద్రం తీరంలోని ఆర్‌టిక్ యంగ్ పయొనీర్స్ క్యాంపులో నెల రోజులు గడపడానికి ఏర్పాట్లు చేస్తారు ఈ విద్యాలయానికి చెందిన 42 మంది విద్యార్థులకు సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు సమం ప్రశంసా పత్రాలు ఇచ్చింది ఇది చాల ప్రతిష్ఠాకరమైన సంగతి అంతేకాక పలువురు విద్యార్థులు శ్రీ బి ఎ రెడ్డి పర్యవేక్షణలో ప్రపంచమంతటాను మన దేశంలోనూ జరిగిన అంతర్జాతీయ చిత్ర కళా స్పర్ధలో పాల్గొని బహుమతులు పొందారు ఈ విద్యాలయం విద్యార్థులు సోవియట్ యూనియన్ మాస్కో ఒలింపిక్స్ సందర్భంగాను తృతీయ చతుర్థ అంతర్జాతీయ పుస్తక ప్రదర్శనం సందర్భంగాను సోవియట్ వారి పోటీలలోను ఏర్పాటు చేసిన తృతీయ చతుర్థ అంతర్జాతీయ బాల చిత్ర కళా ప్రదర్శనాలలోను ఇతర ప్రదర్శనాలలోను పాల్గొని పెక్కు బహుమతులు సంపాదించారు ఈ సంవత్సరం ఈ విద్యాలయం 8 వ తరగతి విద్యార్థిని కుమారి బీణా గోస్వామి బాల చిత్ర కళ పోటీలో గెలుపొంది సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు పొందింది ఈ విద్యార్థినికి ఒక బంగారు పతకం ప్రశంసా పత్రం లభిస్తాయి నల్ల సముద్రం తీరంలోని ఆర్కెటిక్ యంగ్ పయనీర్స్ క్యాంప్‌లో నెల రోజుల పాటు గడిపే వస్తుంది మిత్రుడు శ్రీ బి ఎ రెడ్డిని ఆయన విద్యార్థులను వారిని ప్రోత్సహిస్తూ మంచి పనులు చేయిస్తున్న గోలకొండ కేంద్రీయ విద్యాలయం ప్రిన్సిపాలు శ్రీ టి ప్రభాకర్‌జీని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను

ఉపరాష్ట్రపతి శ్రీ ఆర్ వెంకటరామన్ నుంచి సోవియట్‌ల్యాండ్ నెహ్రూ అవార్డును స్వీకరిస్తున్న శ్రీ బి ఎ రెడ్డి



### ఉపశ్రుతి

ఎం లీడరుగారూ ఎన్నికలల్లో మీ పేరు కనిపించలేదే?- అనడిగాను ఒక సుమారైన నాయకుణ్ని నాకు పోటీ చేద్దామనే వుండేది కాని నా సతీమణి వద్దంది అందువల్ల మానుకున్నాను-అన్నాడు ఆయిన జౌను లెండి అందుకనే వంద నీతి సూక్తుల కన్న ఒక్క నాతి సూక్తి మిన్న అన్నాడు కవీశ్వరుడు శ్రీ నల్లాన్ చక్రవర్తుల శేషాచార్యులు అన్నాను

—తిరుమల రామచంద్ర





'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.

తూర్పు తూర్పు పడమర పడమర అనే సూక్తి సామాన్య మానవులకు వర్తిస్తుంది అంత మాత్రమే కిప్లింగ్ ద్విని ఖండించడం చాలా మంచిది తెలియక పోవచ్చు రచయితలు వక్తలు కిప్లింగ్‌ను దుయ్యబట్టడం తరచు చూస్తుంటాము ఇది గ్రాస్ పోషక పాండిత్యం వల్ల జరుగుతున్నది అందువల్ల ఈ పొరపాటు పాఠకులకు తెలియ బరచుట ముఖ్యమని నా అభిప్రాయం కిప్లింగ్ పద్యాన్ని క్షుణ్ణంగా చదివితే మన దురభిప్రాయం మిడిమిడి జ్ఞానం పోతుంది సదవగాహన కలుగుతుంది చాలా మంది వక్తలు వేదికల నుంచి ఇది కిప్లింగ్ సూక్తి అని వంచేస్తుంటారు మనం తెలియక చప్పట్లు కొడతాము కిప్లింగ్‌ను గురించి ఈ అభిప్రాయం పోవాలి

ప్రొ కె విశ్వనాథం విశాఖపట్నం

## దేదీప్య

సీరియల్ దేదీప్య చాలా బాగా నచ్చింది నాకే కాదు మా ఇంట్లో వాళ్లకు కూడా నచ్చింది రచయిత శ్రీ కంచుమర్తి వెంకటేశ్వరరావుగారికి నా అభినందనలు నూడిల్స్‌లేఖ ధర్మ పదం శీర్షికలు కూడా నాకు చాలా నచ్చినవి

అమిరినేని హరికిషన్ వేమూరు

## ఆడవాళ్లూ మీకు జోహార్లు

కమలహాసన్ ముఖచిత్రంతో వెలువడిన 7 12 84 నాటి ఆంధ్ర సచిత్రవారపత్రిక ఎంతో ఆకర్షణీయంగా ఉంది కాని కమలగారి ఆడవాళ్లు మీకు జోహార్లు కథ బాగుంది!

– యం డి అస్లాం ఇల్లెందు

## అపాలజీ

పాలగిరి వేణుగారి అపాలజీ కథను (30 11 84 సంచిక) రెండుపర్యాయాలు చదివితిమి విషయం అద్భుతంగా వున్నది

ఎ సుమతి సామ్యలక్ష్మి గూడూరు (నెల్లూరుజిల్లా)

## నవ్వు

నటి అనురాధ ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రికలో డా సింగినాదంగారు ఇచ్చిన మీ సెక్స్ సందేహాలకి సమాధానాలు చదివిన నేను నవ్వాపుకోలేక పోయానంటే నమ్మండి ప్రతివారం ఇటువంటి వాటిని మా కందిస్తారా?

–రెడ్డి నాగేశ్వరరావు, మాచర్ల

## జంతువులా?

ఆర్యా 30–11–84 సంచికలోని డా గు రమేష్ బాబుగారి జీవితపు విలువలు మారుస్తున్న నాళికా శిశువులు వ్యాసం చాలా క్రొత్త విషయాలను తెలియజేసింది ఇలాంటి వ్యాసాలను సాధ్యమైనన్ని ఎక్కువ ప్రచురించండి ఈ వ్యాసంలో రమేష్‌బాబు గారు టెస్ట్ ట్యూబ్ బేబీలు అ సం రా లోనే రెండు లక్షలా యాభై వేలకు పైగా ఉన్నాయట అని వ్రాయటం బాగో లేదు టెస్ట్ ట్యూబ్ బేబీలు జంతువులు గాని ప్రాణం లేనివి గాని కాదు బహుశా ఆయనకు టెస్ట్ ట్యూబ్ బేబీలపై సదభిప్రాయం లేనందునేమో! ఉన్నాయనుటకు బదులు ఉన్నారట అని వ్రాయాల్సింది

–లంక ఫణీంధర్ టి బి డామ్

# ఉత్తరాలు....

**( 4 వపేజీ తరువాయి)**

## విజ్ఞానదాయకం

విజయనగర శిల్ప కళా వైభవం ఎంతో ఆసక్తికరంగా విజ్ఞాన దాయకంగా వుంది ఈ వ్యాసం చదువుతుంటే విజయ నగరరాజుల కాలంలో నిత్య కళ్యాణం పచ్చ తోరణంలా విలసిల్లి వారి శిల్ప చాతుర్యానికి మచ్చు తునకగా హంపిలో శిధిలావస్థలో వున్న దేవాలయాలు శిల్పాలు కనుల ముందు వున్నట్టు అనిపించింది

సి వరలక్ష్మి గుంటూరు

## రూపాంతరం

తాత చెప్పే కథ  
అవగతం కాక  
నిలువునా కూల్చే  
అలనాడు  
జాతి పితను  
గాంధీ తాతను గాడ్సే

అన్నం పెట్టిన  
అమ్మ కడుపులో  
తూటాలు కూర్చి పేల్చిరి  
ఇలనాడు  
జాతి రత్నను  
గాంధీ మాతను గార్డ్సే

యం మధు (ఉస్మానియా యూనివర్శిటీ హైదరాబాద్)

## కొత్త ప్రధాన మంత్రి

క్రొత్త ప్రధాన మంత్రి ని గురించి వ్రాసిన వ్యాసమునకు నాయీ ఉపశృతి!

స్వాతంత్ర్యము సిద్ధించిన పిదప మన దేశము నెహ్రూ పరిపాలన క్రింద పదునైదు సంవత్సరములలో బహు ముఖాభివృద్ధి చెంది స్వాతంత్ర్యమునకు సార్ధకత సంపాదించుకొన్నది నెహ్రూ శకము మన దేశమునకు స్వర్ణశకమని భావింపనగును తదుపరి ఇందిరాగాంధీ పరిపాలన క్రింద భారత దేశము అంతర్జాతీయంగా పేరు ప్రతిష్ఠలు సంతరించుకొన్నదేగాని దేశీయంగా దిగజారుటకు ఉపక్రమించినది ఇందిరాగాంధీ పరిపాలించిన ఈ పదునైదు సంవత్సరములలో రాజకీయంగా దేశ పరిస్థితులు అట్టడుగంటినవి అవినీతి లంచగొండి తనం నిరవధికంగా పెరిగిపోయినవి ద్రవ్యోల్బణమునకు హద్దేలేక పోయినది పరిపాలనా యంత్రాంగం యిరుసు విరిగిన బండివలె నేల కొరిగినది భద్రతా సిబ్బందిలో గూడ పటిష్ఠత లోపించి చివరకు ఆమె తన రక్షక భటుల చేతనే అసువులను గోల్పోవలసి వచ్చినది

ఇటువంటి దేశ పరిస్థితులలో రాజకీయాలలో ఎట్టి అనుభవము లేని రాజీవ్ గాంధీ ఎలా ప్రధాన మంత్రిగా నెగ్గుకొని రాగలడో అన్నది అనుమానాస్పదమే కాంగ్రెసు పార్టీలో నున్న అనుభవజ్ఞులైన నాయకుల సహకారం అతనికి లభిస్తున్నదనుటకు ఏ ఆస్కారము లేదు ఇందిరాగాంధీ అధ్యక్షత క్రింద యున్నప్పుడే ఈ నాయకులు క్రమశిక్షణను విస్మరించి ఆమెకు ఎదురు తిరిగారు ఇప్పుడు అనుభవ రహితుడూ అసహాయుడైన రాజీవ్ గాంధీని ఈ పార్టీ నాయకులే ఆట పట్టించగలరు మన దేశమునకు ఇందిరాగాంధీకి సరితూగగల నాయకుడు లేక పోవడం శోచనీయం

ము సంజీవమ్మ మదనపల్లి

## విజ్ఞప్తి

నేను ఉత్తరాంధ్రలో స్వాతంత్ర్య సమరం సమరయోధుల చరిత్ర అను గ్రంధం వ్రాయుచున్నాను 1919వ సంవత్సము నుండి 1947 వ సంవత్సరము వరకు ఉత్తరాంధ్రలో జరిగిన స్వాతంత్ర్య సమరం వివరాలు తగు ఆధారములతో నా చిరునామాకు తెలియజేస్తే గ్రంధ ఆవిష్కరణ సమయంలో వారికి తగురీతిని గౌరవించి రూ 1 116–00 లు నగదు బహుమతి కూడ అందజేస్తాను

గమనిక బహుమతి సొమ్ము జిల్లాల వారీగ సమంగా పంచబడును తుది నిర్ణయం రచయితదే

వివరములకు శ్రీ ఆర్ వెంకటరావు శ్రీవాణీ నిలయం ఇంటి నె 2 2 9 36 ఇలిసిపురం వీది శ్రీకాకుళం 532001



*Printed and Published for Nageswara Rao Estates Private Ltd by S Nageswara Rao at the Andhra Patrika Press Gandhinagar Vijayawada-3 Editor S Radhakrishna*

*Phones P B X 61247 61248 & 75667*

# పెరిగే పిల్లలకి కావాలి కాంప్లాన్

## కేవలం కాంప్లాన్ లోనే వాళ్ళకు ప్రతి రోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.

పిల్లల పెరుగుదల సామాన్యంగా, వాళ్ళకి 15, 16 ఏళ్ళొచ్చేసరికి రమారమి పూర్తవుతుంది

ప్రోటీన్లు, పెరుగుదలకు నేరుగా తోడ్పడే పోషక పదార్థాలు అందుకే, మీ పిల్లలకు అవసరం, కాంప్లాన్—యిప్పుడు కాంప్లాన్‌లో అత్యుత్తమమైన ప్రోటీన్లు–పాల ప్రోటీన్లు (20%) ఉన్నాయి. దాంతోబాటే దాన్లో 22 యితర కీలక అహారపదార్థాలు ఉన్నాయి.

కాంప్లాన్ రుచికరమైన సువాసనల్లో దొరుకుతుంది.




**23**

కీలక ఆహార పదార్థాలు ఆరోగ్యబద్ధమైన పాళ్ళలో

| | |
|---|---|
| ప్రొటీన్ | రిబోఫ్లావిన్ |
| కొవ్వు పదార్థాలు | నికోటినమైడ్ |
| కార్బోహైడ్రేట్ | [illegible] |
| కేల్షియమ్ | పాంటొథెనేట్ |
| ఫాస్ఫరస్ | కోలిన్ |
| సోడియమ్ క్లోరైడ్ | పైరిడాక్సిన్ (బి6) |
| (సాధారణ ఉప్పు) | విటమిన్ బి12 |
| పొటాషియమ్ | ఫోలిక్ ఏసిడ్ |
| ఐరన్ | విటమిన్ సి |
| అయొడిన్ | విటమిన్ డి |
| విటమిన్ ఎ | విటమిన్ ఇ |
| విటమిన్ బి1 | విటమిన్ కె |

పాలు కలపనవసరం లేదు



**కాంప్లాన్®** – సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం